చతుర

అక్టోబరు 1982

సంపుటి : 5
సంచిక : 9

# ఈ నెల సమగ్ర నవల

అపర శ్రీరామచంద్రుని లా తండ్రి గీసిన గీటు దాటని పితృ వాక్య పాలకుడా అందగాడు. అందానికి తోడు ఆస్తి, ఆఫీసర్ ఉద్యోగం ఉన్న అతని ఒడిలోకి వచ్చి వాలిందొక ప్రేమ లేఖ. రాసిందెవరో, ఎక్కడ ఉంటుందో, ఎలా ఉంటుందో తెలీకుండానే అమాంతం ఆ లేఖ మోసుకు వచ్చిన కునేగా పరిమళంలో మునిగి మూర్ఛనలు పోసాగాడా యువకుడు. చివరికి తండ్రిని సైతం కాదని ఏర్పాటయిపోయిన తన పెళ్ళిచూపుల్ని సైతం తనే పాడుజేసుకోబూనుకున్నాడు. కాని, ఎంత వెదికినా ఆ...

## ప్రేమలేఖ

తప్ప, దానిని విరచించిన ప్రేయసి కళ్ళెదుట కనబడకపోతే ఏం చేయగలడా అమాయకుడు. ఇంతకీ ఎవరా అజ్ఞాత సౌందర్య రాసి? మొహం చూపకుండానే మనసును దోచుకో గలిగిన ఆ కలియుగ సత్యభామ చివరికేమయింది?

### పి. విజయ లక్ష్మి

యువ హృదయాలకు గిలిగింతలు కలిగేలా రూపొందించిన సరదా సరదా నవల 'ప్రేమలేఖ' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం- ఎస్. శివన్నారాయణ

రెండవ కవరు<br>మూడవ కవరు } సూరజ్. ఎస్. శర్మ

నవలబొమ్మలు—శ్రీధర్

# రచయితలకు సూచనలు

- జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
- ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
- *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
- నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
- అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
- ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
- 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.*

# పెళ్లి బేడీలు

తెల్లగా, గుండ్రంగా, సాగదీసిన గుమ్మడిపండులా వుండే ఓ అమెరికా చిత్రకారుడికి పెళ్ళంటే మా చెడ్డ సరదా. 'మేరేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్' అన్న ఆంగ్లసూక్తి మీద ఇతనికి బొత్తిగా నమ్మకంలేదు. స్వర్గంలో ఒకటే పెళ్లి జరుగుతుంది. కానీ ఇలాతలంమీద ఇష్టమొచ్చినన్ని పెళ్లిళ్లు చేసుకోవచ్చునన్న ఉద్దేశ్యంవున్న ధీశాలి. మంచి స్వదేశాభిమాని కూడా.

అందుకే అమెరికా దాటి అడుగు బైట పెట్టకుండా కాస్తో కూస్తో అందం చందం, అంతో ఇంతో డబ్బు దస్కం వున్న అమ్మాయిల్ని వెతికి పట్టుకుని ఒకరికి తెలీకుండా ఒకర్ని 83 మందిని పెళ్లి చేసుకున్నాడు. అందగాడు మగడైనందుకు అమ్మాయిలూ సంబరపడ్డారు. రాజుగారికి రెండో భార్యంటే మోజన్నట్లు మన ధీశాలికి చివరిగా వివాహమాడిన 83వ భార్య షరోన్‌క్లార్క్ అంటే అలవికాని అనురాగం.

మిగతా 82 మంది సంగతి చెప్పకుండా వాళ్ల నడిగి డబ్బు, నగలు, ఇంకా విలువైన వస్తువులూ తీసుకుని క్లార్క్‌తో వుడాయిద్దామనుకుంటుంటే ఎలాతెలిసిందో ఏమో హుటాహుటిన వచ్చిన పోలీసులు ఉచితరీతిన సత్కరించి, బేడీలువేసి



భార్యాభర్తలిద్దర్నీ జైల్లోకి తోశారు.

హాయిగా, జోరుగా, తియ్యగా గడుపుకోవల్సిన హనీమూన్ ఇలా కటకటాల వెనక్కి జరిగిపోయిందేమా అని ఆయాసపడుతున్నారిద్దరూ. ఎంతైనా పుణ్యంకొద్దీ పురుషుడని ఊరికే అన్నారా !

# పీపింగ్‌టామ్ ప్రపంచం

తలుపు కన్నాల్లోంచి, కిటికీ సందుల్లోంచి దొంగతనంగా తొంగిచూసేవాళ్ళని ఆంగ్లంలో సరదాగా 'పీపింగ్‌టామ్' అంటారు. అంకుల్ టామ్‌లాగ ఈ పీపింగ్‌టామ్ వెనుక కూడా ఓ బుల్లికథ వుంది.

వైభవోపేతమైన జీవితం గడిపిన రోమ్ దేశ యువరాణుల్లో ఒకరైన లేడీ గోడివ చాలా అందగత్తె. ఆమెకులేని హాబీలేదు. ఓరోజు వున్నట్టుండి ఒంటిమీద నూలుపోగు లేకుండా నగ్నంగా గుర్రపుస్వారీ చేయాలని ఆవిడకో వింతకోరిక పుట్టింది. వినడానికి కోరిక చపలచిత్తంగా అనిపించినా యువరాణి మాట చచ్చినట్లు మన్నించి తీరాలి గనక మంత్రులంతా కలసి దానికో తరుణోపాయం కనిపెట్టారు.

లేడీ గోడివ గుర్రంమీద నగ్నంగా నగర ప్రదక్షిణ చేసినంతసేపూ రోమ్ నగరంలోని మగవారంతా తలుపు లేసుకుని ఎవరిళ్ళల్లో వాళ్ళు వుండిపోవాలనీ, మగపురుగన్నది బైటికి కనిపించటానికి



వీల్లేదనీ,ఆజ్ఞ నుల్లంఘించినవారు శిక్షార్హు
లనీ దండోరా వేయించారు.

రాజులతో గొడవ పడ్డమంటే కొరివితో
తలగోక్కోవడమే కదా! మనకెందుకొచ్చిన
గొడవ! గొడివగార్ని చూస్తే ఎంత,
చూడకపోతే ఎంత అని వూరు వూరంతా
తలుపులేసుకుని లోపల కూర్చుంది. కానీ
అప్పనంగా వచ్చిన ఈ బంగారు అదృ
ష్టాన్ని, మహదవకాశాన్ని వదులుకోదల్చు
కోలేదు రసహృదయుడు, పాతికేళ్ళ నవ
యువకుడు సార్వీన్‌డిగర్. తలుపు ఓర
వాకిలివేసి పక్కన నక్కి 'రాయల్ బ్యూటీ'
నగ్న సౌందర్యాన్ని నయనానందకరంగా
వీక్షిస్తున్న,డిగర్ నిఘావిభాగం కళ్లల్లో
పడిపోయేడు.

అతన్ని అరెస్ట్‌చేసి వధస్థలి ఎక్కించి
"చివరిసారిగా ఏమైనా చెప్పుకోదలిస్తే
చెప్పుకో" అని అడిగితే "అందాల యువ
రాణి మహత్తర మనోజ్ఞ సౌందర్యాన్ని
కళ్ళారా చూశాక ఈ ప్రపంచంలో ఇంక
దేన్నీ నాకు చూడాలని లేదు. ఎవరూ
చేయలేని పని చేసి రాజాజ్ఞను ధిక్కరిం
చిన నా ధైర్యం, కీర్తి చరిత్రలో మిగిలి
పోతుంది. అంతకుమించి నాకేం వద్దు.
ఈ జన్మకి తృప్తిచాలు" అన్నాట్ట.
చరిత్రలో, మొట్టమొదటి 'పీపింగ్‌టామ్'గా
అతన్ని గురించి ఆ పైన తమపని
కావించారు శిరచ్ఛేదకులు.

అప్పట్నించి పీపింగ్‌టామ్ అనిపించు
కోవడం ఘనతగా వుండేది. కానీ రాను
రాను అటువంటి పన్లు చేసేవాళ్ళని చాలా
చులకనగా చూసి అసహ్యించుకునే స్థితికి
చేరింది సమాజం.

# అద్భుతదేశం

ఖైదీల దగ్గరే జైలు తాళాలుండి
జైళ్ళలో సర్వసుఖాలు, సకల సౌక
ర్యాలు వుండే దేశం 'లీచెన్‌స్టైన్'. మధ్య
యూరప్‌లో అరవై ఒక్క చదరపుమైళ్ళ
విస్తీర్ణంలో ఉన్న స్వతంత్ర ప్రతిపత్తి
గల దేశం ఇది.

ఇక్కడొక్క విమానాశ్రయమూలేదు.
గత శతాబ్దంనుండి సైన్యం కూడా లేదు.
పన్నెండు మంది సభ్యులున్న ఒకేఒక్క
పోలీసు బెటాలియన్ మాత్రం వుంది.
ఫిరంగులు, తుపాకులు మచ్చుకి కూడా
కనబడవు.స్త్రీలకు ఓటింగు హక్కు లేదు.
విడాకులకు ఈ దేశం అనుమతించదు.
ఉన్నవి మూడే రైల్వేస్టేషన్లు.దేశరాజధాని
జనాభా మూడు వేలయితే అక్కడి ఓ
కుగ్రామ జనాభా తొంభైఎనిమిదిమాత్రమే.
వెతికి పట్టుకుందామన్నా ఒక్క బీద
వాడు దొరకడీ దేశంలో. నిరుద్యోగులకి
ఎలవెన్స్ దొరుకుతుంది. ఆదాయపు
పన్ను ఒక శాతానికి మించదు. దేశం
మొత్తంమీద ఒకే ఒక సినిమా థియేటర్
ఉంది. దానిలో వారానికోసారి పెద్దలకు
మాత్రమే ఓ సినిమా చూపిస్తారు.

ఇక్కడున్న జైల్లో ఒక్క ఖైదీని
మాత్రమే బంధించడానికి వీలుంది.
రెండవవారికెవరికైనా జైలు శిక్ష పడితే
మొదటిఖైదీ విడుదలయ్యేంతవరకూ వేచి
వుండాల్సిందే. ఇంకో గొప్ప విషయం
ఏమిటంటే జైలు తాళం చెవులు ఖైదీ
దగ్గరేవుంటాయి. క్రిస్మస్ సమయంలో
అతను యథేచ్ఛగా యింటికెళ్లి కుటుంబ
సభ్యులతో పండుగను వైభవంగా జరుపు
కుని మళ్ళీవచ్చి జైల్లో కూర్చుని తాళం

# మీ పాపాయికి అప్పుడే 3 నెలలు నిండాయా?

అయితే ఇక మీద కేవలం పాలే
మీ పాపాయికి కావలసిన <u>ఐరన్</u> సమకూర్చలేవు.



## అతడికి పుష్కలంగా ఐరన్ కల ఫారెక్స్ ఇవ్వండి

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

డాక్టర్. సుభాష్ సి. ఆర్య:




**డాక్టర్లు సిఫార్సు చేస్తారు**

# ఫారెక్స్

CASGLF-32-182 TEL



వేసుకోవచ్చు.

కృత్రిమ దంతాల ఉత్పత్తిలో ప్రపంచం మొత్తంమీద ఈ దేశానిదే అగ్ర స్థానం. ఇక్కడ సింథటిక్ మాంసం కూడా తయారవుతుంది. ప్రతి సంవత్సరం కొన్ని లక్షలమంది టూరిస్టులు ఈ దేశం మీదుగానే ప్రయాణం చేస్తుంటారు. కానీ వారి నాకర్షించేందుకు హోటళ్ళు, నైట్ క్లబ్బులు, డ్రామా థియేటర్లులాంటివేవీ ఈ దేశంలో లేక పోవటం వల్ల టూరిస్టులు అక్కడ దిగే అవకాశంలేదు.

ఈ దేశపు రాజుగారింట్లో కూడా నౌకర్లులేరు. రాణిగారు స్వయంగా సైకిలు మీద బజారుకెళ్ళి ఇంటికి కావల్సిన సరుకులు కొని తెచ్చుకుంటుంది. ప్రధానంగా వ్యవసాయిక దేశం కావటంవల్ల ప్రభుత్వం రైతులకు కావల్సినంత భూమిని సాగుబడి కోసం ఇస్తుంది.

ఎంతహాయి! ఎంత ఆనందం! మరెంతటి అదృష్టం! వచ్చే జన్మలోనైనా ఆ దేశంలో పుట్టాలని కోరుకోవచ్చు పునర్జన్మలో నమ్మకం ఉంటే.

# 'కోకో' కథ

కూరల్లో రాజు 'వంకాయ' అయినట్లే కూల్‌డ్రింక్స్‌లో మహారాణి 'కోకో కోలా'. రాణులకీ, రాజులకీ చరిత్ర వున్నట్లే 'కోకో'కి కూడా చెప్పుకోదగ్గ చరిత్రే వుంది.

అమెరికాలో నివసిస్తున్న జాన్ పెంబర్టన్ అనే ఫార్మసిస్ట్ 1885లో ఓ కొత్త రకం వైన్ ఫార్ములాను తయారుచేసి దానికి 'ఫ్రెంచ్ వైన్ కోలా' అని పేరు పెట్టాడు. నరాల ఉపశమనానికి ఈ మందు గొప్ప టానిక్‌లా పనిచేసేది.

ఓ ఏడాది గడిచాక పుస్తకాల బిజినెస్ చేసే ఓ స్నేహితుడు అతన్ని కలిసి మంచి అమ్మకం, పాపులారిటీ కావాలంటే ఏ వస్తువుకైనా ముందు పేరు ఆకర్షణీ

యంగా వుండాలి గనుక పేరు మార్చమని సూచించాడు. వెంటనే జాన్ ఫ్రెంచ్ వైన్ కోలాను 'కోకోకోలా'గా మార్చి అందులో వైన్ శాతాన్ని తగ్గించి కొంచెం 'కఫీయిన్' అనే పదార్థాన్ని కలిపేడు. కొబ్బరి నుండి, కొన్ని ఇతర తైలాలనుండి మరో ప్రత్యేక ఫార్ములాను తీసి దాన్నికూడా ఆ పానీయానికి కలిపాడు. అన్నీ కలిసి కోకోకోలా అయింది.



మొదట్లో ఇది చాలా పరిమితంగా మందుల దుకాణాల్లో మాత్రమే దొరికేది. రానురాను దాంట్లోని నీటిశాతం పెంచిన తర్వాత బహుళ ప్రజాదరణ పొంది అన్ని చోట్లా అమ్మటం మొదలయింది.

ఓసారి ఓ వ్యక్తి అనుకోకుండా దాంట్లో సోడావాటర్ కలిపి తాగటంతో 'కోకోకోలా'కి కొత్త రుచి వచ్చినట్లయి ఆనందం పట్టలేక ఆ విషయం అందరికీ చాటాడు.

ఆ తర్వాత ఎవరికి వారు సోడానీళ్లు కలుపుకునే శ్రమ లేకుండా తయారీదారులే ఆ పానీయంలో అన్నింటితోబాటు సోడా గ్యాస్ కూడా తగిన పాళ్ళల్లో కలపడం మొదలెట్టారు.

కోకోకోలా ఈనాడున్న స్థాయికి 1916 లోనేచేరినా ఇవ్వేట్టివరకూ దాని ఫార్ములా మాత్రం ఎవరికీ తెలీకుండా చాలా పకడ్బందీగా అతి రహస్యంగా దాచబడింది.

ఇప్పటివరకూ ఏడుగురికి మాత్రమే కోకోకోలా ఫార్ములా ఏమిటో తెలుసు. అందులో ఇద్దరే ప్రస్తుతం బతికున్నారు. వాళ్ళిద్దరూ కూడా కోకోకోలా కంపెనీలో కెమిస్టులుగా పనిజేస్తున్నారు. రూల్ ప్రకారం వాళ్ళిద్దరూ కల్సి ప్రయాణం చేయకూడదు. ఏ పేపర్లోనూ, పత్రికలోనూ 'కోకోకోలా' గురించి ఏ విధమైన రచనా చేయరాదు. వాళ్ళిద్దరూ చచ్చిపోతే 'కోకోకోలా' ఎలా?' అని కంగారు పడకండి. ఓ బడా బాంకు లాకరులో సదరు రహస్య ఫార్ములా భద్రంగా ఉంది.

ప్రపంచం మొత్తంమీద 138 దేశాల్లో రోజుకి పదికోట్ల కోకోకోలా చెల్లుబడి అవుతున్నాయని గత సంవత్సరపు లెక్కలు చెబుతున్నాయి *

మధ్యాహ్నం పన్నెండున్నర అయింది. వేసవి ఎండ మండిపోతోంది. రోడ్లన్నీ ఖాళీగావున్నాయి. 'ఎందుకొచ్చిన ఖర్మరా దేవుడా!' అనుకుంటూ విధిలేక తప్పని సరిగా తిరుగుతున్న కొంతమంది తప్ప మిగతా అందరూ ఇళ్ళలోనే వున్నారు. కూల్ డ్రింకులు, సోడాలు, కొబ్బరి బొండాలకి మహా డిమాండుగా వుంది. అలాంటి సమయంలో ఆ బాధ తెలిసే అవకాశం లేని ఎ.సి. రూమ్‌లో రివాల్వింగ్ ఛైర్‌లో కూర్చుని ఏవో పేపర్లు చూస్తున్నాడు ఆనందరావు.

మెల్లిగా శబ్దం చెయ్యకుండా తలుపు తెరుచుకుంది. అతని సెక్రటరీ మార్గరెట్ హైహీల్స్ శబ్దం రాకుండా మెల్లిగా నడుచుకుంటూ వచ్చి అతని ముందున్న పెద్ద టేబుల్‌మీద లెటర్స్ వుంచింది. ఒకసారి మార్గరెట్ వంక చూసి, ఆ లెటర్స్ అన్నీ చదివి చూసుకుని టకటక సంతకాలు పెట్టి అందించాడు. అందుకొని వెళ్ళిపోయింది మార్గరెట్.

తల ఎత్తి వాల్ క్లాక్ వైపు చూశాడు. ఒంటిగంట. మెల్లిగా లేచి తలుపు తెరుచుకుని బైటికి వచ్చాడు. అలవాటు ప్రకారం మార్గరెట్ టేబుల్ దగ్గర ఆగాడు. అతన్ని చూస్తూనే లేచి నిలబడి చిరునవ్వు నవ్వి "ఇవిగోండి సార్" అని అతని పర్సనల్ లెటర్స్ అందించింది.

"థాంక్యూ" అనేసి లెటర్స్ జేబులో పెట్టుకుని టకటక మెట్లు దిగి కిందికి వచ్చాడు. అతన్ని చూడగానే అప్పటిదాకా చెట్టుకింద కూర్చుని బీడీ కాల్చుకుంటున్న డ్రైవర్ రంగస్వామి పరుగున వచ్చి కారు తలుపు తెరిచి నిలబడ్డాడు. కార్లో కూర్చుని తాపీగా జేబులోని ఉత్తరాలు బైటికి తీశాడు ఆనందరావు. ముందర తండ్రి రాసిన కవరు విప్పాడు.

'చిరంజీవి ఆనందాయికి ఆశీస్సులు.

ఇక్కడ అంతా క్షేమం. నువ్వు క్షేమమని తలుస్తాను. నీకు బోలెడు సంబంధాలు వస్తున్నాయని ఇదివరలో రాసి వున్నాను. నువ్వు ఏమీ సమాధానం రాయలేదు. నీ ఉద్దేశం ఏమిటో నాకు అర్థం కావడంలేదు. నాకు నీ సంగతి బాగా తెలుసు. ఏదో గొప్ప చదువు చదివి, పెద్ద ఉద్యోగం చేస్తున్నానని నీ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించాలని నువ్వనుకుంటే పొరపాటుపడ్డావనే చెప్పాలి. వెధవ ప్రేమలూ దోమలూ అంటావేమో! అలాంటి వేషాలు పనికిరావు. అవి మన ఇంటా వంటా లేవు. అలాటి పోకిరీ వేషాలు ఏమీ వేయక మర్యాదగా నేను చెప్పినట్టు విని చూపిన సంబంధం చేసుకో. లేకపోతే నీ కాళ్లు విరగ్గొట్టి మరీ పెళ్ళి పీటల మీద కూర్చోబెట్టగలనని నీకు వేరుగా చెప్పనక్కర్లేదనుకుంటాను. కాబట్టి బుద్ధిగా రా...

నాలుగు సంబంధాలు రెడీగా వున్నాయి. చూసి ఎంచుకో. పిచ్చి వేషాలు వెయ్యకు. వెంటనే సమాధానం రాయి. లేకపోతే నేనే వచ్చి అక్కడే నీ పెళ్ళి చేస్తాను. బాబిగాడు, వాడి భార్యా కులాసాగానే వున్నారని వాడి ఉత్తరం ద్వారా తెలిసింది. కామేశ్వరి, సూర్యం వాళ్ల వూరిలో క్షేమం. వెంటనే ఉత్తరం రాయి.

నీ తండ్రి
పరంధామయ్య'

చదవడం ముగించి చెమట తుడుచుకున్నాడు ఆనందరావు. తండ్రిని చూస్తే

అతనికి చచ్చే భయం. బి. ఇ. పాసయిన తర్వాత కూడా నలుగురిలో పెట్టి ముక్క చివాట్లు పెట్టేవాడు. ఖర్మ. అపుడు తీరిక లేక ఉత్తరం రాయలేదు. వెంటనే రాయాలి. లేకపోతే వెంటనే వచ్చి ఛాంబరు లోంచి గొడుగు మెడకి తగిలించి బైటకి లాగి 'అప్రాచ్యుడా...అంట్లవెధవా' అని గనక తిట్టాడంటే నానా గోల అయి నలుగుర్లోను పరువుపోతుంది.

తండ్రిని తల్చుకుని భయంగా జేబులు తడుముకున్నాడు. ఇంతలో కారు ఓ పెద్ద హోటలు ముందాగింది. దిగి లోపలికి వెళ్ళి ఎదురుగా వున్న రిసెప్షన్ పక్కనే నిలబడి ఓ ఇన్‌లాండ్ కవర్ తీసుకుని తండ్రి అడ్రసుకు ఉత్తరం రాసేశాడు.

డ్రైవరు రంగస్వామిని పిల్చి పోస్ట్‌లో పడేయమని చెప్పి ఎ.సి. డైనింగ్ హాల్లోకి అడుగుపెట్టాడు. లోపలంతా మసక వెలుతురు. చల్లగా, హాయిగా వుంది. ప్రాణం లేచి వచ్చింది ఆనందరావుకి. 'ఏమిటో! ఎ.సి.కిఅలవాటు పడిపోయాను' అనుకుంటూ వెళ్ళి ఖాళీగా వున్న ఓ బల్లముందు కూర్చున్నాడు. ఒక్క నిమిషం ఆగి మిగతా ఉత్తరాలు బయటకి తీశాడు. అక్క రాసింది ఒకటుంది వాటిల్లో.

చిన్నగా నవ్వుకుని, బల్లమీద పెట్టి లేచి వెళ్ళి వాష్‌బేసిన్ దగ్గర మొహం కడుక్కుని, రుమాలుతో తుడుచుకుంటూ వచ్చి కూర్చున్నాడు. సర్వర్ వచ్చాడు. "వెజిటేరియన్ స్పెషల్ మీల్" అన్నాడు ఆనందరావు. అతను వెళ్ళిపోతుంటే వెనక్కిపిల్చి "ఒక్క పది నిమిషాలు ఆగి తీసుకురా" అని చెప్పాడు.

అక్కయ్య ఉత్తరం చింపి చూశాడు.

పెద్ద ఉత్తరం. తన కష్టసుఖాలు మొరపెట్టుకుంది. గద్వాల చీర, రాళ్ళ గాజులు తెచ్చిపెట్టమంది.

'నీకు పెళ్ళి సంబంధాలు చూస్తున్నారటకదా. ఒరేయ్ ఆనంధూ! మావూరి మేడ సాంబయ్యగారి కోడలి తమ్ముడి పెళ్ళికి ఆవిడకి ఆడబడుచు లాంఛనాలు ఇచ్చార్రా. చూస్తే కళ్ళు తిరిగిపోయాయనుకో. నేనేం వాటాలడిగానా? పొలాలడిగానా మనవాళ్ళని. పోనీలే, నీపెళ్లికి నాకు ఘనంగా లాంఛనాలు వచ్చేలా చూడరా ఆనంద్! ఏదో అక్కయ్యని. నాకు లేక కాదు. మా తమ్ముడి పెళ్ళికి ఇచ్చారని నలుగురికీ చూపించుకుంటాను. వెయ్యి నూటపదహార్లు, పట్టుచీర, వెండి బొట్టుపెట్టె, స్టీలు పానకం బిందె కావాలిరా నాకు. నోరు తెరిచి అడిగాను. మరి ఇక నీ ఇష్టం. నాన్న సంగతి నీకు తెలుసుగా. అన్నయ్యకి ఏదీ పట్టదు. కాస్త నువ్వే పట్టుపట్టాలి మరి. నీ ఆరోగ్యం జాగ్రత్త.

నీ అక్కయ్య
కామేశ్వరి'

చదువుకుని నవ్వుకున్నాడు ఆనందరావు. పాపం అమాయకురాలు. నా పెళ్ళికి దానికి కావల్సినవి అన్నీ కొని పెట్టాలి అనుకున్నాడు.

సర్వర్ టేబుల్‌మీద మంచినీళ్ళ గ్లాసు, స్టీల్ ప్లేట్ పెట్టాడు. మంచినీళ్లు తాగి మిగిలిపోయిన మూడో ఉత్తరం తీశాడు. కవరు లేత గులాబీ రంగులో వుంది. మూడు నాలుగు పోస్టు ముద్రలున్నాయి. అటూఇటూ తిప్పి చూశాడు. 'ఒ.ఎ. రావు, మేనేజర్' అని వుంది. వెనక్కి తిప్పి చూశాడు. 'ఫ్రం సోనీ' అని రాసుంది.

'ఎవరా ఈ సోనీ!' అని ఆలోచించాడు. పేరు, అడ్రసు తనదే. కానీ సోనీ అనే పరిచయస్తులెవరూ లేరు.

కవరు బరువుగా వుంది. సోనీ ఎవరబ్బా! ఒకవేళ "ఈ 'సందేశమును చదివినవారు వందసార్లు రాసిగానీ, అచ్చు వేయించిగానీ పంచిపెట్టవలెను. లేనిచో ప్రాణ నష్టము వాటిల్లగలదు" అనే బాపతు ఏమన్నానేమో అనుకున్నాడు. సరేలే చదివితే సరిపోతుంది... అనుకుంటూ జాగ్రత్తగా చింపి లోపలి కాగితాలు బైటికి లాగాడు.

గులాబి రంగు సుతిమెత్తని కాగితాలు. సన్నగా వస్తున్న 'కునేగా' సెంటు పరిమళం. ఓ క్షణం దృష్టి మరల్చి ఎదురుగా పళ్ళెంలో వున్న చిప్స్ నాలుగు తీసి నోట్లో వేసుకుని ఉత్తరం విప్పాడు.

'ప్రియా!

ఉలిక్కిపడ్డాడు ఆ సంబోధన చూసి. కళ్ళు నులుముకుని మరో రెండు చిప్స్ నోట్లో వేసుకుని మళ్ళీ ఉత్తరంలోకి చూశాడు.

"ప్రియా... నా ప్రియతమా!

ఎన్నాళ్ళు నాకీ నిరీక్షణ?

ఎన్నాళ్ళు నాకీ విరహ వేదన?

శిలవంటి నీ మనసు నా ఆరాధనకు కరగటం లేదు.

అందుకే ఇలా ముఖాముఖి నా మనసు తెలియజేస్తున్నాను.

నువ్వు దగ్గరలేని లోటు ప్రతిరోజు, ప్రతిగంట, ప్రతి నిమిషం, ప్రతిక్షణం నన్ను బాధపెడుతోంది కదా! మరి నీకు నా లోటు తెలియడంలేదా?

లేక నీకు నా మీద ప్రేమ లేదా?

వద్దు ప్రియా! ఆ ఆలోచనే భరించలేను. ఆ ఊహకే నా మనసు కుంగిపోతోంది.

నా మనసు నీదైనపుడు, నా సర్వస్వం నీదైనపుడు, నేను నీదాననైనపుడు...

నువ్వు నావాడివి కాకుండా ఎలా వుంటావు చెప్పు? నాకు నీ మనసు తెలుసు. నువ్వు నావాడివనీ తెలుసు. కానీ మధ్యమధ్య ఏ దుష్టశక్తి అయినా మనిద్దరినీ విడదీస్తుందేమో అనే భయం కలగగానే కంపించిపోతూ వుంటాను. మరుక్షణం నువ్వు గుర్తు రాగానే, నీ రూపం నా కనులముందు కదలాడగానే నా భయం పటాపంచలయిపోతుంది. ఎక్కడలేని ధైర్యం వచ్చేస్తుంది. నువ్వే నాకు అండగా ఉంటే ఈ ప్రపంచం అంతా ఎదురై పోరాడినా జయం నాదే అనిపిస్తుంది. కానీ ఎన్నాళ్ళు ఇలా దూరంగా వుందాం చెప్పు?

జరిగిపోయిన ప్రతిక్షణం నాకు దిగులు రేకెత్తిస్తోంది. ఒక్కొక్క రోజు గడిచిపోతుంటే ఇక ఈ రోజు తిరిగి రాదు కదా, జీవితంలో ఒకరోజు తరిగిపోయింది కదా అని భయం వేస్తోంది.

మరి! నీకలా లేదా?

ఎన్ని ఉదయాలు...

ఎన్ని చల్లని సాయంత్రాలు...

ఎన్ని మధురమైన రాత్రులు...

వృధాగా పోతున్నాయో చూడు.

గడిచిపోయిన కాలం ఎంత మొత్తుకున్నా తిరిగి వస్తుందా?

డబ్బు సంపాదించవచ్చు, ఏదైనా తిరిగి పొందవచ్చుగానీ గడిచిపోయిన కాలాన్ని తిరిగి రప్పించగలమా? అన్నీ తెలిసిన నువ్వు,అంతచదువుచదివి అంతవిజ్ఞానాన్ని సంపాదించుకున్న నువ్వు నా విషయంలో ఎందుకింత తాత్సారం చేస్తున్నావో నాకు

అర్థం కావడం లేదు. ఇకనైనా నన్ను కరుణించి నా దగ్గరకు రాకూడదూ?

నీ ఆదరణ కోసం, నీ ప్రేమకోసం పరితపించి పోతున్న నన్ను నీ చేతుల్లోకి తీసుకుని, నీ ప్రేమను నాకు తెలియజేయకూడదూ?

ఎన్నాళ్ళీ ఎడబాటు మనకు?

ఎన్నాళ్ళు ఈ దూరం?

ఎపుడు దగ్గరవుతావు నాకు?

నేను ఎన్నెన్ని ఊహించుకున్నానో తెలుసా? మన కోసం, మన భావి జీవితం కోసం ఎన్నెన్ని తియ్యని కలలు కంటున్నానో తెలుసా?

అదిగో! నీకు కోపం వచ్చేసింది. నాకు తెలుసు. నేను క్షణం తీరిక లేకుండా నీ కోసం శ్రమపడుతూ వుంటే నువ్వు హాయిగా కలలు కంటున్నావా అనుకుంటున్నావు కదూ!

ఏయ్! ఎందుకంత చిరాకు? నీ కోసమేగా నేను కలలు కనేది. అన్నీ ఊహించి సిద్ధంగా వుంచుకుంటే మంచిది.

రేపు మన పెళ్ళయ్యాకా కలలుకనే తీరిక నాకు వుంటుందా!

నువ్వు అంత తీరికగా నన్ను కలలు కననిస్తావా?

అందుకే ఇపుడే నేను కష్టపడి కలలు కంటుంటే అలా చిరాకు పడ్డావంటే నాకు కోపం వచ్చేస్తుంది మరి.

ఆ...అదీ! అలా నవ్వు. ఇలా నా దగ్గరగా రా! నా చెయ్యి పట్టుకో. నా ఊహా ప్రపంచంలోకి నిన్ను తీసుకెళ్తాను.

అదుగో! అదే మన ఇల్లు. లేత నీలం రంగు డిస్టెంపర్ వేసిన చిన్న మేడ. ముద్దొస్తూవుంది. అందంగా, హుందాగా అచ్చు నీలాగే వుంది కదూ! అంత మురిసిపోకుమరి. లోపలికి వెళదాం రా!

ముందు డ్రాయింగ్ రూమ్. అది దాటాకా మన బెడ్‌రూమ్. చక్కని సన్‌మైకా వేసిన మంచం.

దానిమీద లేత నీలం బ్లాంకెట్ కప్పుకుని నువ్వూ, నేను.

నీ కౌగిలిలో వెచ్చగా హాయిగా పడుకున్న నన్ను చుప్పనాతి గడియారం అరిచి నిద్రలేపింది. మండిపడుతూ దాని వంక చూశాను. ఏడున్నర! మెల్లిగా నీకు నిద్రాభంగం అవకుండా లేచి దాని నోరు నొక్కి నీ పాదాలు కళ్ళకద్దుకుని బాత్‌రూమ్‌లోకి నడిచాను.

హాయిగా స్నానం చేసి మెరూన్ రంగు ఖటావ్ వాయిలు చీర కట్టుకుని, తల విరబోసుకుని జుట్టు ఆరబెట్టుకున్నాను.

వంటింట్లోకి వెళ్ళి వేడిగా జీడిపప్పు ఉప్మా చేసి హాట్ పాక్‌లో పెట్టి కమ్మటి ఫిల్టర్ కాఫీ తీసుకుని బెడ్‌రూంలోకి వచ్చాను. కప్పు టీపాయ్ మీద పెట్టి నీ పక్కన కూర్చుని నిన్ను నిద్రలేపాను.

లేచీ లేవగానే నన్ను చూశావు.

"ఛీ! వదులు. వదలమంటుంటే..." అని విసుక్కున్నాను.

"ఫో! మొండి ఘటం ఎక్కడో..." అంటే కొంటెగాచూస్తూ నన్నువదిలేశావు. నీకుకాఫీ అందించి కిటికీ తెరలు పక్కకి జరిపి, రేడియో సిలోన్ పెట్టి వెనక్కి తిరిగే సరికి నువ్వులేవు.

పక్క సరిచేసి, గదంతా సవరించి, వెళ్దామనుకుంటుంటే పిలిచావు బాత్‌రూమ్ లోంచి.

వచ్చాను నేను. షేవ్ చేసుకుంటున్నావు. నీ దగ్గరకు వచ్చి నీ భుజం మీద

నా గడ్డం ఆనించుకుని నీ దగ్గిర నుండి వస్తున్న కమ్మని షేవింగ్ క్రీమ్ సువాసనని ఆస్వాదిస్తూ ఎదురుగా అద్దంలో జంటగా కనిపిస్తున్న మన ప్రతిబింబాలను చూస్తూ నీతో కబుర్లు చెప్పాను.

షేవింగ్ ముగించి ఆఫ్టర్ షేవ్ లోషన్ రాసుకుని కాస్త నా చెంపలకీ రాశావు. ఇద్దరం డ్రెసింగ్ రూంలోకి వచ్చాం. ఒకే ప్లేటులో ఉప్మా పెట్టి తీసుకొచ్చి నీకు అందించాను.

"మరి నీకో?" అని అడగలేదు నువ్వు.

మనకు అలవాటు లేదుగా మరి.

హాయిగా నీ చేతుల్లో వాలి నీ మెడ చుట్టూ చేతులు వేసి కూర్చున్నాను. నువ్వే ఒక స్పూను నీకు, ఒక స్పూను నాకు తినిపించావు.

"అబ్బ కారం" అన్నాను నేను.

"అయ్యో!" అని కంగారుపడిపోయి మంచినీళ్ళు అందించావు.

ఇంకా కారంగానే వుందన్నాను.

నువ్వు చాలా చిలిపివాడివిలే. సరే! ఇద్దరం జంటగా కాఫీ తాగాం.

నిన్ను బాత్ రూంలోకి నెట్టి తలుపు మూసి, నీ బట్టలు, నీ బూట్లు తీసి రెడీగా పెట్టాను. స్నానం చేసి తల నీళ్ళు కారుతూనే వచ్చి కుర్చీలో కూలబడి పేపర్ చేతికి తీసుకున్నావు.

నువ్వు లోకం పోకడలు వివరిస్తూ వుంటే నేను టవల్‌తో నీ తల తుడిచాను.

"నువ్వు పేపరు చదవ్వేం?" అనడిగావు.

నాకా వెధవ పేపరు ఎందుకు? నాలోకం నువ్వే, నువ్వే నా ప్రపంచం. అదే చెప్పాను.

మరుక్షణం ఆ పేపరు అవతలకి విసిరేసి దానిస్థానంలోకి నన్ను తీసుకున్నావు. మనిద్దర్నీ చూసి భరించలేని గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టింది.

మెల్లగా విడిపించుకున్నాను. నువ్వు చిరాకుగా లేచి డ్రెస్ వేసుకున్నావు. నీ షర్టు బటన్లు పెట్టాను. టైనాట్ వేశాను. క్రాఫ్ దువ్వాను. నీకు నచ్చలేదు. చెరిపేసి మళ్ళీ దువ్వాను. అబ్బ! నీ నల్లని వంకుల జుట్టు దువ్వెనకి లొంగుతుందా? పావుగంట కుస్తీ పడితే నీకు నచ్చేలాగ దువ్వగలిగాను. నేల మీద కూర్చుని నీకు షూస్ వేశాను. కోటు చేతి మీద వేసుకుని డ్రాయింగ్ రూంలోకి వచ్చాను. నాతోనే వచ్చావు నువ్వు. ఇద్దరం సోఫాలో కూర్చున్నాం.

నాకు ఏమీ మాట్లాడాలనిపించలేదు. అలా నీ గుండె మీద వాలి గుండె చప్పుడు వింటూ కూర్చున్నాను.

నువ్వు ప్రేమగా నా తల నిమురుతున్నావు. అలా జీవితాంతం వుండిపోతే బావుండుననిపించింది. కానీ నాకు అంత అదృష్టం ఎక్కడిది? ఇంతలోనే రాకాసిలా వచ్చింది నీ కంపెనీ కారు. రాక్షసిలా అరిచింది వాకిట్లోంచి.

మెల్లిగాలేచి కోటు అందించాను. తొడుక్కున్నావు. నీ దగ్గరగా జరిగి ఆకుపచ్చని నీడలు తేలుతూ మంచి గంధం చెక్క రంగులో మెరుస్తున్న నీ చెంపల మీద నా పెదవులు ఆనించాను. బదులుగా నువ్విచ్చింది తీసుకున్నాను. వాకిట్లోకి నడిచాం. తలుపు దగ్గరే ఆగిపోయాను నేను. నువ్వు వెళ్ళి కారులో కూర్చుని నాకు చెయ్యివూపావు. నిన్ను తీసుకుని కారు వెళ్ళిపోయింది.

నాకు దిగులేసింది. తలుపువేసి లోపలికి వచ్చాను. ఎంత ఖాళీగా, ఎంత

మౌనంగా, ఎంత శూన్యంగా వుంది ఇల్లు? గడియారంపంక చూశాను. తొమ్మిదిన్నర మళ్ళా ఒంటిగంటకు వస్తావు నువ్వు. మూడున్నర గంటలు. తెల్లవారాక ఇప్పటిదాకా గడిచిన సమయం కూడా మూడున్నరగంటలే! కానీ ఎంత తేడా? కుందేలుకి, నత్తకి వున్నంత తేడా. బృందావన్ గార్డెన్‌కీ, సహారా ఎడారికీ వున్నంత తేడా. నాగలోకానికి, నక్కకి వున్నంత తేడా.

పనిమనిషి నన్ను లోకంలోకి తీసుకు వచ్చింది. అంత ఎండ ఎక్కాక వస్తుందా పనిమనిషి అనుకుంటున్నావేమో. మన ఇంట్లో అంతే! నువ్వున్నంత సేపూ మనిద్దరమే వుండాలి ఇంట్లో. గువ్వల జంటలా, కుందేళ్ళ జంటలా హాయిగా వుండాలి. పదిన్నరకి నువ్వు ఫోన్‌చేసి ఏం చేస్తున్నావంటే "నిన్ను తల్చుకుంటున్నాను, మరి నువ్వు?" అని ఎదురు ప్రశ్న వేశాను.

"నాకా అదృష్టం లేదు. పనిలో పీకల్దాకా మునిగిపోయి వున్నా" నన్నావు దీనంగా.

"ఫరవాలేదు, ఉద్యోగం పురుష లక్షణం" అని ఓదార్చాను నేను. మళ్ళీ పదకొండున్నరకి ఫోన్‌చేసి "అన్నంలోకి ఏంచెయ్యను?" అనడిగితే—

"నీయిష్టం" అన్నావు.

"కాదు నీయిష్టమే" అన్నాను.

"పోన్లే మనకిష్టమున్నది చేసేయ్" అన్నావు.

వంట ముగించి అన్నీ సర్ది మళ్ళీ ముఖం కడుక్కుని చీర మార్చుకుని ఫ్రెష్‌గా తయారై టేప్ రికార్డరు వింటూ కూర్చున్నానో లేదో ఒంటి గంట దాటిన పదినిమిషాలకల్లా పూలరథంలా నీతో వచ్చింది కారు. ఎదురు వచ్చాను. అలసటగా వున్న నీ దగ్గర్నించి కోటు అందుకున్నాను. బెడ్‌రూంలోకి తీసికెళ్ళి, టై వదులు చేసి, షూస్ విప్పి చల్లటి మంచి నీళ్ళు ఇచ్చాను. నిన్ను నాచేతుల్లోకి తీసుకుని సేదదీర్చాను. కాసేపటికి అలసట తీరి మామూలుగా అయ్యావు.

డైనింగ్ టేబుల్ మీద ఒకే కంచంలో అన్నం వడ్డించాను. ఈసారి డ్యూటీనాది. నేనే తినిపించాలి నీకు. నీతో పాటే నేనూ తిన్నాను. ఇద్దరం హాయిగా కబుర్లు చెప్పుకుని సరదాగా నవ్వుకున్నాం. మళ్ళీ కార్లో వెళ్ళిపోయావు.

నిద్రపోతున్న నాకు ఫోన్ మోతతో మెలుకువ వచ్చింది. ఇంకెవరు? నువ్వే!

"సాయంత్రం ప్రోగ్రామ్ ఏమిటి?" అన్నావు.

"నీ ఇష్టం"

"అయితే విను. సాయంత్రం కాసేపు



డాబామీద కూర్చుని కబుర్లుచెప్పుకోవడం, ఎనిమిదింటికి హోటల్లో భోజనం, సెకండ్‌షో చూసి ఇంటికి రావడం, ఆ తర్వాత..."



నువ్వలా అంటుండగానే ఫోన్ పెట్టేశాను. మళ్ళీ బద్ధకంగా పడుకుని, నాలుగున్నరకి లేచి కాఫీ టిఫిన్ తయారుచేశాను. అయి పయ్యే సరికి తయారయి సిద్ధంగా నీ కోసం ఎదురు చూస్తూ వాకిట్లోనే నిల బడ్డాను. నువు వచ్చావు. నన్ను తదేకంగా చూసి—

"రేపట్నించి ఇలా నా కోసం బైట నిలబడకు" అన్నావు సీరియస్‌గా. ఉలికి పడి—

"ఏం ఎందుకని?" అడిగాను.

"అది అంతే! నువ్విలా రోడ్డు మీద నుంచోడం నాకు కష్టంగా వుంటుంది" నీ గొంతులో అదే సీరియస్‌నెస్.

"నా మీద నీకు అనుమానమా?" తెల్ల బోయిన నా గొంతు దీనంగా పలికింది.

సమాధానం చెప్పకుండా సీరియస్‌గా ఇంట్లోకి వెళ్ళావు. అయోమయంగా నీ వెంటనే వచ్చాను. నేను ఇంట్లోకి అడుగు పెట్టగానే నన్ను దగ్గరకి లాక్కున్నావు.

"రోడ్డు మీదే ఎదురైతే ఈ నిమిషం నిగ్రహించుకోడం ఎంత కష్టమో నీకు తెలీదు. అందుకే గుమ్మం లోపలే నా కోసం చూడు"

నా చెవిలో నీ గుసగుసలు విని తేలిక పడ్డ మనసుతో హాయిగా నవ్వుకున్నాను.

అనుకున్నట్లే డాబా మీది కబుర్ల య్యాక హోటలుకి వెళ్ళాం. హోటల్ బిల్డింగులాగే లోపల కూడా అందమైన ఫర్నీచరు. కమ్మని సంగీతం. చక్కని సువాసన. అంతా బాగానేవుంది గానీ ఆ సర్వర్ రెండు ప్లేట్లలో భోజనం తెచ్చి పెట్టాడు. నా మనసు చివుక్కుమంది. ఇద్దరం ఇక ముందు హోటల్లో భోజనం చెయ్యద్దని శపథం తీసుకున్నాం. ఎలాగో భోజనం ముగించి, చేతులు కలుపుకుని సినిమా చూసి ఇంటికి తిరిగి వచ్చేశాం. తిన్నగా బెడ్‌రూంలోకి వెళ్ళాం. మనం బైటకి వెళ్తూ మంచం మీద జల్లిన మల్లెలు విచ్చి ఘుమఘుమ లాడు తున్నాయి. నేను చీర మార్చుకుని కిచెన్‌లో పాలు వేడిచేసి పాల గ్లాసుతో వచ్చేసరికి మంచంమీద ఓరగా పడుకుని వున్నావు నువ్వు. సూటిగా నా కళ్ళల్లోకి చూసి మత్తుగా నవ్వావు. దగ్గరకు రమ్మని పిలిచావు. అడుగులో అడుగేసుకుంటూ మెల్లిగా నీ దగ్గరగా వచ్చాను.

ఛీ పో! ఆ తర్వాత చెప్పను!

చదివింది చాలుగానిఇంక ఊహా ప్రపం చంలోంచి బయటకివచ్చెయ్. ఇలా అన్నా నని నీకు కోపం వచ్చింది కదూ? అలాగే కావాలి నీకు. లేకపోతే నువ్వు చేసేది బావుందా? నన్ను నా ఖర్మానికి ఇలా వంటరిగా వదిలేసి నువ్వు ఎక్కడోవుంటే సరిపోయిందా? నాకు మాత్రం కోపం, పౌరుషం లేవనుకున్నావా? అయినా క్షమించేస్తున్నాను.

వెంటనే రా! ఎక్కడవున్నా పరుగున రా! నన్ను నీ దాన్ని చేసుకో.

విడివిడిగా నిస్సారంగా గడుపుతున్న మన జీవితాలకు ఒక అర్థం చేకూర్చు. జీవిత మాధుర్యాన్ని చవి చూస్తూ ఇద్దరం కలసి బతుకుదాం.

నీకోసం అలమటిస్తున్న నన్ను నీ కౌగిలిలో చేర్చుకుని ఊరడించు. నాకు దూరమై ఇన్నాళ్ళు నువ్వు వంటరిగా అనుభవించిన బాధ పారిపోయేలా నా చేతుల్లో ఒదిగిపోయి ఓదార్పు పొందు.

చూడు ప్రియా! ఆకాశంలో చంద మామ చల్లని వెన్నెల వెదజల్లుతూవుంటే ప్రేమికులు, దంపతులు ఆ చల్లదనాన్ని

హాయిగా అనుభవిస్తూ వుంటే నాకిలా ఉత్తరం రాయాల్సిన అగత్యం పట్టిందే అని ఏడుపు వస్తోంది.

నేనేం చెయ్యను చెప్పు. ఆడపిల్లను కదా? నీకోసం వచ్చే స్వతంత్రం లేనిదాన్ని.

మరి నీకేం కష్టం? హాయిగా అన్నీ వున్న వాడివి. అన్నింటినీ మించి నాకోసం ధైర్యంగా రాజమార్గాన రాగల అధికారం వున్నవాడివి. ఎందుకలా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నావు? ఎందుకు తాత్సారం చేస్తున్నావు? ఇక నైనా తొందర పడు. మన పెళ్ళి ప్రయత్నాలు మొదలు పెట్టు. పెళ్ళికాగానే అందరిలాగా కాకుండా మనం వేరే..."

"సార్...సార్" అన్న పిలుపుతో ఉలిక్కిపడి తల ఎత్తాడు మత్తుగా ఆనంద రావు. ఎదురుగా వున్న మొహం చూసి–

"అన్నీ బాగానే వున్నాయిగానీ ప్రేయసీ నీకీ బుర్ర మీసాలు ఏమిటి?" అన్నాడు మరింత మత్తుగా.

సర్వర్ అదిరిపోయి "సార్! నేనండీ సర్వర్ని. భోజనం చల్లారిపోతోందిసార్" అన్నాడు.

అప్పటికి స్పృహలోకి వచ్చాడు ఆనందరావు. చుట్టూ చూశాడు. ఏదీ మల్లెల మంచం? ఏదీ పాల గ్లాసు? ఏదీ ప్రేయసి? ఏడుపు వచ్చింది అతనికి. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

సర్వర్ జాలి పడ్డాడు. పాపం తిన్నగా బార్ నుండి వస్తున్నాడు కాబోల్ను అనుకుని–

"ఏడవకండిసార్! అన్నం తినండి. ఏం చేస్తాం ఈ పాపిష్టి లోకం తీరే ఇంత. ముందు కాసినిచల్లటినీళ్ళు తాగండి" అంటూ ఐస్ వాటర్ వున్న గ్లాసు అందించాడు.

చల్లటి నీళ్ళు తాగగానే ప్రాణం తిరిగి వచ్చింది ఆనందరావుకి. చివాల్న కుర్చీ లోంచి లేచి బయటికి నడవబోయాడు. అన్నం తినడు కాబోలునని పళ్ళెంవైపు చూసిన సర్వర్కి చిప్స్ కనిపించలేదు. 'అరె ఎంగిలి చేసేశాడు' అనుకుని "సార్...సార్" అంటూ ఆనందరావు వెంట పడ్డాడు.

"ఏమిటి?" విసుక్కున్నాడు ఆనంద రావు.

సర్వర్ బిల్ అందించాడు.

పదిరూపాయలనోటు అతనికి అందించి అతను చెప్పేది వినిపించుకోకుండా బైటకివచ్చి కార్లో కూలబడ్డాడు. డ్రైవర్ కారు స్టార్ట్ చేశాడు. ఆనందరావు జేబులోని ఉత్తరం మళ్ళీ చదువుకున్నాడు. ముగింపు లేదు. సంతకం లేదు. అడ్రసు లేదు.

'ఫ్రమ్ సోనీ' అక్షరాలు అతన్ని ప్రేమతో పిలుస్తున్నాయి. అంతే!

'సోనీ! నా సోనీ! ఎవరు నువ్వు? నాకు తెలియకుండా నామీద ఇంత ప్రేమ ఎపుడు పెంచుకున్నావు?' అనుకున్నాడు. మళ్ళీ చదివాడు. ఈసారి కోపం వచ్చింది. పెళ్ళి కాగానే అందరిలాగా. కాకుండా మనం వేరే ... "ఆ వేరే ఏమిటి?" అన్నాడు పెద్దగానే ఆనందరావు సడన్ బ్రేకుతో కారు ఆపేశాడు రంగస్వామి. వెనక్కి తిరిగి–

"సార్! ఏమిటి సార్! ఆరోగ్యం బాగుండలేదా?" అన్నాడు ఆప్యాయంగా.

"ఏంలేదు. పోనీ" అన్నాడు ఆనంద రావు సీరియస్గా. ఆరంతస్థుల బిల్డింగు ముందు కారు ఆగగానే దిగి లిఫ్ట్ దగ్గరికి నడిచాడు. నాలుగో ఫ్లోర్లో వుంది అతని ఆఫీసు. లిఫ్ట్బాయ్ లేడు. ఇతను లిఫ్ట్లోకి

వెళ్ళి నుంచునేసరికి వెనకనుండి ఎవరో వచ్చారు. పరధ్యానంగా నిలబడే వున్నాడు ఆనందరావు. ప్రతి ఫ్లోర్లో లిఫ్ట్ అగుతూనే వుంది. జనం మారుతూనే వున్నారు. అలా కాసేపుఅయ్యాక ఐదో ట్రిప్పులో గ్రౌండ్ ఫ్లోర్లో లిఫ్ట్‌బాయ్, మార్గరెట్ ఇద్దరూ ఎక్కారు. తమ ఫ్లోర్లో ఆగగానే అలాగే నిలబడివున్న ఆనందరావును చూసి—

"రండి సార్" అంది మార్గరెట్.

"అరె! అపుడే వచ్చేసిందా?" అని ఆశ్చర్యపోతూ వచ్చాడు ఆనందరావు. కొత్తగా వున్న అతని వాలకం చూసి మార్గరెట్ విస్తుపోతూ అతని వెనకే ఆఫీసులోకి అడుగు పెట్టింది.

తన రూంలోకి వచ్చి రివాల్వింగ్ చైర్లో కూర్చుని సోనీ ఉత్తరాన్ని ఒకటికి పదిసార్లు చదువుకున్నాడు. ఉత్తరం తనదేనా అని అనుమానం వచ్చి కవర్ మీద అడ్రసు మరోసారి పరీక్షగా చూశాడు. సందేహంలేదు తనదే! సోనీ ఎవరో ? ఈ ఊరి అమ్మాయే అయి వుండాలి.ఎవరు...ఎవరు...ఎవరు? సోనీ అనేది హిందువుల పేరు కాదు. ఆంగ్లో ఇండియన్ కాని, క్రిస్టియన్ గాని అయి వుండాలి. ఎవరై వుంటారబ్బా...?

మార్గరెట్ కాదుగదా...ఆ... ఉత్తరం ఇచ్చింది ఆమే. కరెక్ట్ మార్గరెట్. ఎదురుగా ఉన్నా గుర్తించలేక పోయాడు. మూర్ఖుడు. చవట! తనో వెర్రి వెధవ. ఇక ఆలస్యం చెయ్యకూడదు. వెంటనే పిలవాలి. చేతుల్లోకి తీసుకోవాలి.

అనుకున్నదే తడవు ఇంటర్‌కమ్ నొక్కాడు. "ఎస్ సర్"అంది మార్గరెట్. "కమ్ హియర్" అన్నాడు. "కమింగ్ సర్" అంది మార్గరెట్. 'అబ్బ! ఎంత తియ్యగా వుంది మార్గరెట్ కంఠం' అనుకుంటూ జేబులోని ఉత్తరం తీసి బల్లమీద పెట్టాడు మార్గరెట్‌కి కనిపించేలా. చూడగానే ఎలా రియాక్ట్ అవుతుందో ఊహించుకునే లోపల—

"మేఐ కమిన్ సర్"అంది మార్గరెట్





స్వీట్ వాయిస్.

మూసిన తలుపుల ముందు మోకాళ్ళు దాటిన నల్లగౌను. చక్కని వంపులు తిరిగిన తెల్లని శరీరం. సిల్క్ లాంటి బాబ్డ్ హెయిర్. సూటిగా చిరునవ్వుతో చూస్తూండిపోయాడు. అతని చూపులకు ఇబ్బందిగా కీలవుతూ—

"ఎనీ డిక్టేషన్ సర్...?" మార్గరెట్ గొంతు విని ఉలికిపాటు దాచుకుంటూ కూర్చోమని సైగ చేశాడు.

'ఎంత అందంగా వుందీ అమ్మాయి' అనుకున్నాడు. మెల్లగా వచ్చి అతని ఎదురుగా కూర్చుని నోట్ బుక్ మీద పెన్సిల్ పెట్టి డిక్టేషన్ తీసుకోడానికి సిద్ధంగా కూర్చుంది మార్గరెట్. అయిదు నిమిషాలు మౌనంగా గడిచిపోయాయి. మౌనాన్ని భంగంచేస్తూ—

"ఆఫీసు అయిపోగానే ఇంటి కెళ్లాం. కాసేపు డాబా మీద కబుర్లు చెప్పుకుని హోటల్లో భోంచేసి సెకండ్ షో సినిమాకి వెళ్లాం. ఓ కె" అన్నాడు ఆనందరావు.

అదిరి పడింది మార్గరెట్. 'ఏమిటితని ధోరణి? ఎన్నడూ లేనిది ఇవాళ ఇలా మాట్లాడుతున్నాడేం?' అనుకుని అంత లోనే జాలి పడింది. పాపం పట్టిసే రమ్మన్నాడేమో. అతని బర్త్ డే లాటిదేమైనా వుందేమో...అనుకుని చిన్నగా నవ్వి—

"సారీసర్! ఐయాం వెరీ సారీ! మా బేబీకి ఒంట్లో బాగులేదు. ట్రిపుల్ యాంటిజన్ మూడో డోసు ఇప్పించాను నిన్ననే. కొంచెం ఫీవరు కూడా వచ్చింది. నేను ఈ రోజు గంట పర్మిషను తీసుకుని వెళ్దామనుకుంటున్నాను" అంది బాధ పడుతూ.

హిమాలయ పర్వతం నెత్తి మీద పడినట్లయింది ఆనందరావుకు. పైకి మాత్రం "అయ్యో! అలాగా. సాయంత్రం దాకా ఎందుకు ఇపుడే వెళ్ళిపోండి. యు కెన్ గో నౌ" అన్నాడు.

థాంక్స్ చెప్పి వెళ్ళిపోయింది మార్గరెట్.

ఆవిడ వెళ్ళిన వైపే చూసి తనని తనే తిట్టుకున్నాడు ఆనందరావు. 'ఏమిటిది నా తలకాయ. మార్గరెట్ కి ఎపుడో పెళ్ళయిపోయిందిగా. మిసెస్ మార్గరెట్ విలియమ్స్. ఆవిడ మెటర్నిటీలీవు కూడా తనే సాంక్షన్ చేశాడు.. ఛీ ఈ సోనీ ఉత్తరం కాదుగానీ బుర్ర బొత్తిగా పాడయిపోయింది' అనుకుంటూనే ఆ ఉత్తరం మళ్ళీ నూట నలభై ఒకటోసారి చదవకుండా వుండలేకపోయాడు.

'సోనీ! నన్నేడిపించడానికి కాక పోతే ఇంత చాటభారతం రాసినదానివి నీ పేరుతో బాటు అడ్రస్సు కూడా ఇస్తే ఎంత బావుండేది? వెంటనే నీ కోసం రానూ? ఇప్పుడు ఎక్కడ వెతకను చెప్పు?' అనుకున్నాడు.

ఆలోచనలో పడ్డాడు మళ్ళీ. 'ఇంత ఖచ్చితంగా తన టైముల గురించి, తన కంపెనీ కారు గురించి, నల్లని ఒత్తయిన తన ఉంగరాల క్రాపు గురించి, తన ఒంటి రంగు గురించీ అంత బాగా తెలుసుకుందీ అంటే చుట్టుపక్కలే ఇక్కడెక్కడో తనకి దగ్గర్లోనే వుండి వుండాలి. సరే! వెతకాలి. గట్టిగా వెతకాలి. ఆ అల్లరి పిల్లను పట్టుకోవాలి. ఎంత అందంగా, చలాకీగా వుంటుందో చూడాలి, అనుకుంటూ వెంటనే లేచి తన రూమ్ లోంచి బైటికి వచ్చాడు. మార్గరెట్ టేబులు ఖాళీగా వుంది. అక్కడ్నించి కామన్ హాల్లోకి వెళ్ళాడు. స్టాఫ్ అంతా పని ముగించుకుని ఇళ్ళకు వెళ్ళే మూడ్ లో వున్నారు. వారిలో లేడీస్ నలుగురు—ఇద్దరు టైపిస్టులు, ఇద్దరు క్లర్కులు.

మెల్లిగా వాళ్ళ దగ్గరికి వెళ్ళాడు. సరస్వతికి నలభైయేళ్ళుంటాయి. ఆవిడ పక్క సీట్లోని సుస్మిత పక్కాగా మెరుపు తీగలా వుంటుంది. పెళ్ళయింది. పైగా హిందువు. మరో అడుగు ముందుకు వేశాడు. శాంతి, సునీత కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇద్దర్నీ ఆపాదమస్తకం పరీక్షగా చూశాడు. వాళ్ళిద్దరూ వినయంగా విష్ చేశారు. కాని, బాస్ మాట్లాడకుండా సీరియస్ గా చూస్తుండే సరికి భయపడ్డారు. వాళ్ళ చేతుల్లోని పెన్నులు మెల్లిగా వణకడం గమనించి "ఏమిటిది" గద్దించాడు ఆనందరావు. "సారీసర్! ఏదో పనయిపోయింది కదాని

ఊరికే కబుర్లు చెప్పుకుంటున్నాం. అవీ ఆఫీసు కబుర్లే సార్" అంది శాంతి.

సూటిగా ఆ అమ్మాయి కళ్ళలోకి చూశాడు. కళ్ళజోడు వెనకాల ఏనుగు కళ్ళల్లాంటి ఆ కళ్ళు అన్ని తియ్యటి కలలు కనగలవా? 'అసంభవం' అనుకున్నాడు. సునీతని చూశాడు. ఆమె మరింత బెదిరిపోయి ఉంది. అసలే నత్తేమో ఇంకా "లేలేదుసా..." అనడం మొదలు పెట్టింది. నవ్వు ముంచుకు వచ్చింది ఆనందరావుకి. అయినా తమాయించుకుని "ఓ.కె. ఇట్సాల్ రైట్" అనేసి టకటక వెళ్ళిపోయాడు.

అప్పటి దాకా అతని వాలకం చూస్తూ కూర్చున్న సరస్వతి మెల్లిగా సుమిత్ర పక్కకి వచ్చింది. "సుమిత్రా! ఏదో కొత్తల్లో మంచివాడని మురిసిపోయాం గానీ ఈయనకీ పిచ్చిరోగాలు చాలానే వున్నట్లున్నాయే" అంది.

సుమిత్ర ఏం మాట్లాడలేదు. మనసులో మాత్రం 'ఆ మన్మధుడికి ఏంఖర్మ ఈ సుందరీమణుల వెనక పడడానికి? ఆనందరావు చాలా స్ట్రిక్ట్ మనిషి. కబుర్లు చెప్పుకుంటున్నారని ఒళ్ళు మండి అలా చూసి వుంటాడు' అనుకుని నవ్వుకుంది.

ఆఫీసులోంచి బైటపడ్డ ఆనందరావు తిన్నగా ఇంటికి వెళ్ళాడు. గేటు వంక చూడగానే సోనీ గుర్తు వచ్చింది. నీరసంగా వెళ్ళి కాసేపు సోఫాలో చేరగిలబడ్డాడు. ఇంతలో పనిమనిషి వచ్చి కాఫీ అందించింది. ఏడుపు వచ్చింది ఆనందరావుకి. ఎక్కడి తన అందాల ప్రేయసి, ఎక్కడ ఈ ముసలి రంగమ్మ?

"వంటచేసి పెట్టాను బాబూ! పెందరాళే భోంచెయ్యండి" అని చెప్పి వెళ్తున్న రంగమ్మను వెనక్కి పిలిచాడు.

"చూడు రంగమ్మా! ఈ చుట్టుపక్కల ఇళ్ళల్లో ఎవరైనా ఆడపిల్లలు అందమైన వాళ్ళు, పెళ్ళికాని వాళ్లు వున్నారా?" అన్నాడు కుతూహలంగా. తేరిపార చూసింది రంగమ్మ.

"ఏటి బాబూ! ఆ ఆస్సెం? పెద్ద ముండతో ఆ పరాసికాలేటి? పాసంగాని బాగోలేదా?" అని కసిరి వెళ్ళిపోయింది.

నాలిక కరుచుకున్నాడు ఆనందరావు. కాసేపు అటూ ఇటూ తిరిగి డైనింగ్ టేబిల్ ముందు కూర్చున్నాడు. అన్నం తినబుద్ధికాలేదు. ఏది నా ప్రేయసి? తను తినిపిస్తే తినాల్సిన ఈ భోజనం ఒంటరిగా తినగలనా అనుకుని లేచి వెళ్ళి పక్కమీద పడుకుని అటూ ఇటూ పొర్లాడు. సన్నగా వాన పడుతోంది. బయట చల్లగాలి.

'సోనీ...సోనీ' అనుకుంటూ దిండులో ముఖం దాచుకుని బాధగా నిట్టూర్చాడు.




అమలాపురంలో వాళ్ళ మేడమీద గదిలో మంచంమీద బోర్లాపడుకుని, వేయించిన వేరుశనగ పప్పులు తింటోంది స్వర్ణలత. పక్క మంచంమీద దిళ్ళకి ఆనుకుని కూర్చుని ఊలు టోపీ అల్లుతోంది అక్క హేమలత. ఇంతలో పాలగ్లాసు పట్టుకుని

వాళ్ళున్న గదిలోకి వచ్చింది వాళ్లమ్మ రుక్మిణి. వచ్చీరాగానే—

"అయ్యో...అయ్యో! నీకేం పొయ్యే కాలం వచ్చిందే స్వర్ణా! బోర్లా పడుకుని ఆ కాళ్ళూపడమేమిటే మగరాయుడిలాగ" అని అరిచింది.

ఊహా లోకంలో తేలిపోతున్న స్వర్ణ ఉలిక్కిపడి లేచింది. "ఏమిటే అమ్మా నీ చాదసం. బోర్లాపడుకునే హక్కు మగవాళ్ళకేనా, మాకు లేదా?" అంది విసుగ్గా.

"చాల్లే! నోర్మూయ్ వెధవ వాగుడు. నీకు పొగరెక్కువవుతోంది..." అంటూ పురిటికి వచ్చిన పెద్ద కూతురు హేమకి పాలగ్లాసు అందించింది.

"ఏం దిక్కుమాలిన రోజులు వచ్చి పడ్డాయో! మా రోజుల్లో ఈ వయసుకు ఆరుగురేసి పిల్లల్ని కనేవాళ్ళం. అయినా బితుకు బితుకుమంటూనే వుండేవాళ్ళం. ఒక్కమాట మాట్లాడాలంటే నోరు పెగిలేదికాదు. మీరూ వున్నారు ఎందుకు? సువ్వెంతంటే సువ్వెంతని వాదిస్తారు..." అని సణుగుతూనే వెళ్ళిపోయింది తల్లి.

"అక్కా! ఆ రోజులే నయంలేవే సుఖంగా వుండేవారు" అంది స్వర్ణ.

"ఏమే! ఇపుడు నీకేం కష్టం వచ్చింది?" అంది హేమ నవ్వుతూ.

"ఆ..! అన్నీ కష్టాలే! ఆ రోజుల్లో బుద్ధి తెలిసేసరికి మొగుడు వుండేవాడు. ఎటువంటివాడు దొరుకుతాడా అని దిగులు వుండేదికాదు" అంది దిగులుగా.

"చాల్లే.. నోరుమూసుకో" అని కసిరి



పడుకుంది హేమ. స్వర్ణకుమ్మాత్రం నిద్ర పట్టలేదు 'ఏమిటో వెధవ జీవితం. విసుగు పుడుతోంది. పోనీ ఎవరో ఒకరిని ప్రేమిద్దామా అంటే ఎవరూ తన ప్రేమకి అర్హుడుగా కనిపించడంలేదు. ప్రతివాడికీ ఏదో వంక. ఏ సినిమా చూసినా పట్టుమని పదిరీళ్లు సుఖంగా కాపురంచేసే హీరో దొరకడు. అనుమానం, లేకపోతే కోపం... ఏదీ లేకపోతే దరిద్రం, బాధలు. అన్నీ ముగిసి ఏదో సరదాగా వుంటారులే అనుకునేసరికి శుభం చూపించి ఇంటికి పొమ్మంటారు.

పోనీ నవలా హీరోలని చూద్దామంటే వాళ్ళకి ఏదో అవకతవకలే. అందంగా వుంటే తలతిక్క. తల బాగుంటే డబ్బు వుండదు. రెండూ వున్నవాడు భార్యనుంచి దూరంగా పోయి దొంగాట ఆడుతూ



వుంటాడు.

కొన్నాళ్ళు సినిమాలు వరసబెట్టి చూసేసింది. ప్చ్! ఎవరూ మంచి కాండిడేట్ దొరకలేదు. మరికొన్నాళ్ళు తనచుట్టూ ప్రపంచాన్ని పరికించిచూసింది. తన ప్రేమకు పాత్రుడు, తన అందానికి సరిజోడు, తన అంతస్థును అందుకో తగినవాడు ఒక్కరూ కనుచూపుమేర కనిపించలేదు. విసుగేసింది. కనీసం ఊహ

సుందరుడైనా దొరక్కపోతే ఏంచేసేటట్టు?

నాన్నగారికి ఇప్పట్లో తన పెళ్ళిచేసే ఆలోచన ఉన్నట్టు లేదు. అమ్మని చూడబోతే మారోజుల్లో అంతమంది పిల్లల్ని కనేవాళ్ళం అంటుందేగానీ, ఎదురుగా ఉన్న ఇరవైయేళ్ళ కూతురికి పెళ్ళి చేసేద్దాం అనే ఆలోచనలేదు. అప్పటికి ఎన్నోసార్లు నాన్నగారి దగ్గరికి వెళ్ళి 'నాన్నారూ, మీరింక సంబంధాలు చూడ్డం మొదలు పెట్టొచ్చండీ! నాకు చదువుమీద ఇంట్రెస్టు తగ్గిపోయింది' అని చెప్పాలనుకుందిగానీ సిగ్గూ, మొహమాటం అడ్డొచ్చాయి.

'పోనీలే, ఆర్నెల్లలో బి.యస్‌సి. అయిపోతుంది. రిజల్ట్స్ చూడగానే వాళ్లకే తెలిసిపోతుంది. అపుడు వాళ్ళే గ్రహించుకుని తొందరపడతారు' అనుకుని శాంతం వహించింది. కానీ వెధవది బోర్‌కొట్టేస్తోంది. అసలారాబోయే, కాబోయేశ్రీవారు ఎక్కడ వున్నారో తెలిస్తే ఉత్తరాలు రాసుకోవచ్చు. ఎంచక్కా అతనెపుడైనా వస్తే కలిసి సినిమాకెళ్ళొచ్చు. కబుర్లు చెప్పుకోవచ్చు. కానీ ఎలా తెలిసేటట్టు? ఈ విశాల ప్రపంచంలో తన కాబోయే భర్త ఎక్కడ వున్నాడో! ఎవరు చెప్తారు...?

ఆలోచనలు తెగని స్వర్ణ లేచి బైట బాల్కనీలోకి వెళ్ళింది. తెల్లని చల్లని వెన్నెల్లో మిలమిలా మెరిసిపోతున్నాడు చంద్రుడు.

'ఒకసారి ఆగుమా ఓచందమామా!' అనిపాడి సందేశం పంపుదామనుకుంది. అయ్యేపనికాదని మళ్ళీ వచ్చిపడుకుంది. హేమ పెళ్ళయిన కొత్తల్లో తను చేసిన చిలిపిపని గుర్తొచ్చి మళ్ళీ గతంలోకి వెళ్ళిపోయింది స్వర్ణ.

అప్పట్లో మనసుని అదుపులో పెట్టలేక, ఏ దారీతోచక ఉత్తరం రాస్తే బావుండుననుకుంది. ఆషాఢమాసమని అక్క పుట్టింట్లోనే ఉంది. దానికి బావ ఇచ్చిన లెటర్ పాడ్‌లోంచి కాగితాలు తస్కరించి ఆ గులాబీ రంగు కాయితాల మీద తన మనోభావాలని వివరంగా రాసింది. చదువుకున్న తర్వాత సిగ్గు, బాధ, సంతోషం, దుఃఖం ముంచుకు వచ్చాయి. ఈ ఉత్తరం, ఇంత మంచి ఉత్తరం అందుకోగలిగిన ఆ అందగాడు ఎక్కడ ఉన్నాడో కదా! చేజేతులారా చింపి పారెయ్యడానికి మనసు ఒప్పలేదు. ఎవరికి పంపడం? ఇంట్లో వుంచేసి పెళ్ళి కాగానే ఆయనకి ఇవ్వొచ్చు. కానీ అమ్మకు ప్రతి ఆదివారం తన గది సర్దడం అలవాటు. ఆవిడ దృష్టి దీనిమీద పడకుండా దాచడం అసంభవం. కంట బడిందో నానారభసా చేసుంది. అందుకే ఎవరికో ఒకరికి పోస్టుచేయాలని నిశ్చయించుకుంది.

సరే ముందు పేరు వెతకాలి. విజయ్, హరీష్, ప్రవీణ్, హితార్థ—ఇలాంటి పేర్లు బాగానే వుంటాయి. కానీ ఆంధ్రదేశం ఇంకా అంత ముందుకిపోలేదు. ఇపుడిపుడే కాస్త తెలివితేటలు పడుతున్నాయి జనానికి. అందుకే ఈ పేర్ల వాళ్ళంతా ఇంకా స్కూళ్ళల్లోనే వున్నారు చదువుకుంటూ. ఇకపోతే ఆంధ్రదేశంలో ఎక్కువగా వుండే తెలుగుపేర్లు రావు, మూర్తి. ముందు ఏపేరున్నా చివర మాత్రం రావు, మూర్తి అని నూటికి తొంభైమందికి వుంటుంది. మూర్తికన్నా రావు అనేపేరు కాస్త బావుంది. కానీ ఏ రావు?ఏదో ఓ రావు. అంతే! 'ఓ రావు+

ఏ రావు, ఓ. ఏ. రావు అని రాసేసింది వెంటనే.

పేరు వచ్చేసింది. ఇక ఈ ఓ.ఏ.రావుకి అదే తన పతిదేవుడికి ఏం ఉద్యోగం ఇవ్వాలి? డాక్టరా! వద్దు. వాడు మందుల కంపు. ఇంటినిండా రోగిష్టి జనం. ఇంజనీరా! అబ్బ విసుగుబాబూ. పోనీ లాయర్. ప్చ్! లాభంలేదు. వుంటే తనతో మాట్లాడానికి వీల్లేనంత బిజీ ప్రాక్టీసు వుంటుంది-లేకపోతే చెట్టుకింద ప్లీడరులాగా వుంటాడు. పోనీ లెక్చరర్! వద్దుబాబోయ్ గంట కొడితేనేగాని వాగుడు ఆపడు. బ్యాంక్ఆఫీసరు సరేసరి. పెద్ద రిస్కు. అసలే రోజులు బాగాలేవు. ఏ దుర్ముహూర్తాన్నయినా బందిపోటు దొంగలువచ్చి ఆ డబ్బంతా ఇచ్చెయ్ అని బెదిరిస్తే పౌరుషం గల తన భర్త ఇస్తాడా? ఇవ్వడు. ఫలితం వాళ్ళు కత్తి పుచ్చుకొని ఇతని డొక్కలో పొడిచారంటే తన మాంగల్యానికి ముప్పు వాటిల్లుతుంది.

సీరియస్‌గా సాగిందిలా ఆలోచన.

ఐడియా...

ఏదైనా కంపెనీలో ఎగ్జిక్యూటివ్ రాంక్‌లో వున్న అందగాడైతే?

సినిమా ఎడ్వర్టయిజ్‌మెంట్లలో చూపిస్తుంటారే... సూటింగ్స్, సిగరెట్లు వీటి ఎడ్వర్టయిజ్‌మెంట్స్‌లో ఎంతో అందంగా వుంటారే వాళ్ళు. ఎంత హుందాగా వుంటారు! ఫుల్ సూట్, చక్కటి ఛేంబర్. రివాల్వింగ్ ఛెయిర్లో కూర్చుని టెలిఫోన్ అందుకుంటూ, బల్ల మీద మోచేతులు ఆనించి ముందుకి వంగి సెక్రటరీకి లెటర్ డిక్టేట్ చేస్తూ, రిలాక్సింగ్‌గా వెనక్కివాలి స్టయిల్‌గా స్మోక్ చేస్తూ...ఓహ్... హాండ్సమ్!

అందుకే ఓ. ఎ. రావు అని పేరు పెట్టి ఏదో తోచిన కంపెనీ మేనేజర్‌గా అడ్రస్ రాసేసింది. తన పేరు రాద్దామా అనుకుంది. కానీ మనసొప్పుకోలేదు. పకడ్బందీగా, పట్టుబడ్డా తన మీదికి రాకుండా వుండేలా జాగ్రత్తగా పేరుని సోనీ అని అనువదించుకుని అదేరాసి, ఉత్తరం మీద అక్క పెళ్ళిలో మిగిలిపోయిన కునేగా సెంటు జల్లి కవరు అంటించి 'ఓ పంచ భూతములారా.... ఏ పరమేశ్వరా! నేను మనోవాక్కాయ కర్మలా నా కాబోయే భర్తను తప్ప మరొకరిని స్మరించని పతివ్రతను అగుదునేని నా ఈ ఉత్తరం నా కాబోయే పతిదేవుని చేరుగాక, అని విజ్ఞప్తి చేసి పోస్టు డబ్బాలో పడేసింది. మర్నాటికల్లా ఆ ఉత్తరం సంగతి మర్చిపోయి హాయిగా, కలలుగంటూ, చదువుకుంటూ తన మామూలు రొటీన్లో పడిపోయింది.

ఆ ఉత్తరం అమలాపురం పోస్టాఫీసు సార్టింగ్ ఆఫీసులో పోస్టుక్లర్కు చేతిలో పడింది. అతను అప్రయత్నంగా బాంబే వెళ్ళే ఉత్తరాల్లో పడేశాడు. బాంబే చేరి ఆ కంపెనీ మేనేజరు నలభై యేళ్ళ ఓంకారుని అచ్యుతరావు అనే ఓ.ఏ. రావు బల్ల మీదికి చేరింది. ఓంకారుని అచ్యుతరావు ఘోటక బ్రహ్మచారి. ఆంజనేయ ఆరాధకుడు. కుండలినీ విద్య అభ్యాసం చేస్తున్నవాడు. అప్పటికి వారం రోజుల కిందటే సెంటు రాయించుకుని వుండడం వల్ల ఘుమఘుమలాడిపోతున్న ఆ గులాబీ రంగు కవరు అతని కళ్ళకు తపోభంగం చేయవచ్చిన మేనకలా కనిపించింది. వెంటనే కోపంగా సెక్రటరీని పిల్చి "ఇది నాదికాదు తీసుకుపో" అన్నాడు హిందీలో.

"ఇటివ్వండి సార్" అందావిడ ఇంగ్లీషులో. ఎడంచేత్తో జేబు రుమాలుతో ఆ ఉత్తరాన్ని చచ్చిన ఎలకని పట్టి

కున్నట్టు పట్టుకుని సెక్రటరీకి అందించి "పీడవదిలింది" అని తిట్టుకున్నాడు తెలుగులో.

సెక్రటరీ కాస్త ఆలోచించి మద్రాసులో వున్న తమ బ్రాంచ్ ఆఫీసుకి పంపే ఉత్తరాల కట్టలో పడేసింది. ఆ ఉత్తరం మిగతా ఉత్తరాలతోబాటు మద్రాసు వచ్చింది. అక్కడో ఓ.ఏ. రావున్నాడు. అతను వంగిపురపు అనంత పద్మనాభ రావు. వయసు ముప్పైఎనిమిది. ఓంకారుని అచ్యుతరావులా బ్రహ్మచారికాదు. పైపెచ్చు తల్లి, చెల్లికి తప్ప ప్రపంచంలోని స్త్రీలందరికీ తన హృదయంలో చోటిచ్చి ప్రియురాళ్ళను చేసుకోగల విశాలహృదయుడు.

అతనికి అందంవుంది. ఐశ్వర్యం వుంది. పీపాలాంటి భార్య వుంది. ఆవిడకి అందచందాలు లేవుగానీ బోలెడుడబ్బుంది. గయ్యాళితనం వుంది. పోలీసు కుక్క ముక్కు లాంటి ముక్కుంది. వాకిట్లోనే వాసనపట్టేసి ఏదైనా అనుమానం వచ్చిందో తలుపు ధనామని మూసేస్తుంది. రాత్రి తెల్లవార్లూ అనంతపద్మనాభరావు వాకిట్లో జాగరణ చెయ్యాల్సిందే. పాపం! అతను కవరు చూసి మురిసిపోయాడు, ఆనందపడ్డాడు. అంతలోనే భార్య గుర్తొచ్చింది. ఇంటినిండా వున్న బంధు బలగం ముందు ఆ సాయంత్రం పరువు పోగొట్టుకోవడం ఇష్టంలేకా, సోనీ పేరున్న వాళ్ళెవరూ తన లిస్టులో లేకపోవడం వల్లా సెక్రటరీని పిల్చి "ఈ లెటర్ నాది కాదు" అని భారంగా, దీర్ఘంగా నిట్టూర్చాడు.

అతని సెక్రటరీ నవ్వుకుంది. అంత వరకు రెండు మూడు సార్లు ఇలాగే జరిగింది. హైదరాబాద్ ఆఫీసులో మరో ఓ.ఏ. రావున్నాడు. ఈయన ఉత్తరాలు ఆయనకి, ఆయన లెటర్స్ ఈయనకీ రావడం అడపాదడపా జరిగేదే కదా అనుకుని కవర్‌మీద హైదరాబాద్ అని రాసి డిస్పాచ్‌లోని హైదరాబాద్ బాగ్‌లో పడేసింది.

ఆ ఉత్తరం కోస్తా తీరప్రాంతమైన నెల్లూరు, ఒంగోలు, తెనాలి, విజయవాడల మీదుగా గంటకు నలభై మైళ్ళ వేగంతో మధ్యమధ్య ఆగుతూ కేవలం ఆరురోజులు మాత్రం ప్రయాణం చేసి తీరికగా హైదరాబాద్ చేరుకుని బలహీనమైపోయిన సెంటువాసనతో మన ఓరుగంటి ఆనందరావుగారి చేతుల్లో వాలి అతని హృదయంలో కేంద్రీకృతమైపోయింది.

* * *

పాపం... ఆనందరావు! ఏ పాపం ఎరగని ఆనందరావు పరమ శ్రోత్రియ కుటుంబంలో పుట్టిన పరంధామయ్యగారి కుమారుడు. సాక్షాత్తు శ్రీరామచంద్రుడిలాగ పితృవాక్యపరిపాలకుడు. 'తనేమో... తన లోకం ఏమో' అన్నట్లుగా వుండే గంభీరుడు, పరమ బుద్ధిమంతుడు. ఒకే మాట-ఒకేబాట అన్న ధర్మాన్ని అణువణువునా జీర్ణించుకుని, తండ్రి నిర్ణయించిన బుద్ధిమంతురాల్ని పెళ్ళి చేసుకుని ఏ చీకూచింతా లేకుండా హాయిగా కాలం గడుపుదాం అనుకుంటూ వున్న తరుణంలో 'సోనీ' రాసిన ఉత్తరం పెను తుఫానులా చుట్టేసింది అతన్ని. మంచంమీద పడుకోలేక పోతున్నాడు. కుర్చీలో కూర్చోలేక పోతున్నాడు. నేల మీద నిలబడలేకపోతున్నాడు. మామూలుగా గడ్డం చేసుకుంటుంటే తన భుజం మీద గడ్డం ఆనించుకున్న ఆ ప్రేయసి

గుర్తువచ్చి పరధ్యానంగా ఉండేసరికి అరంగుళంపొడవు తెగింది గడ్డం. ఆఫ్టర్ షేవ్‌లోషన్ భగ్గున మండింది. వంట మనిషి వేడిగాచేసి పెట్టిన జీడిపప్పు వుప్మా చూస్తూవుంటే తనఒడిలో వాలిన ప్రేయసి గుర్తువచ్చి ఏడుపొచ్చింది. ఉప్మాలో మిరపకాయ పొరపాటున కొరికితే నోరు మండింది. అనుక్షణం సోనీ కోసం వెతికి వెతికి వేసారి పోతున్నాడు. రోడ్డుమీద పోయే ప్రతి ఆడపిల్లను పరీక్షగా చూసి కనీసం పదిమందినైనా పలకరించబోయి చివాట్లు తిన్నాడు. మరీ ఒకమ్మాయి చెంప పగలగొట్టబోతే ఎలాగో తప్పించు కుని బైటపడ్డాడు.

అలాంటి పరిస్థితులలో తండ్రి నుంచి వచ్చిన ఉత్తరం మరింత కలవర పెట్టింది. 'సంబంధాలు చూస్తున్నాను. వాళ్ళకి ఉత్తరాలు రాసేశాను. నువ్వు ఫలానా తారీఖున బయల్దేరి రమ్మని' రాశాడా యన. మరింత నీరసించి పోయాడు ఆనందరావు. 'తండ్రిమాట పాటించాలా? ప్రేయసికి విలువ ఇవ్వాలా?' అని తెగ తర్జనభర్జన పడ్డాడు. చివరకి ప్రేయసి వైపే మొగ్గింది అతని మనసు.

వెంటనే "నేను కొన్ని కారణాలవల్ల ఇపుడే పెళ్ళి చేసుకోలేను. నన్ను మన్నించగలరు. నేను వివాహం చేసుకో దలచినపుడు మీకు తెలియబర్చగలను. చిత్తగించవలెను" అని తండ్రికి రాసేసి భయంతో వారంరోజులు శలవు పెట్టి ఇంట్లో వుండిపోయాడు.

* * *

భోజనం ముగించి పట్టు పంచ వదిలి మామూలు పంచ కట్టుకుని, వాకిట్లో బాదం చెట్టు కింద నవారు మంచం వాల్చుకుని పడుకుని వున్న పరంధామయ్యగారు పోస్ట్‌మన్ వచ్చి ఉత్తరాలు అందించడంతో లేచికూర్చుని, పక్కనే వున్న కళ్ళజోడు పెట్టుకుని చూశారు. పెళ్ళికూతురి తండ్రి వీళ్ళ దయకు సంతోషం తెలియబరుస్తూ, తప్పకుండా రమ్మని కోరుకుంటూ రాసిన జాబు అది. గర్వంగా నవ్వుకున్నాడు. 'మగపిల్లవాడి తండ్రికి వున్న దర్జా ఇదే' అనుకున్నాడు.

అలా అని ఆయన కూతురి పెళ్ళికి ఏమీ కష్టపడలేదు. ఒకరికి తలవంచలేదు. బావమరిది సూర్యనారాయణమూర్తికే తన ఏకైక పుత్రిక కామేశ్వరిని ఇచ్చి పెళ్ళి చేశాడు. సూర్యం మంచివాడు. గంగిగోవులాంటివాడు. ఎగ్రికల్చర్ బి. యస్‌సి. పాసై వ్యవసాయం చేస్తూ, బంగారం పండిస్తూ, వున్నదాన్ని రెట్టింపుచేశాడు. పొలం పుట్రా, గొడ్డూ గోదా సలక్షణంగా వున్నవాడు. అసలు అతను పెళ్ళికి ఏమీ అడగలేదు. కట్నం కానుకలు ఏమీలేవు. కూతురికి ఒంటి నిండా బంగారం పెట్టి కన్యాదానం చేశారు పరంధామయ్య. అసలు స్వార్థానికి ఒకరిని అడగాలి అన్నధ్యాసలేదు. అతను వూరుకున్నా పక్కవాళ్ళు వూరుకోనివ్వ లేదు. అలకపాన్పు మీద బంగారపు గడియారం గొలుసు అడిగించారు.

దాంతో ఇంతెత్తునలేచి "ఏం? నా పెళ్ళికి ఈ పెళ్ళికొడుకు అబ్బ నాకేమన్నా వాచీ గొలుసు ఇచ్చాడా?" అని అరిచాడు పరంధామయ్య. రిటైర్ అవకముందు హెడ్మాస్టరు పరంధామయ్య అంటే పంతుళ్ళు, పిల్లలు వణికిపోయేవారు. ఇంట్లో భార్య మాణిక్యాంబ, కొడుకులు, కూతురు, కోడలు, అల్లుడు, పాలేర్లు, పనివాళ్లు అందరూ వణికి పోయారు.

ఆయనను ఎదిరించి, ఆయన ఎదుట నిలబడి సమాధానం చెప్పినవాళ్లు ఇంత మట్టుకు ఎవరూలేరు. ఇకముందు వుంటా రన్న భయంలేదు. ఎందుకంటే అరవై అయిదేళ్ల ఏకచ్ఛత్రాధిపత్యంగా బండి నడిపించిన పరంధామయ్యకి తన శేష జీవితాన్ని కూడా ఇలాగే గడిపేయగల నన్న ధీమావుంది. అందుకు తగిన ఆస్తి పాస్తులున్నాయి.

ప్రస్తుతం ఆయన చిన్నకొడుకు ఉత్తరం చదివి చిందులు వేస్తున్నాడు. "వెధవ! వెధవన్నర వెధవ. కొన్ని కారణాల వల్ల వివాహం చేసుకోడా? తను చేసుకోదల్చుకున్నపుడు నాకు తెలియ జేస్తాడా? అసలు వాడెవడంట తెలియ జేయడానికి! గాడిద కొడుకు... ఛీ ఛీ కాదు గాడిద" అని తిట్టుకుంటూ వంటిం ట్లోకి వెళ్ళాడు. భోజనం చేస్తోంది భార్య మాణిక్యాంబ.

"నీకేమన్నా బుద్ధి వుందిటే? ఏం తల పొగరు గానీ ఎక్కిందా? ఏం లక్ష్యం లేకుండా పోతోందే నేనంటే. అహా! తేలుస్తాను ఏమిటో" అని అరిచాడు.

ఇంకొకరైతే గజగజ వణికిపోయే వారే. కానీ ఎప్పటినుంచో భర్తతో కాపురం చేస్తున్న ఆవిడకు భర్తధోరణి అలవాటయిపోయింది. ఆయనకి ఎవరిమీద కోపం వచ్చినా అంతే. ఎదుట వున్న వాళ్ళనే తిడతాడు. అందుకే ఆవిడ ఎవరి మీద కోపమోలే అనుకుంటూ నిమ్మకాయ బద్ద నంచుకుని మజ్జిగ అన్నంతింటూ తల కూడా ఎత్తలేదు. చేసేదిలేక మరోసారి అరిచి విసురుగా వెనక్కి తిరిగి వాకిట్లోకి నడిచాడు పరంధామయ్య.

ఎదురుగా కనిపించిన పనివాడిని కేకేసి "ఒరేయ్ వెంటనే బస్సులో పోయి అల్లుడిని పిల్చుకురా. పనులు పాడవుతా యంటాడేమో! పిచ్చి వేషాలు వెయ్య కుండా వెంటనే రమ్మన్నాననిచెప్పు ఫో!" అని గదిమాడు.

అప్పటిదాకా వసారాలో స్థంభానికి ఆనుకుని కూర్చుని పలుపుతాడు పేను తున్న పనివాడు ఆ పని వదిలేసి వెనక్కి తిరిగి పెరటివేపు నుంచుని "అమ్మా" అని పిల్చాడు. మాణిక్యాంబ పిలుపు విని బయటకి వచ్చింది. "అమ్మా..అయ్యగారు అల్లుడుగార్ని పిల్చుకు రమ్మన్నా రమ్మా!" అని చెప్పుకున్నాడు వాడు.

దీర్ఘంగా నిట్టూర్చి 'ఉండు' అంటూ లోపలకు వెళ్ళి బస్సుచార్జీలూ, డబ్బాతో సున్నుండలూ తీసుకుని వచ్చి వాడి కిచ్చింది. ఓసారి అటూ ఇటూ చూసి-

"ఒరేయ్! మరీ అంత తీరికలేకుండా వుంటే అంత కొంప మునిగిపోయేదేమీ లేదని చెప్పు అల్లుడితో. వీలుంటే అమ్మా యిని కూడా రమ్మన్నానని చెప్పు" అంది మెల్లిగా. సరేనని తల వూపి వెళ్ళి పోయాడు వాడు.

మెల్లగా వసారాలోకి వచ్చిందామె. పరంధామయ్య అక్కడే పచార్లు చేస్తు న్నాడు.

"ఏమిటి...? ఏమన్నా ఉత్తరాలు వచ్చాయా?" అంది మెల్లిగా.

"ఊఁ..." అని హూంకరించాడు.

"పెద్దాడి దగ్గర్నించా?"

"ఊహు..." అదే హూంకరింపు.

"మరి! ఆనందాయి దగ్గర్నించా?"

"నోరు మూసుకు ఫో అవతలకి. వెధవఆరాలు, వ్యవహారాలు నీకెందుకు?" అని అరిచాడు.

మెల్లిగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయి

పెనక తలుపుదగ్గర కొంగు పరుచుకుని చల్లగాలికి కునుకు తీసింది ఆ మహా సాధ్వి.

*  *  *

ఒంటిగంటకి పొలం నుండి వచ్చిన భర్తకి భోజనం పెట్టి ఆయన నిద్రకు ఉపక్రమిస్తే తాను హాల్లో ఉయ్యాలబల్ల మీద కూర్చుని వారపత్రిక చదువు కుంటోంది కామేశ్వరి.

మూడయింది. ఇక లేచి కాఫీ పని చూడాలి అనుకుంటూ వుండగానే "అమ్మాయిగారూ!" అంటూ వచ్చాడు పుట్టింటి పనివాడు.

పుట్టింటివేపు మనిషిని చూడగానే ప్రాణంలేచివచ్చింది కామేశ్వరికి. వాడికి మజ్జిగ తేట అందించి యోగక్షేమాలు అడిగింది. సున్నుండల డబ్బా అందించి తను వచ్చినపని చెప్పాడు.

"సరేలే కూర్చో. అయ్యగార్ని లేపి చెప్తాను" అని లోపలికెళ్ళి అరటాకులో వేరుశనగపప్పు పాకం, చక్కిలాలు పెట్టి తెచ్చి తినమని చెప్పి ఆకు నేలమీద పెట్టి పడగ్గదిలోకి వెళ్ళింది.

కిటికీలు, తలుపులు మూసుకుని నిద్ర పోతున్నాడు సూర్యం. చామన ఛాయ. ఒడ్డూ పొడుగూ. పెద్ద కళ్ళు. నల్లని మెత్తని జుట్టు. చక్కటి చిరునవ్వు. చూడగానే రైతుబిడ్డ అని తెలిసిపోయేలా వుంటాడు సూర్యం. మెల్లిగా వెళ్ళిపక్కనే కూర్చుని భర్తని లేపి విషయం చెప్పే సింది కామేశ్వరి.





"ఎందుకో! ఏం ముంచుకు వచ్చిందో లేకపోతే అంత అర్జంటుగా రమ్మనడే" అన్నాడు సూర్యం.

"ఆయన అర్జంట్లకేంలెండి. అన్నీ అర్జంట్లే! పెట్టుపోతలకి అఖ్ఖర్లేదు అల్లుడు. సలహాలకి, సంప్రదింపులకి ఇలా పరుగున రమ్మనడానికి మాత్రం అల్లుడు గుర్తొస్తాడు" అంది కామేశ్వరి చిరాకుగా.

"నువ్వొట్టి పిచ్చిదానివి కామేశ్వరి! మీ నాన్న ఇచ్చేవాటికోసం ఆశపడి చేసుకున్నానా నిన్ను? నీలాంటి బంగారు బొమ్మని ఇచ్చాడు బావ. ఇంకేం ఇవ్వాలి చెప్పు?" అన్నాడు.

సిగ్గుపడింది కామేశ్వరి. "పొండి మీకేం తక్కువ" అంది తల వంచుకుని.

"చదువు తక్కువని మీ నాన్న వెనక ముందులాడాడు కదూ?"

"చాల్లెండి. ఆయన మాట మనం లెక్కచేశామా?" అంటూ పరుగున వెళ్ళిపోయింది.

భార్య వెళ్ళినవేపు చూసి నవ్వుకుని వాకిట్లోకి వచ్చాడు సూర్యం. మామగారు పంపిన మనిషిని వివరాలడిగాడు.

"ఉన్నపాటున రమ్మన్నారు. నిప్పులు కక్కుతున్నారయ్యా" అన్నాడు వాడు.

ఒక్క క్షణం ఆలోచించాడు సూర్యం. వెళ్ళాలని నిశ్చయించుకుని లోపలకు వచ్చాడు. ఉయ్యాల బల్లమీద కూర్చుని

భార్య అందించిన కాఫీ తాగుతూ "నేను వెళ్లొస్తాను కామేశ్వరీ! నువ్వూ వస్తావా?" అన్నాడు.

"రెండు రోజులు అవుతుందా?" అడిగింది.

"లేదు. రేపొద్దుట కొబ్బరి మొక్కలు నాటించాలి" అన్నాడు సూర్యం.

"అయితే ఒక్క పూట భాగ్యానికి ఇల్లు తాళాలు పెట్టి వెళ్ళడం ఎందుకు? మీరే వెళ్ళిరండి" అంది కామేశ్వరి.

"సరే...నీఇష్టం" అనేసి లేచి వెళ్ళి బావి దగ్గిర నిలబడి అరగంట సేపు చల్లటి నీళ్ళతో స్నానం చేసి తెల్లటి మల్లెపూవులాంటి పంచె, షర్టు వేసుకుని భార్య దగ్గరకు వచ్చాడు.

"నేను వెళ్లొస్తాను. వస్తే రాత్రి లాస్ట్ బస్‌లో వస్తాను. లేకపోతే పొద్దుటే ఫస్ట్ బస్సులో వస్తాను" అని పనివాడితో బైటికి నడిచాడు. ఊరి చివరి దాకా తన పొలాల వెంబడి నడుస్తూ పాలేర్లతో మాట్లాడుతూ వెళ్ళి అక్కడ బస్సుకోసం ఆగాడు. దూరం నుండే ఇతన్ని చూసి బస్సు ఆపాడు డ్రైవరు. ముందు సీట్లో కూర్చున్నవాళ్లని లేపి వెనక్కి పొమ్మని సూర్యాన్ని కూర్చోబెట్టాడు కండక్టర్. గంటన్నర తర్వాత మామగారి ఊరు చేరాడు సూర్యం.

ఇతన్ని చూడగానే మళ్ళీ ఉరిమాడు పరంధామయ్య. "ఆ...ఏమిటోయ్ ఏమిటి సంగతి! మీ కుర్రాళ్ళకి బొత్తిగా పెద్దా చిన్నా విచక్షణా జ్ఞానం లేకుండా పోతోందే? గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించిందట. అలా వుంది మీ వ్యవహారం" అన్నాడు చిరాకుగా.

"సరేలెండి బావగారూ! అంతే మరి. వుండండి అక్కయ్యని పలకరించి వస్తాను" అంటూ నవ్వుతూనే సమాధానం చెప్పి వాకిట్లోనే పనివాడు అందించిన నీళ్ళతో కాళ్లు కడుక్కుని తిన్నగా వంటింట్లోకి నడిచాడు. వంట ఇంట్లో కుంపటి దగ్గర కూర్చుని కంది పప్పు వేయిస్తోంది మాణిక్యాంబ.

"అక్కయ్యా! ఏం చేస్తున్నావు?" అన్నాడు సూర్యం. చివాల్న తల తిప్పి చూసింది మాణిక్యాంబ.

"వచ్చావుట్రా నాయనా...! రా! కామేశ్వరిని తీసుకొచ్చావా?" అంటూ తమ్ముడిని పలకరించింది. ఆవిడకి సమాధానం చెప్తూనే పీట వాల్చుకుని కూర్చున్నాడు సూర్యం.

కుంపటి మీద నుండి గిన్నె దించేసి కాఫీ కలిపి ఇచ్చింది మాణిక్యాంబ. కాఫీ తాగి అక్కయ్యని అడిగి వేయించిన కందిపప్పు కాస్త పెట్టించుకుని తీరికగా నవ్వుతూ కబుర్లు చెబుతున్నాడు సూర్యం.

కాసేపు అల్లుడి కోసం చూసి చర చర వంటింట్లోకి వచ్చాడు పరంధామయ్య. అల్లుడిని చూస్తే ఒళ్ళు మండింది.

"ఏవోయ్...సూర్యనారాయణమూర్తీ! కంది బద్దలు కావాలంటే నా కూతురు వేయించి పెట్టనందా? ఇక్కడ కూర్చుని నెమరు వేస్తున్నావేం?" అన్నాడు కోపంగా.

బావగారి కోపం తెలిసిన సూర్యం నవ్వేశాడు. "లేదు బావగారూ! పదండి వస్తున్నాను" అంటూ వాకిట్లోకి నడిచాడు. తాపీగా మంచం మీద కూర్చుని "ఇపుడు చెప్పండి ... ఏమిటలా మండిపడుతున్నారు" అన్నాడు.

"అదేరా...అదే నేను మండిపడడం ఒక్కటే కనిపిస్తుంది. మీరు చేసేవన్నీ

బాగానే వుంటాయి" అన్నాడు పరంధామయ్య.

"ఏం చేశాం బావగారూ! ఎవరేం చేశారు? నేనా? బాబిగాడా? ఆనందా? ఎవరు?" అన్నాడు సూర్యం నవ్వుతూనే.

"వాడే...ఆ ఆఖరి వెధవే! ఇదిగో చూడు" అంటూ ఉత్తరం అందించాడు.

చదివి తల ఎత్తి "ఇందులో అంత కానిపని ఏం చేశాడు వాడు?" అన్నాడు సూర్యం.

"అదే...అదే. అక్కడే నాకు ఒళ్లు మండిపోయేది. వాడి ఇష్టమా వాడి పెళ్ళి? పెద్దవాడిని. అవతల వాళ్ళకి మాట ఇచ్చి వచ్చాను. అపుడేమో 'మీఇష్టం'అన్నాడు. ఇపుడేమో 'నా ఇష్టం' అంటున్నాడు" అన్నాడు పరంధామయ్య.

శాంతపరిచాడు సూర్యం. "అబ్బ ఏమిటి బావగారూ! మీకసలు కోపం వస్తే ముందూ వెనకా తెలీదు. కొన్ని కారణాల వల్ల అని రాశాడు. ఏవిటో అవి. వాడి కేదైనా పని వుందో, లేకపోతే వాడిని ఏ విదేశాలకైనా పంపుతున్నారో! ఏదీ తెలీకుండా ఇలా శాపనార్థాలు పెట్టేస్తే కష్టం కదూ!" అన్నాడు మెల్లిగా.

"అలాంటిదేదైనా వుంటే తిన్నగా అఘోరించేవాడే. ఇదేదో అనుమానంగా వుంది నాకు" అన్నాడు పరంధామయ్య.

"పోనీ మళ్ళీ ఉత్తరం రాసి కనుక్కుంటేసరి" సలహా చెప్పాడు సూర్యం.

"ఆఁ ఈ ఉత్తరాలతో పెట్టుకుంటే ఆ పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది. రేపు నువ్వే వెళ్లు. వెళ్ళి స్వయంగా అడిగిరా" ఆజ్ఞాపించాడు.

"రేపా! నాకు వీలుకాదే. పనులున్నాయి"

"అవున్నా అందరికీ పనులున్నాయి. ఏ పనీ లేనిది నాకే. మా రోజుల్లో ఇలాగే వుండే వాళ్ళమా? మీ నాన్న ఒక్క క్షణం విశ్రాంతిగా వుండనిచ్చేవాడా నన్ను. అపుడు మాకు పనులు లేకనే పెద్దవాళ్ళ మాట విన్నామా? ఇంతలేసి తెలివి తేటలు లేవు మాకు. అయినా నిన్నని ఏం లాభంలే. ఇదంతా నా కూతురు ఇచ్చిన అలుసు"

నవ్వేశాడు సూర్యం. "ఇపుడు దాని మాట ఎందుకు బావగారూ! అదొట్టి వెర్రి మాలోకం. వీలు చూసుకుని రెండు మూడు రోజుల్లో వెళ్లాలెండి ఆనందు దగ్గరికి. మీరు ఊరికే ఆవేశ పడకండి" అని నవ్వుతూనే లేచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

అల్లుడు వెళ్ళిన వైపుచూసి 'అవున్నా అది వెర్రి మాలోకమే. అందుకనే ఇలా నవ్వుతూనే దాన్ని వెర్రిదాన్ని చేసి పెళ్లి చేసుకున్నావు' అనుకున్నాడాయన.

నిజమే. కామేశ్వరికి సూర్యం మామయ్య అంటే ఇష్టం చిన్నప్పటి నుండి. 'ఏ ఇంజనీర్, డాక్టర్ చదవకుండా ఎగ్రికల్చర్ బియస్సీతో సరిపెట్టిన వాడికి పిల్లను ఇవ్వనా' అని స్కూల్లో తండ్రి ఎవరితోనో అంటూండగా వింది కామేశ్వరి. అప్పటికి ఎస్సెల్సీలో వుంది ఆ రాత్రే "అమ్మా! అమ్మమ్మను చూసి వస్తానే" అని చెప్పి ప్రయాణం అయింది. పోనీలే ఎలాగూ రేపు ఆదివారం. ఎల్లుండి స్కూలు వేళకి తిరిగి వస్తుందిలే అనుకుని—

"ఎల్లుండి పొద్దుటే వచ్చేయవే అమ్మడూ" అని చెప్పి భర్త అనుమతితో కామేశ్వరిని పుట్టింటికి పంపించింది మాణి

క్యాంబ. మనవరాలిని చూసి సంతోషంగా ఆహ్వానించింది అమ్మమ్మ. అయితే ఆ మనవరాలు వారం గడిచినా తిరిగి వెళ్ళే ఉద్దేశం లేకపోవడంతో "ఏమిటే అమ్మడూ! ఇంటికెళ్ళవూ? స్కూలు లేదూ..." అని అడిగింది.

కాసేపు వూరుకుని "నేనిక వెళ్ళను అమ్మమ్మా! ఇక్కడే వుండిపోతా"నంది.

"ఇక్కడ వుండిపోటానికేం? ముందంతా ఉండేదానివేగా, ఇపుడు వెళ్లు" అంది ఆవిడ నవ్వుతూ.

"నేను వెళ్ళను ఫో" అనేసి పారిపోయింది కామేశ్వరి. తిన్నగా పొలం వెళ్ళింది. కొబ్బరి చెట్టు కింద కూర్చుని పేపరు చదువుకుంటున్న సూర్యం దగ్గరికి వెళ్ళి కూర్చుంది.

"ఏం కామేశ్వరీ! చదువూ పాడూ లేవా నీకు. ఇక్కడే మకాం పెట్టావేం?" అన్నాడు సూర్యం.

మెల్లిగా తన మనసులోని మాట చెప్పింది. దీర్ఘంగా నిట్టూర్చాడు సూర్యం.

"పోనీ! బావ చెప్పినట్టు విని ఏ డాక్టర్నో చేసుకో" అన్నాడు. నీళ్ళు నిండిన కళ్ళతో దీనంగా చూసింది. "నువ్విలా అంటావని నేనెంత మాత్రం అనుకోలేదు మామయ్యా!" అంది దీనంగా.

"పిచ్చిదానా! పుట్టినే అన్నాను. నేనుండగా నీకు వేరే పెళ్ళి చెయ్యనిస్తానా మీ నాన్నని? కృష్ణుడిలాగా ఎత్తుకొచ్చెయ్యనూ?" అన్నాడు సూర్యం నవ్వుతూ. సిగ్గుపడి పారిపోయింది కామేశ్వరి.

తర్వాత ఇటూ అటూ రాయబారాలు జరిగాయి. కామేశ్వరి పట్టుదల, అందరూ ఇష్టపడడం, బావమరిది మంచితనం పరంధామయ్య మనసుని మార్చేశాయి. కామేశ్వరి మాత్రం అంతా స్థిరం అయ్యేదాకా పుట్టింటికి వెళ్ళనంది. ముహూర్తాలు పెట్టుకున్నాక సూర్యమే తీసుకెళ్ళి దించి వచ్చాడు. పెళ్ళికాగానే మామయ్యతో కాపురానికి వచ్చేసింది కామేశ్వరి.

ఇదిజరిగి ఎనిమిదేళ్ళయింది. సూర్యం ఆస్థి రెట్టింపు అయింది. అదంతా నీ అదృష్టం అంటాడు సూర్యం. కానీ కామేశ్వరికి మాత్రం తృప్తిలేదు. తండ్రి మీద, అన్నయ్య మీద పీకలదాకా కోపం. తన భర్తకు ఇవ్వాల్సిన గౌరవం ఇవ్వడం లేదనీ, జరపవలసిన మర్యాదలు జరపడం లేదనీ భర్తతోను, ఊరందరితోను చెప్పుకుని బాధపడుతుంది. నవ్వేస్తాడు సూర్యం.

బావగారికి ఇచ్చిన మాట ప్రకారం మూడురోజుల తర్వాత హైదరాబాద్ ప్రయాణం అయ్యాడు సూర్యం.

తెల్లవారుజామున నాలుగున్నరకు బావమరది ఇంటి తలుపు తట్టాడు. నిద్రలోంచి ఉలిక్కిపడి లేచి, సోనీ వచ్చి వుంటుంది అనుకుంటూ ఆదరాబాదరా లైటు వేసి పరుగున వచ్చి తలుపుతీశాడు ఆనందరావు.

"సూర్యం మావయ్యా! నువ్వా?" అన్నాడు నీరసంగా.

"నేనేరా! ఏం ఇంకెవరికోసమైనా చూస్తున్నావా?" అన్నాడు సూర్యం. దీర్ఘంగా నిట్టూర్చి వెనక్కితిరిగాడు ఆనందరావు. వెనకే వెళ్ళిన సూర్యం అతణ్ణే పరీక్షగాచూశాడు. ఇది విదేశాలకి వెళ్ళే అవతారంకాదని తెలిసిపోయింది.

"ఏరా ఆనందాయ్! అలా ఉన్నావేం?" అన్నాడు అనునయంగా.

"ఏం లేదులే మావయ్యా!" అన్నాడు పొడిగా.

కాసేపు ఆగాక "ఒరేయ్ నువ్వు అలా ఉత్తరం రాశావేమిటి? మీ నాన్న మండి పడిపోతున్నాడు. పెళ్ళివాళ్ళకి ఉత్తరం కూడా రాశాడుట నువ్వు ఒప్పుకున్నావని. మరింతలోకే నీకేమైంది?'' అన్నాడు సూర్యం.

"అపుడలా అనుకున్నమాట నిజమే కానీ మామయ్యా, తర్వాత పరిస్థితులు మారాయి. నేను పెళ్ళి చేసుకోలేను" అన్నాడు ఆనందరావు గంభీరంగా.

"ఏరా! ఏదైనా కేసులో ఇరుక్కున్నావా? జైలుకి వెళ్ళాలా?''

"లేదు మావయ్యా! జైలుకి వెళ్ళక్కర్లేదుగానీ బందీని అయిపోయాను"

"అదేమిట్రా! సరిగా చెప్పు."

ఒక్కక్షణం మావయ్యవంక చూశాడు ఆనందరావు. మావయ్య ఏదైనా సలహా చెప్పగలడేమో అనుకుని మెల్లిగా తన బాధ వివరించాడు. కుతూహలంగా విన్నాడు సూర్యం.

"ఒరే ఆనందాయ్! నాకు ఉత్తరం చూపించరా"

"లేదు మావయ్యా! నేను చూపించను. అది నా పర్సనల్ లెటర్. అది నా ఒక్కడికే పరిమితం" అన్నాడు ఆనందరావు నిర్మొహమాటంగా.

ఉలిక్కిపడ్డాడు సూర్యం. ఏదో సీరియస్ వ్యవహారమే అనుకున్నాడు. కాసేపాగి ఇంటర్వ్యూ మొదలు పెట్టాడు. ఎంత సేపు అడిగినా ఆ చుట్టుపక్కల అతని ఆఫీసులో, అతని స్నేహితుల ఇళ్ళల్లో, అతని పరిచయస్థుల్లో ఎక్కడా కూడా అలాంటి అమ్మాయిలేదు. చాలా సేపు ఆలోచించాడు సూర్యం.

"ఒరేయ్ ఆనందూ! అసలు ఇది ఎవరైనా నీ మగ స్నేహితులు వేసిన ప్రాక్టికల్ జోక్ కాదుకదా?" అన్నాడు సందేహిస్తూ.

కొట్టిపారేశాడు ఆనందరావు. "లేదు మావయ్యా! ఎంతమాత్రంకాదు. అసలు నాకలాటి స్నేహితులు ఎవరూలేరు."

మరి కాసేపు మౌనంగా వుండి "ఒరేయ్ ఆనందూ! నీకోమాట చెప్పనా? ఎవరో ఊరూ పేరూ తెలీని కిరస్తానీ అమ్మాయిమీద నీకు ఈ వెర్రి ఏమిటి? మీ నాన్న సంగతి నీకు బాగాతెలుసు. ఆయన కంఠంలో ప్రాణం వుండగా ఒప్పుకుంటాడా? అసలుఇదంతా మర్చిపో. ఆ ఉత్తరం అవతల పారెయ్" అన్నాడు సూర్యం నచ్చజెపుతూ.

చిరాకుగా చూశాడు ఆనందరావు. "ఎంత తేలికగా చెప్పేశావు మావయ్యా! మా అక్కయ్యకోసం నువ్వెంత పట్టుబట్టలేదూ!" అన్నాడు గతం గుర్తుచేస్తూ.

ఒళ్ళు మండింది సూర్యానికి. "అదోటి దొరికిందిరా మీ అందరికీ. అది నా మేనకోడలు. పుట్టినపుడే నా భార్యగా నిర్ణయం అయిపోయింది. దానికీ, ఇపుడు ఊరూ పేరూ తెలీని ప్రేయసికీ ఎందులో పోలికరా" అన్నాడు.

ఆనందరావుకి చిరాకు వేసింది. "అంతేలే మావయ్యా! నీ భార్య నీకెలా అపురూపమో, నా ప్రేయసీ నాకు అంతే" అన్నాడు ఖచ్చితంగా.

"సరే! మరి ఏంచేస్తావు చెప్పు. ఆవిడ గారి సోనీ అన్న పేరు తప్ప వేరే ఏ వివరాలు తెలీవుకదా! మరి ఎలా వెళతావు? పేపర్లో వేయిస్తావా? దండోరా వేస్తావా" సూర్యం గొంతులో కోపం.

చిరాకు కల్సిపోయింది.

నీరుకారిపోయాడు ఆనందరావు. కళ్ళు నీళ్ళు తిరిగాయి. "అదే నాకు తెలీడం లేదు. ఏం చెయ్యమంటావు?" అన్నాడు దీనంగా.

తల పట్టుకున్నాడు సూర్యం. 'వీళ్ళ నాన్న రంకెలువేసి మండిపడిపోయి ఎదుటి వాళ్ల నోరు మూయిస్తే, వీడు ఏడిచి నోరెత్తే అవకాశం లేకుండా చేస్తాడు' అనుకున్నాడు. కాసేపు అటూ ఇటూ పచార్లు చేసి—

"ఒరే ఆనందూ! మంచి ఆలోచన వచ్చిందిరా" అన్నాడు సడన్‌గా.

"ఏమిటి మామయ్యా?" అన్నాడు ఆనందరావు ఆశగా.

"నువ్వు పెళ్ళి చూపులకు వస్తున్నావని వాళ్లకి రాసేశాడు బావ. నువ్వు రేపటినుండి నీ పరిచయస్తులతో, అందరితోనూ నువ్వు పెళ్లిచూపులకి వెళ్తున్నట్లు చెప్పేసెయ్. దానితో అదిరిపోయి ఆ సోనీ అజ్ఞాతవాసంలోంచి బయటకి వచ్చేస్తుంది. ఇక అప్పుడు అసలా సోనీ ఎవరో...ఏమిటో మనకు తెలుస్తుంది" అన్నాడు సూర్యం.

ఎగిరి గంతేశాడు ఆనందరావు. "మావయ్యా! నీ తెలివితేటలు అమోఘం" అన్నాడు సంతోషంగా.

"ఆగాగు. అంత డాన్స్ చెయ్యకు. ఒకవేళ నీ పెళ్ళిచూపుల లోపల ఆ అమ్మాయి ఆచూకీ తెలియకపోతే ఏం చేస్తావు?" అన్నాడు ఆరాగా సూర్యం.

నీరుకారిపోయాడు ఆనందరావు. అంతలోనే ధైర్యం తెచ్చుకుని "అలా జరగదు మావయ్యా! అంతా సవ్యంగానే జరుగుతుంది" అన్నాడు ధీమాగా.

"సరే! అలా అయితే నాకు తెలియపర్చు. నేను వెంటనే వచ్చేస్తాను. లేకపోతే మాత్రం బుద్ధిగా పెళ్ళిచూపులకి వచ్చేయ్"

"ఊహు! నేను రాను మామయ్యా"

"ఒరేయ్ ఆనందాయ్! నీకు మీనాన్న సంగతి బాగా తెలుసు. ఇలా తలాతోకా లేకుండా మొండికేశావంటే ఆయనే వచ్చి నీ లేడీ సెక్రటరీ ముందు, నీ పనివాళ్ళ ముందు, అందర్నీ మించి నీ సోనీ ముందు 'చేతకాని వెధవా...చవటా' అని రెండు తగిలిస్తాడు. నీ పరువు కాస్తా పోతుంది. అందుకని బుద్ధిగా చెప్పింది విను. ఈ లోపల సోనీ కనిపిస్తే ఏదో మార్గం ఆలోచిద్దాం. లేకపోతే ఆ సోనీ సంగతి మర్చిపోయి హాయిగా పెళ్ళి చేసుకో" అన్నాడు సూర్యం.

ఆలోచనలోపడ్డాడు ఆనందరావు. ఇంక తర్జనభర్జనలు అనవసరం. అసలు తనను అంతగా ప్రేమించిన తన సోనీ ఈ వార్త వింటూనే పరిగెత్తుకు వచ్చి తన ఎదుట నుంచుని నిందిస్తుంది. ఇది నిజం కాదని, కేవలం నాటకమని చెప్పి ఓదార్చేసరి. నిజం తెలుసుకుని సిగ్గు పడుతూ నవ్వేస్తుంది.

"సోనీ...నా సోనీ" అన్నాడు ఆనందరావు పరవశంగా.

"ఆనంద్...ఒరే ఆనంద్" అన్నాడు సూర్యం చికాకుగా. ఈ లోకంలోకి వచ్చాడు ఆనందరావు. "సరేలే మామయ్యా...అలాగేలే! ఇక కబుర్లు చెప్పు" అంటూ సంభాషణ మార్చేశాడు. ఆరోజంతా అక్కడే వుండి రాత్రి భోజనం చేసి ఆనందరావు అక్కకోసం కొన్ని గద్వాల్ చీర, రాళ్ళ గాజులు, అనాబ్ షాహి ద్రాక్షపళ్ల బుట్టతో బస్సె

కాక్కడు సూర్యం.

మర్నాడు పొద్దున్నే వెళ్ళగానే మార్గరెట్‌ని పిల్చి "నేను పెళ్ళిచూపులకు వెళ్తున్నాను"అని చెప్పాడు ఆనందరావు.

"కంగ్రాచ్యులేషన్స్ సర్" అంది నవ్వుతూ.

ఒక్కక్షణం తేరిపార చూశాడు ఆనందరావు. "చూడండి. ఈ వార్త కాస్త మీకు తెలిసినవాళ్ళందరికీ చెప్తారా?" అన్నాడు మర్యాదగా. ఒక్కక్షణం తెల్లబోయి అందంగా నవ్వింది మార్గరెట్.

"బెస్ట్ జోక్ సర్" అంది.

"నోనో...జోక్ కాదు. నిజంగానే. మీకు తెలిసినవాళ్లందరికీ ముఖ్యంగా అన్‌మారీడ్ గర్ల్స్ అందరికీ, అదీ మీ ఆంగ్లో ఇండియన్స్‌లో అందరికీ చెప్పేయండి. ఒక్కళ్ళని కూడా వదలద్దు"

మరింతగా నవ్వింది మార్గరెట్. "యూ నాటీ" అంది నవ్వుతూనే.

"నోఅయాం నాట్ నాటీ! అయాం వెరీసీరియస్" అన్నాడు ఆనందరావు గంభీరంగా.

"ఓ.కె. ఐవిల్ టెల్" అంటూ నవ్వుతూనే వెళ్ళిపోయింది. ఇక ఆ తర్వాత తనకు తెలిసినవాళ్లందరికీ ఫోన్ చేసి తను పెళ్ళి చూపులకి వెళుతున్నట్లు చెప్పాడు. ఫోన్ సౌకర్యం లేనివాళ్ళకి ఉత్తరాలు రాశాడు. కొంతమందికి పనిమనిషిచేత కబురు చేశాడు. కొందరికి రంగిస్వామిచేత చెప్పించాడు. మరి కొంతమంది ఇళ్ళకి తనే వెళ్ళి చెప్పి వచ్చాడు. అందరితోనూ ఈ వార్త వాళ్ళకు తెలిసిన వాళ్ళందరికీ చెప్పమని బతిమాలుకున్నాడు.

చాలామంది అభినందనలు చెప్పారు. కొంతమంది 'పెళ్ళికి మమ్మల్ని పిలు. తప్పకుండావస్తాం' అన్నారు. మరి కొందరు 'పెళ్ళిచూపులకే ఇంత ఆర్భాటం చేస్తున్నాడు. పెళ్ళికి ఇంకెంత హంగామా చేస్తాడో' అనుకుని నవ్వుకున్నారు.

మొత్తానికి అతని పరిచయస్థులకి, పరిచయస్థుల పరిచయస్థులకి, స్నేహితులకి, స్నేహితుల స్నేహితులకి అందరికీ 'ఆనందరావు పెళ్ళి చూపులకి వెళ్ళబోతున్నాడు' అనే వర్తమానం అందింది.

ఆనందరావు వేయికళ్ళతో తన ప్రేయసి కోసం ఎదురు చూస్తున్నాడు. తలుపు చప్పుడు అయితే చాలు 'వస్తున్నా సోనీ! నువ్వు అపార్థం చేసుకున్నావు. అసలు ఈ నాటకం అంతా నీకోసమే' అంటూ పరుగున వెళ్ళి తలుపు తీస్తున్నాడు. ఆ వచ్చినవాళ్ళు పనిమనిషో, పేపర్ వాడో, మరెవరో ఇతని మాటలు వినిపించిన వాళ్ళు ఏదయినా డ్రామా రిహార్సల్స్ కాబోలు అనుకుంటున్నారు.

నెలరోజులు గిర్రున తిరిగి వచ్చాయి. ఆనందరావు శ్రమ వ్యర్థం అయింది. అతని పథకం ఫలించలేదు. పరంధామయ్యగారి ఉత్తరం పెళ్ళిచూపుల తేదీని తెలియజేస్తూ విలన్‌లాగ వచ్చేసింది. "నేను రాను మావయ్యా! నాన్నగారికి ఏదో సర్దిచెప్పు" అంటూ సూర్యానికి ఉత్తరం రాశాడు ఆనందరావు.

వెంటనే టెలిగ్రాం వచ్చింది. "నువ్వు వెంటనే రా. మీ నాన్నకి నువ్వే చెప్పుకో. నేను ఏమీ కల్పించుకోను. అసలు విషయం చెప్పేసి మీ నాన్నని నీకోసం పంపుతాను" అని వుంది దాన్లో.

గుండె దడదడమంది ఆనందరావుకి. కళ్లఎదుట తన కామన్‌హాల్లో అందరి

ఎదుటా తండ్రి 'అప్రాచ్యుడా, అంట్ల వెధవా' అని తిడుతున్న దృశ్యం కనిపించింది. కళ్ళు మూసుకున్నాడు. 'ఈ తినే చివాట్లు ఏవో అక్కడికెళ్ళి అమ్మ ముందు, పాలేర్లముందు తింటే సరిపోతుంది. అది వాళ్ళకీ, తనకీ చిన్నప్పటి నుండీ అలవాటే' అనుకుని తప్పనిసరిగ సెలవుపెట్టి, విధి లేక ప్రయాణం అయ్యాడు ఆనందరావు.

వెళ్ళగానే నాన్నగారి ఎదుట నిలబడి 'నన్ను క్షమించండి నాన్నగారూ! నేను మీరు చూసిన సంబంధం చేసుకోలేను. నేను ఒక క్రిస్టియన్ అమ్మాయిని ప్రేమించాను. ఆరు నూరయినా, నూరు ఆరయినా ఆ అమ్మాయినే చేసుకుంటాను. ఈ కులాలు, మతాలు మనం సృష్టించుకున్నవే. భగవంతుడి దృష్టిలో అందరూ సమానమే. మీరు అంగీకరించి మమ్మల్ని ఆశీర్వదించండి. మీ పేరు చరిత్రలో చిరస్థాయిగా నిల్చిపోతుంది' అని ధైర్యంగా చెప్పాలి అనుకుంటూ, రాత్రంతా బస్సులో రిహార్సల్స్ వేసుకున్నాడు. పక్కసీట్లో కూర్చున్న తను రెండు మూడు సార్లు కుదిపి—

"ఏవిటండీ, అలా కలవరిస్తున్నారు? కాస్త మెలకువ తెచ్చుకోండి" అని హెచ్చరించాడు విసుగ్గా.

బెజవాడలో బస్సుదిగి తనఊరి బస్సు పట్టుకుని ఇంటికి చేరేసరికి తొమ్మిది గంటలయింది.

వాకిట్లో అరుగుమీద కూర్చుని వున్నాడు



తండ్రి. చుట్టూ ఎవరెవరో వున్నారు. దూరంనుండి చూసిన ఆనందరావుకి అద్భుతమయిన ఆలోచన వచ్చింది. 'ఆ అందరిఎదుటే తను చెప్పదల్చుకున్నది చెప్పేస్తేసరి. అంతమంది ఎదుట కాదన లేరు నాన్నగారు' అనుకుంటూ వాకిట్లో వచ్చాడు. గుండె దడదడ లాడింది. మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ లోపలికి నడుస్తుంటే–

"ఆ! ఏరా, ఏమిటా పెళ్ళినడకలు? తొందరగా నడపలేవూ? రా ఇటు" అని అరిచాడు పరంధామయ్య.

ఒక్క పరుగున వెళ్ళి తండ్రి ఎదుట నిలబడ్డాడు.

"ఏవిటి? ఎలా వున్నావు?" అన్నాడు పరంధామయ్య.

"బాగానే ఉన్నానండీ" అన్నాడు ఆనందరావు నీరసంగా.

"ఏమిటా నీరసం? పదిమంది ఆడ పిల్లల పెళ్ళిళ్ళు చేసినవాడిలాగ వుంటావేం ఎప్పుడు చూసినా? మారోజుల్లో మేం ఇలాగే వుండేవాళ్ళమా? సమాధానం చెబితే ఖంగుమని నాలుగుబజార్లు వినిపించేది. మీరూ వున్నారు ఎందుకు? నోట్లో చెవి పెడితేనేగాని ఏం మాట్లాడారో వినిపించదు. సర్లే లోపలికి పో. ఎల్లుండి వెళ్ళాలి వాళ్ళింటికి" అని కొడుకుని



పలకరించి మళ్ళీ మాటల్లో మునిగి పోయాడు పరంధామయ్య.

మరింత నీరసంగా ఈసురోమంటూ లోపలికి వెళ్ళాడు ఆనందరావు. తల్లి ఎదురు వచ్చింది. "వచ్చావా తండ్రీ రా" అంటూ పలకరించింది. కాఫీ, ఫలహారం పెట్టి యోగక్షేమాలు అడిగింది. చిక్కిపోయావురా అని బాధపడింది. కాసేపు వూరుకుని—

"అమ్మా! నీకో ముఖ్యమైన సంగతి చెప్పాలి" అన్నాడు ఆనందరావు.

"ఏమిట్రా అది?" అంది ఆవిడ ఆశ్చర్యంగా.

"అదే అమ్మా! నేనో కోరిక కోరుకుంటాను. నువ్వే తీర్చాలి" అన్నాడు.

దీర్ఘంగా నిట్టూర్చింది ఆవిడ. "చూడరా ఆనందాయ్. ఈ ఇంట్లో నామాట ఎంత చెల్లుతుందో నీకు తెలుసుగా. నా చేతుల్లో ఉన్నదేదైనా అయితే అలాగే చేస్తాను. ఏదైనా తంటానికి కావాలా? మొహమాట పడకుండా చెప్పు. చేసి పెడతాను" అంది.

చిరాకు వేసింది ఆనందరావుకి. లేచి వెళ్ళిపోయాడు. మళ్ళీ తండ్రీ కొడుకులు భోజనాల దగ్గర కలుసుకున్నారు. ఎలాగైనా అడిగేయాలి అనుకుంటూ కూర్చున్నాడు ఆనందరావు.

"ఏమిట్రా ఆ తిండి. సరిగ్గా తిను. రేపు వాళ్ళింట్లో ఇట్లా నంగి నంగిగా వున్నావంటే నవ్వుతారు" అని గదిమాడు పరంధామయ్య.

బిక్కచచ్చిపోయాడు ఆనందరావు.

"ఒరే! అన్నంతిని మావయ్య దగ్గరికి వెళ్ళు. వాళ్ళిద్దర్నీ తీసుకురా. ఎల్లుండి పొద్దున్నే వెళ్ళాలి" అని ఆర్డరు వేసేసి లేచి వెళ్ళిపోయారు ఆయన.

ఒళ్ళుమండిపోతోంది ఆనందరావుకి. నోరు పెగలదు తండ్రి ఎదుట. తన భయానికి తనమీద తనకే చిరాకు వేసింది. ఎలాగో భోజనం ముగించి వెంటనే బయల్దేరి బస్‌కోసం వెళ్ళాడు.

ఉయ్యాల బల్లమీద కూర్చుని తాంబూలం నములుతూ పేపరు చదువుకుంటున్న సూర్యం అడుగుల చప్పుడుకి తలఎత్తి చూశాడు. వెంటనే—

"కామేశ్వరీ! పెళ్ళికొడుకు వచ్చాడు చూడు" అన్నాడు సంతోషంగా. గుర్రుగా చూశాడు ఆనందరావు. పాలేరుకి అన్నం పెడుతున్న కామేశ్వరి పరుగున వచ్చేసింది.

"వచ్చావుట్రా తమ్ముడూ! పొద్దున్నే కాకి అరిస్తే నువ్వు వస్తావని వంట కూడా చేసి ఉంచాను. ఎప్పుడొచ్చావు?" అంది సంతోషంగా. నవ్వుతూ అక్కను పలకరించి సమాధానాలు చెప్పాడు ఆనందరావు.

"మరి ఎప్పుడురా వెళ్ళడం, ఎల్లుండేనా? మంచి సంబంధమటగా! బి.ఎ. పాసయిందిట ఆ అమ్మాయి. కట్నం అదీ బాగానే ఇస్తారుటగా! ఒరే ఆనందాయ్! నీ ఉత్తరంలో నాలాంఛనాలు రాసినపుడు స్టీలు కాళ్ళకడుగు పళ్లెం మర్చిపోయావా! పోస్టుచేశాక జ్ఞాపకంవచ్చింది. సరేలే వాడు రాగానేచెప్పచ్చు అనుకున్నాను. నీ చెవిని వేశాక నా మనసు స్థిమితపడింది" అంది కామేశ్వరి.

నవ్వేశాడు ఆనందరావు. "నీ మరదలు వాళ్ళింట్లో ఈ లాంఛనాలూ అవీ వుండవు అక్కయ్యా! వాళ్ళు తెల్లగౌను వేసి పెళ్ళి చేసేస్తారు. నీకేంకావాలంటే అవి నేను కొనిస్తాలే" అన్నాడు.

నోరు తెరిచింది కామేశ్వరి. సూర్యం

కల్పించుకోక తప్పలేదు. "లేకపోతే ఏమిటి కామేశ్వరీ! ఎండన పడి వచ్చాడు. వాడికి కాసిని మంచినీళ్ళయినా ఇవ్వ కుండా ఏమిటి నీగోల. బాగా సమాధానం చెప్పాడులే" అనేశాడు.

నాలిక కరుచుకుని లోపలికి పరి గెట్టింది కామేశ్వరి. బావమరిది చెయ్యి పుచ్చుకుని లాక్కుపోయాడు సూర్యం.

"ఏమిట్రా ఆ వాగుడు? మీ అక్కయ్యకి ఏమాత్రం అనుమానం వచ్చినా ఊళ్ళో అందరికీ చాటింపు వేసి, నాన్నగారి దగ్గరకు వెళ్ళి చెప్పేస్తుంది. ఇక నీ పెళ్ళి నీతోపాటు మళ్ళీ నా పెళ్ళి కలిపి చేస్తాడు ఆయన. కాస్త తెలివిగా మాట్లాడు వెర్రి వెధవా" అని తిట్టాడు.

అప్పటికి తన తప్పు తెలిసివచ్చింది ఆనందరావుకి. "సారీ మావయ్యా" అన్నాడు.

అంతలోకే కొబ్బరి బొండాలతో తిరిగి వచ్చింది కామేశ్వరి. సాయంత్రం దాకా కబుర్లతో కాలక్షేపం చేశారు ముగ్గురూ. సాయంత్రం చల్లబడ్డాక బావ గారిని తీసుకుని ఇంట్లోంచి బైటపడ్డాడు ఆనందరావు.

"నువ్వూ వాళ్ళపక్షం చేరిపోయావేం?" అని నిలదీశాడు.

"ఏం చెయ్యమంటావు" అన్నాడు సూర్యం.

"నా తరఫున నాన్నతో దెబ్బలాడు. ఈ పెళ్ళి ఆపించు" అన్నాడు ఆనందరావు ఆవేశంగా.

సూర్యం ససేమిరా ఒప్పుకోలేదు. "నా పెళ్ళికి దెబ్బలాడాను మీనాన్నతో. నీ పెళ్ళికి ఆ కష్టాలు నువ్వేపడు" అన్నాడు.

బతిమాలుకున్నాడు ఆనందరావు. వేడుకున్నాడు. ఎంతకీ లొంగి రాలేదు సూర్యం. చివరికి జాలివేసి చిన్న ఉపాయం సూచించాడు. ప్రాణం లేచి వచ్చింది ఆనందరావుకి.




అనుకున్న ప్రకారం వర్జ్యం లేకుండా మంచి శకునం చూసుకుని బయల్దేరింది టాక్సీ. ముందు సీట్లో డ్రైవరు పక్కన సూర్యం, అతని పక్కనే కామేశ్వరి. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ హాయిగా వున్నారు. వెనక సీట్లో ఓ చివర పరంధామయ్య పొందూరు ఖద్దరు పంచె, తెల్లటి షర్టు, పైన జరీ ఉత్తరీయం— గంభీరంగా కూర్చుని ఆ వెళ్ళబోయే పెళ్ళివారింట్లో ఎంత బెట్టుగా వుండాలో ప్లానువేసుకుంటున్నాడు. ఆయన పక్కన మాణిక్యాంబ జానెడు వెడల్పు జరీ అంచు చీర కాశెపోసి కట్టుకుంది. 'ఎలా వుంటుందో ఆపిల్ల? కట్నాలు, కానుకలూ పెద్దగా లేకపోయినా ఫరవాలేదు. పిల్ల చక్కగా, వినయంగా వుండే చాలు' అనుకుంటూ కూర్చుంది.

రెండో చివర ఆనందరావు 'సోసీ సోసీ' అని మనసులోనే ఆక్రోశిస్తూ, అన్యమనస్కంగా 'భగవంతుడా! ఏవిటి నాకీ పరీక్ష' అనుకుంటూ పైకి ఏడవలేక లోపలే ఏడుస్తూ కూర్చున్నాడు. ముఖంలో

కళాకాంతిలేవు. మధ్య మధ్య సూర్యం వెనక్కి తిరిగి బావమరిదిని మాటల్లోకి దింపాలని ప్రయత్నం చేస్తున్నాడు. రెండు నిమిషాలకోసారి "ఏవిటా ఏడుపు మొహం? ఏదో నీ సొమ్మంతాపోయినట్లు బిక్కమొహం వేస్తావేం?" అంటూ పరంధామయ్య గదుముతున్నాడు. కానీ ఆనందరావులో ఏమాత్రం మార్పులేదు.

టాక్సీ గమ్యం చేరింది. పెళ్ళివారు గొప్ప వంశానికి చెందినవారు. పెళ్ళి కొడుకు మంచి హోదాలో వున్నాడు. కాబట్టి అమ్మాయి ఇంట్లో ఏర్పాట్లు పాత కొత్తల మేలికలయికలా వున్నాయి. టాక్సీ ఆగగానే అందరూ పరుగున వచ్చి తీసుకువెళ్ళారు. కాళ్లు కడుక్కునేందుకు నీళ్లు అందించారు. లోపలికి తీసికెళ్ళి మగ వాళ్ళందర్నీ హాల్లో కూర్చోబెట్టి ఆడ వాళ్ళను లోపలికి తీసుకెళ్ళారు.

కుశల ప్రశ్నలు, లోకాభిరామాయణం, రాజకీయ చర్చలు అనేకం సాగుతున్నాయి మగవారి మధ్య. పరంధామయ్యగారు బెట్టుగా ఏదో తూచి తూచి మాట్లాడుతూ వుంటే ఆనందరావు అసలు నోరెత్తడంలేదు. ఎక్కువ భాగం సూర్యమే మాట్లాడుతున్నాడు.

లోపల ఆడవాళ్లు చీరలు, నగలు, పిండివంటలు, ఆవకాయలు మొదలగు విషయాలు చర్చిస్తున్నారు. కాసే పయ్యాక కాఫీ, ఫలహారాలు ముగిశాక పెళ్లికూతుర్ని తీసుకువచ్చి మాణిక్యాంబ గారి ఎదురుగుండా చాపమీద కూర్చో బెట్టారు. పొందికగా కూర్చుంది అమ్మాయి.

"నీ పేరేమిటమ్మా" అని అడిగింది కామేశ్వరి.

"కమలకుమారి" అందా అమ్మాయి వినయంగా.

"ఏం చదువుకుంటున్నావు?" అంది కామేశ్వరి.

"బి.ఎ. పాసయ్యాను"

"పాటలు వచ్చా?"

"రావండీ"

"మరి కుట్లూ... అల్లికలూ?"

"వచ్చు"

ఇక ఇంటర్వ్యూ అయిపోయింది. 'ఆడ వాళ్ళిద్దరికీ అమ్మాయి నచ్చినట్లే. ముఖాలు ప్రసన్నంగానే వున్నాయి' అనుకున్నారు అమ్మాయివైపువాళ్ళు. మరో రెండు నిమిషాలు గడిచాయి మౌనంగా.

"అమ్మాయిని ముందుగదిలోకి తీసుకెళ్ళండి. మగవాళ్ళు చూస్తారు" అంది మాణిక్యాంబ.

"లే.. కమలా" అంటూ లేవదీసి చీర కుచ్చిళ్లు సవరించి ముందు హాలులోకి నడిపించారు. చెమటలు పడుతున్న అరిచేతులతో మెల్లిగా వెళ్ళి కుర్చీలో కూర్చుంది కమల. అప్పటిదాకా మాట్లాడుతున్న మాటలు ఆపేశారు అందరూ.

"నీ పేరేమిటి అమ్మాయ్" అన్నారు పరంధామయ్యగారు.

"కమలకుమారి" అంది వినయంగా.

"ఏం చదువుకున్నావు?"

"బి. ఎ. పాసయ్యానండీ" అంది మరింత వినయంగా. మళ్ళీ ఇంటర్వ్యూ ముగిసింది. నిశ్శబ్దం. మెల్లిగా తలెత్తి పెళ్లికొడుకుని చూసింది కమల. కొద్దిగా తల వంచుకుని కూర్చుని వున్నాడు. 'చాలా అందంగా వున్నాడు' అనుకుంది.

"అబ్బాయిని ఏమైనా అడగాలంటే అడగమనండి" అన్నారు పెళ్ళికూతురు తండ్రి.

చివాల్న తలఎత్తి మావయ్యవంక

చూశాడు ఆనందరావు. అప్పటిదాకా అతన్నే చూస్తున్న సూర్యం చిన్నగా నవ్వి తల తిప్పుకున్నాడు. పరంధామయ్యగారు కంఠం సవరించుకుని "వాడు ప్రత్యేకంగా అడిగేది ఏముంటుందిలెండి" అని చెప్పేసే లోపలే ఆనందరావు నోరు విప్పాడు.

"నేను ఆవిడతో ఒంటరిగా మాట్లాడతాను" అన్నాడు.

పరంధామయ్యగారు కాల్చేసేలాగ చూశారు.

సూర్యం అనుమానంగా, ఇబ్బందిగా చూశాడు.

కమల సిగ్గుగా చూసింది.

పెళ్ళికూతురి తండ్రి అభిమానంగా చూశాడు.

ఆనందరావు మాత్రం ఎవరినీ చూడలేదు. తలవంచుకుని తన బూట్ల వంక చూసుకున్నాడు.

పెళ్ళికూతురి తండ్రి లేచి "రండి" అంటూ పక్కనేవున్న పరోగదిలోకి దారితీశాడు. అతని వెంటే వెళ్ళాడు ఆనందరావు.

"రామ్మా" అంటూ కూతుర్ని పిల్చాడు తండ్రి. వచ్చింది.

"వెళ్ళమ్మా! ధైర్యంగా సమాధానాలు చెప్పు" అని చెప్పి ఇవతలకి వచ్చి, తన జాగాలో కూర్చున్నాడు.

ఇదంతా చూస్తున్న పరంధామయ్యకి ఒంటికి కొరివి కారం రాసుకున్నట్టుగా వుంది. కోపం పట్టలేక—

"ఏవిటో దిక్కుమాలిన రోజులు వచ్చాయి. పెళ్లికి ముందే కూతుళ్ళకి చాలా స్వతంత్రాలు ఇచ్చేసి గదుల్లోకి పంపేస్తున్నారు" అన్నాడు కసిగా.

పెళ్ళికూతురి తండ్రికి ఒళ్లుమండింది. కానీ బలవంతాన ఓర్పు వహించాడు. 'మంచి సంబంధం. అబ్బాయి బావున్నాడు. మంచి ఉద్యోగం. అన్నింటినీ మించి అమ్మాయితో ఒంటరిగా మాట్లాడాలి అన్నాడు. అంటే తొంభై పాళ్లు కుదిరిపోయినట్లే. కాబట్టి కాస్త శాంతంగా వ్యవహారం నడుపుకుంటే పెళ్ళయ్యాక ఈయనని ఒక ఆట ఆడించవచ్చు' అనుకుని వూరుకున్నాడు.

గదిలో కమల కుర్చీలో కూర్చుంది. ఆనందరావు ఎదురుగా మరో కుర్చీలో కూర్చుని వున్నాడు. అతని చేతులు, కాళ్లు వణికి పోతున్నాయి. చెమటలు పట్టేస్తున్నాయి. బుద్ధి తెలిశాక ఏ ఆడపిల్లతోను ఒంటరిగా కాదు కదా, పదిమందిలో కూడా మాట్లాడిన పాపాన పోలేదు. కానీ పరిస్థితుల ప్రభావానికి తల ఒగ్గి ఇలా మాట్లాడాల్సిన అవసరం వచ్చింది కాబట్టి 'తప్పదు' అనుకుంటూ తనకి తనే ధైర్యం చెప్పుకుంటున్నాడు. కానీ అంతలోనే పిరికితనం ఆవహించేస్తోంది. మెల్లిగా కుర్చీలోంచి లేచి అటూ ఇటూ తిరగడం మొదలు పెట్టాడు. మధ్యలో ఆగి—

"చూడండి మిస్" అన్నాడు.

తలెత్తిచూసి మళ్ళీ సిగ్గుగా తలవంచుకుంది కమల. నిట్టూర్చి మళ్లీ తిరగడం మొదలు పెట్టాడు. కాసేపయ్యాక—

"ఒకసారి ఇటు చూస్తారా?" అన్నాడు.

తలెత్తి చూసి చిన్నగా నవ్వి తల దించుకుంది కమల. మళ్ళీ నిట్టూర్చి పచార్లు మొదలుపెట్టాడు ఆనందరావు. కమలకి అతని ధోరణి అంతుపట్టడం లేదు. 'సుఖంగా కూర్చుని అతను చెప్ప

దల్చుకున్నదేదో చెప్పక గడియారం పెండ్యులమ్‌లాగ ఎందుకు తిరుగుతున్నాడో' అనుకుంది.

ఆనందరావు ఆగి "చూడండి మిస్" అన్నాడు మళ్లీ. వెంటనే తల ఎత్తింది కమల. ధైర్యంగా, సూటిగా అతని వంక చూసింది. తల వంచుకోలేదు. ఆనందరావు నోరు తడారిపోయింది. కానీ వెంటనే ధైర్యం - మొండి ధైర్యం, ఆవేశం- పీరావేశం వచ్చేశాయి.

వెంటనే టకటక నడుచుకుంటూ వచ్చి కమల కుర్చీకి అడుగు దూరంలో నిలబడి సూటిగా చూశాడు. ఈ అమ్మాయికి చెప్పేయాలి. 'నేను వేరే అమ్మాయిని ప్రేమించాను. నిన్ను పెళ్ళి చేసుకోవడం అసంభవం' అని చెప్పాలి. అసలు ముందు ప్రేమ అంటే ఏమిటో తెలుసో తెలీదో! అందుకే సూటిగా అడిగేయాలనుకున్నాడు. ఆ క్షణాన అతనికి ఆ అమ్మాయి పెళ్లికూతురిలాగ, పరాయి పిల్లలాగ అనిపించలేదు. తన దగ్గర పనిచేసే ఒక లేడీ క్లర్కులాగ అనిపించింది. అందుకే—

"మీరు ఎవరినైనా ప్రేమించారా?" అన్నాడు సూటిగా చూస్తూ. అదిరిపడింది కమల. తల అడ్డంగా ఆడించింది.

"పోనీ మీకు 'ప్రేమ' అంటే ఏమిటో తెలుసా?" అన్నాడు కఠినంగా.

బెదిరిపోయింది కమల. గభాల్న లేచి నుంచుని తల గబగబ ఆడించింది. మరింతకోపం వచ్చింది ఆనందరావుకి.

"తెలీదా? ప్రేమంటే తెలీదా? నీకు ఎలా చెప్తే అర్థం అవుతుంది? చెప్పు. నీకెందుకు తెలీదు? ప్రేమంటే ఎందుకు తెలీదు నీకు? చెప్పు" అని గద్దించాడు- ఆఫీసులో లేడీ క్లర్కుని "వాటీస్‌దిస్? వై సో డిలే? ఐవాంట్ యువర్ ఎక్స్‌ప్లనేషన్" అని అడిగే రీతిలో.

కమలకు వెన్నులోంచి వణుకు పుట్టుకు వచ్చింది. కెవ్వున కేక వేసి 'పిచ్చాడు పిచ్చాడు' అని అరుస్తూ గదిలోంచి పరిగెట్టుకు వచ్చేసింది. మరుక్షణం అల్లకల్లోలం. ఏం జరిగిందో ఎవరికీ అర్థం కాలేదు.

తనను కావలించుకుని ఏడుస్తున్న కూతురిని ఓదారుస్తూ అసలు సమాచారం సేకరించింది కమల తల్లి. భర్తకు చెప్పింది. ఆయన మండిపడుతూ పరంధామయ్య దగ్గరికి వచ్చాడు.

"ఏమయ్యా పరంధామయ్యా! నీ కొడుకు పిచ్చిని దాచి, పెళ్ళి చేద్దామనుకున్నావా? నీకు బుద్ధిలేదుటయ్యా? నా పిల్లలాంటి ఆడపిల్ల నీకూ వుందిగా. చూస్తూ చూస్తూ దాని గొంతు కొయ్యడానికి నీకు మనసెలా వొప్పింది?" అన్నాడు.

తాడెత్తున లేచాడు పరంధామయ్య. "ఏమిటి నా కొడుక్కి పిచ్చా? లక్షణంగా ఉద్యోగం చేసుకుంటూ నెల తిరిగేసరికి మూడు వేలు కళ్ళజూసే వాడికి పిచ్చా? నీ కూతురు వాడినిఏం చేసిందో ఏమో! అసలు పెళ్ళికి ముందే అంత ధైర్యంగా వాడితో మాట్లాడానికి గదిలో దూరిందంటేనే తెలిసిపోతోంది నీ కూతురు ఎలాటిదో. ఛీ దిక్కుమాలిన సంబంధం మాకొద్దు" అంటూలేచి "పదండి రా" అన్నారు.

కమల తండ్రి రెచ్చిపోయాడు. "అసలు ఇవ్వమని కాళ్లు పట్టుకుని బతిమాలుకుంటే మాత్రం నీ పిచ్చి కొడుక్కి పిల్లనెవరిస్తారు? పోండి బైటకి" అని

అరిచాడు.

అలా మరి కాసేపు ఇద్దరూ హోరా హోరి పోట్లాడుకున్నాక ట్యాక్సీలో తిరుగు ముఖం పట్టారు. పరంధామయ్య అసలే కోపిష్టి. దానికితోడు ఈ రభస. నిప్పు తొక్కిన కోతిలా అరుస్తున్నాడు.

"ఏం పుట్టింది ఈ వెధవకి నోరు మూసుకుని కూర్చోరో? అసలు మాయింటా వంటా లేవు ఈ బుద్ధులు. ఇదిగో వుందిగా వీడి తల్లి... ఆ వంశం వారివే ఈ తల తిక్క వేషాలు వెధవ వంశం నేరకపోయి కట్టుకున్నాను" అంటూ మాణిక్యాంబ తల్లిదండ్రుల్ని, ఆవిడని, ఆవిడ అన్న దమ్ముల్ని ఏకధాటిన తిట్టిపోశాడు. కాసేపు హించింది కామేశ్వరి. ఇక వినలేక ...చుకుపడింది.

"ఊర్కో" అంటూ భార్యను శాంతింప జేశాడు సూర్యం. భర్త మాట కాదనలేక వూరుకుంది కామేశ్వరి. సూర్యం పని అయోమయంగా వుంది. వేరే ఏ దోవా లేక ...నే మెల్లిగా ఆ అమ్మాయితో 'నాకు ...చేసుకునే వుద్దేశం లేదు' అని మర్యా...గా చెప్పరా అని మేనల్లుడికి సలహా ...చ్చింది అతనే. కానీ అది ఇలా పరిణమిస్తుం...నుకోలేదు. ఆనందరావుకి మాత్రం పీడ విరగడైందని సంతోషంగానే వుంది.

కారు ఇల్లు చేరాకా పరంధామయ్య, మాణిక్యాంబ, ఆనందరావు దిగేశారు. కానీ కామేశ్వరి మాత్రం దిగనని మొండి కేసింది. "అయిన భాగవతం చాలు. ఇంటికి పోదాం పదండి" అంది. కాసేపు బతిమాలాడు సూర్యం. కామేశ్వరి వినలేదు. చేసేది లేక "సరే ఒక్క నిమిషం దిగు" అని అవిడ వెనకే తనూ దిగాడు. లోపలికెళ్ళి బావమరిదితో ఓ రెండు నిమిషాలు మాట్లాడి వచ్చి వెనక సీట్లో భార్య పక్కనే కూర్చుని 'పోనీ' అన్నాడు టాక్సీ డ్రైవరుతో.

మాణిక్యాంబ నీరసంగా లోపలికి వెళ్ళింది. కొడుకు మరింత నీరసంగా కూర్చుని తండ్రిచేత చివాట్లుతింటున్నాడు. 'పిచ్చిసన్నాసి దిష్టితగిలింది. వీడి రూపం, చదువు, అంత పెద్ద ఉద్యోగం-చూసీచూడగానే కళ్ళుకుట్టేలాగ ఉంటాడు. సాయంత్రం మంత్రాల బసవయ్యను పిలిపించి దిష్టి తీయించాలి' అనుకుంది.

ఆ సాయంత్రం బసవయ్య కొబ్బరి కాయ దిగదుడిచి పగలగొట్టి వెళ్ళాక తండ్రి పెట్టిన చివాట్లతో తలవాచిపోయి వున్న ఆనందరావు ఆ రాత్రి బస్సులోనే హైదరాబాద్‌కి ప్రయాణం అయ్యాడు.

అవమానం పొందిన కమల తండ్రి వూరికే వుండలేదు. తనకు తెలిసిన వారందరికీ 'ఫలానావారి అబ్బాయికి పిచ్చి' అని ప్రచారం చేశాడు. మంచివార్తల కంటే ఇలాంటి వార్తలే త్వరగా వ్యాపిస్తాయి గనుక ఆ ప్రచార ఫలితంగా ఆనందరావు కోసం కుప్పతెప్పలుగా వచ్చిన సంబంధాల సంఖ్య క్రమంగా క్షీణించిపోయింది. పరంధామయ్య మండిపడ్డాడు.

ఇదంతా మేనమామద్వారా తెలుసుకున్న ఆనందరావు ఆనందించాడు. కానీ అతనికి సంతోషం, సుఖం, శాంతి కరువైపోయాయి. 'ఏదీ సోనీ? ఎంతకీ రాదేం? పోనీ మళ్ళీ ఉత్తరమైనా రాయలేదేం?' అనుకుంటూ బాధపడుతున్నాడు.

* * *

అమలాపురంలో పేపరు చదువుకొంటున్న తిలక్‌గారు హఠాత్తుగా ఏదో గుర్తువచ్చి—

"చిన్నమ్మడూ... చిన్నమ్మడూ!"

అని కేక పెట్టారు.

"వస్తున్నాను నాన్నగారూ" అంటూ వచ్చింది స్వర్ణలత.

నాన్నగారి పడక్కుర్చీ చేతిమీద కూర్చుని "ఏమిటి నాన్నగారూ? ఎందుకు పిలిచారు?" అంది.

"అమ్మడూ చెప్పడం మరిచానమ్మా! నాకు తెలిసినాయన వైజాగ్ వెళుతున్నాడు. నీ నెంబరు ఇస్తే రిజల్ట్స్ కనుక్కొని వస్తానన్నాడు.

కాగితం మీద నీ నెంబరు రాసివ్వు. పట్టుకెళ్ళి ఇస్తాను" అన్నారు.

తల వంచుకుంది స్వర్ణ. "వద్దులెండి నాన్నగారూ, ఎందుకు అనవసరంగా ? ఎలాగూ మరో వారంలో పేపర్లో వస్తాయి కదా!" అంది తేలికగా.

"ఫరవాలేదులే అమ్మడూ ! మనకు తెలిసినవాడే ఆయన. ఎలాగూ యూనివర్సిటీలో పని వుందిట ఆయనకి. వెళ్ళి కనుక్కొవస్తాడు"

"అబ్బ ! వద్దని చెప్పానుగా నాన్నగారూ ! అయినా ఏముంది తెలుసుకునేందుకు ? నాకు తెలిసిందేగా" అంది స్వర్ణ తల వంచుకుని.

"అయితే స్వర్ణా.... ?" అంటూ ప్రశ్నార్థకంగా కూతురి మొహంలోకి చూశారు తిలక్‌గారు.

"అంతే నాన్నగారూ" అంటూనే లేచి వెళ్ళిపోయింది స్వర్ణ.

కూతురు వెళ్ళిన వైపు చూసి దీర్ఘంగా నిట్టూర్చారు తిలక్‌గారు.

ఆయనకి ఇద్దరు కూతుళ్ళు. కొడుకులు లేరని అందరూ అనుకున్నా ఆయన మాత్రం బాధపడలేదు. ఆడపిల్లలు అయితే ఏం 'బంగారు తల్లులు' అనుకున్నాడు. పెద్ద కూతురు హేమలతని సరోజినీనాయుడు అంతటిదాన్నీ, చిన్న కూతురు స్వర్ణని ఇందిరాగాంధీ అంతటిదాన్నీ చెయ్యాలని ఆశపడ్డాడు. ఇద్దరూ తెలివిగలవాళ్ళే. అందులో సాటిలేనివాళ్ళే. తిలక్ అమ్మాయిలంటే అందరికీ ఇష్టమే.

ఏమాటకామాటే చెప్పుకోవాలి. హేమలతకి చదువు మీద బాగానే శ్రద్ధ వుండేది. చక్కగా చదువుకునేది. దైవం చల్లగా చూస్తే సరోజినీనాయుడు అంతటిది కాకపోయినా ఏ డాక్టరో అయివుండేది. కానీ అలా కాలేదు. బి.ఎ. పాసై ఎమ్.ఎ. చదువుతానంది. సరే అని సంతోషంగా ఒప్పుకుని వైజాగ్‌లో హాస్టల్లో వుంచాలా, తన తమ్ముడుగారింట్లో వుంచాలా అని ఆలోచిస్తున్న సమయంలో ఒక రోజు పొద్దున తొమ్మిది గంటలకి ఒక యువకుడు వచ్చాడు. తిలక్‌గారి ఎదురుగా నిలబడ్డాడు.

"నా పేరు మధుసూదనం. తా... మధు అంటారు. ఎమ్.బి.బి.ఎస్. ప...



య్యాను. నాకు రెండు లక్షల విలువ జేసే ఆస్థి వుంది. అమ్మా, నాన్న, అన్న, తమ్ముడు, అక్క, చెల్లెలు అంతా వున్నారు. నేను మీ పెద్దమ్మాయి హేమలతను పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. ఇస్తే మీ అమ్మాయిని ఇవ్వండి, లేకపోతే మీరు లేచి ఆ కుర్చీ ఇలా ఇవ్వండి" అన్నాడు.

అప్పటిదాకా అతన్నే చూస్తూ అతను చెప్పేది వింటున్న తిలక్‌గారు ఆశ్చర్యంగా చూశారు.

"కుర్చీ ఎందుకు నాయనా? కుర్చీకి, నా కూతురికి గల సంబంధం ఏమిటి?" అని అడిగారు.

వెంటనే పాంటు జేబులోంచి బారెడు పొడుగున్న నైలాన్ తాడు తీశాడు మధు.

"మీ అమ్మాయిని ఇచ్చారా సరే. లేకపోతే మీ కళ్ళ ఎదుటే మీ కుర్చీ మీద నిలబడి ఈ తాడుతో ఆ దూలానికి ఉరి వేసుకుంటాను" అన్నాడు మధు.

ఒక్క క్షణం ఆలోచించారు తిలక్. "పెద్దమ్మడూ... పెద్దమ్మడూ" అని పిలిచారు.

"వస్తున్నాను నాన్నగారూ" అంటూ పరుగున వచ్చిన హేమలత తండ్రి ఎదుట నైలాన్‌తాడు చేత్తో పుచ్చుకుని నుంచున్న అపరిచిత యువకుడిని చూసి ఆగిపోయింది.

"రామ్మా" అన్నారు తిలక్. మెల్లిగా వచ్చి తండ్రి పక్కనే నుంచుంది హేమ. తనకు మధుసూదనం చెప్పిన వివరాలన్నీ చెప్పారు తిలక్.

"ఏమ్మా! నువ్వేమంటావు మరి? సరేనంటావా? లేకపోతే అతనికి కుర్చీ ఇచ్చెయ్యనా?" అన్నారు.

ఆశ్చర్యంగా మధు వంక చూసింది హేమలత. సూటిగా తననే చూస్తున్న ఆ అందగాడి కళ్ళలోని ప్రేమను, అర్థింపును గుర్తించింది. సిగ్గుగా తలవంచుకుని–

"కుర్చీ ఇవ్వద్దులెండి నాన్నగారూ" అంది.

సరిగ్గా రెండు నెలల తర్వాత అతను అడిగిన కుర్చీల కన్నా మంచివి ఓ అరడజను కుర్చీలు, మంచాలు, స్టీలుసామాన్లు, బీరువా వగైరా సామాన్లతో బాటు తన కూతురిని కూడా ఇచ్చి పెళ్ళి జరిపించేశారు తిలక్‌గారు. ఇది జరిగి మూడేళ్ళయింది.

ఇపుడా హేమలతకి ఒక కొడుకు. నెల రోజుల వయసువాడు. కూతురు సుఖంగా వున్నా ఆయన మనసులో ఏదో మూల అసంతృప్తి. కూతురు చదువుకుని గొప్పదై వుండవల్సిందని బాధపడుతుంటారు.

పోనీ స్వర్ణలతను బాగా చదివించాలని గట్టిగా నిర్ణయించుకున్నారు. కానీ ఆ అమ్మాయికి నవలలమీద వున్న ఇంట్రెస్టు చదువుమీద లేదు. 'ఇక దానికి చదువు వంట బట్టదు. పెళ్ళిప్రయత్నాలు మొదలు పెట్టండి' అని గత కొన్ని నెలలుగా భార్య పోరుతున్నా వినిపించుకోవడం లేదాయన. కనీసం స్వర్ణని పోస్టుగ్రాడ్యుయేట్‌ని చేయాలని ఆయన ఆశ.

కానీ ఈపూట కూతురి వాలకం చూస్తుంటే ఆయనకు అపనమ్మకంగా అనిపించింది. వెంటనే భార్యని పిల్చారు. పరిస్థితి వివరించి ఆవిడ అభిప్రాయం అడిగారు.

"వెంటనే పెళ్ళి చేయడమే శ్రేయస్కరం" అంది రుక్మిణమ్మ.

"అంతేనంటవా" అన్నారు తిలక్ నీరసంగా.

"ముమ్మాటికీ అంతే. అసలు దానికి చదువు మీద దృష్టిలేదు. ఎంతసేపూ నవలలు చదవడం, సినిమాలు చూడ్డం, మంచం మీద బోర్లా పడుకుని గాడిద లాగ కబుర్లు చెప్పడం. ఏమైనా అంటే నోరు పెట్టుకు పడిపోతుంది. వినయం, విధేయత లేవు" అంది రుక్మిణమ్మ.

"పోనీలే! చిన్నపిల్ల అని గారాబం. అదే అన్నీ నేర్చుకుంటుందిలే. అయితే సంబంధాలు చూడ్డం మొదలెడతాను" అన్నారు.

"సరే అంతకంటేనా! శుభస్య శీఘ్రం" అందావిడ సంతోషంగా.

రెండు నిమిషాల్లోనే ఈవార్త హేమకీ, స్వర్ణకి తెలిసిపోయింది. స్వర్ణకి మహా సంతోషం వేసింది. 'కలనిజమాయెగా, కోరిక తీరెగా' అని పాడుకుంది. అక్క దగ్గరికి వెళ్ళి-

"అక్కా! రేపు పెళ్ళి చూపుల్లో వాళ్ళని ఏం ప్రశ్నలు అడుగుదామంటావ్" అనడిగింది.

"నీ తలకాయ నువ్వు అడిగేదేమిటి? వాళ్లు అడుగుతారు. నువ్వు తల ఎత్తకుండా సమాధానాలు చెప్పాలి అంతే!" అంది హేమ నవ్వుతూ.

"ఎందుకు? తల ఎత్తితే ఏం? వాళ్ళు అడిగినపుడు మనం కూడా అడిగితే తప్పేముంది?" అంది స్వర్ణ.

"తప్పో కాదో నాకు తెలీదు. సామాన్యంగా పెళ్లికొడుకు వాళ్లే అమ్మాయిని ప్రశ్నలు అడుగుతారు. అమ్మాయి అడగదు" అంది హేమ నవ్వుతూనే.

"ఆ సరేలే! ఎవరో అడిగితే మనకేం, అడక్కపోతే మనకేం. నేను మాత్రం అడుగుతాను" అంది స్వర్ణ.

ఆశ్చర్యపోయింది హేమ. "నువ్వా! ఏమడుగుతావ్?"

"వాళ్ళు నన్ను ఏం అడిగితే దాన్ని బట్టి నేనూ అడుగుతాను. వాళ్లు నా పేరు, చదువు అడిగి ఊరుకుంటే నేనూ మర్యాదగా వాళ్ళ పేరూ, చదువూ, ఉద్యోగం అడిగి ఊరుకుంటాను. వాళ్లు 'పాటలు, డాన్స్, కుట్లు, వంట మొదలయినవి వచ్చా' అంటే 'మీ ఇంట్లో టి.వి, ఫ్రిజ్, రేడియోగ్రాం మొదలయినవి వున్నాయా?' అని అడుగుతాను. వాళ్లు 'నీకు నిజం జడా, సవరమా?' అని అడిగితే 'మీవి కట్టుడు పళ్లా?' అని అడుగుతాను" అంది స్వర్ణ నవ్వుతూ.

హేమకు భయం వేసింది. "స్వర్ణా ఏమిటే నీ రాలుగాయితనం? అలా ఏ పెళ్ళికూతురయినా అడగచ్చా! తప్పు కదూ. అలా అడిగితే పెళ్లిళ్లు కుదురుతాయా?" అంది మందలిస్తూ.

"పోదూ! అలా అడిగేవాళ్ళకి అలాగే సమాధానం చెప్పాలి" అంది స్వర్ణ.

చెల్లెల్ని తేరిపారచూసి అప్పటికి వూరుకుంది హేమ. తరవాత సమయం చూసుకుని తల్లి చెవిన వేసింది. అదిరిపోయింది రుక్మిణమ్మ. వెంటనే స్వర్ణ దగ్గరికి వెళ్లింది.

"ఏమే ! నిజమేనా ఇది ?" అంది కోపంగా.

"నిజమే!" అంది స్వర్ణ తాపీగా.

రుక్మిణమ్మకి కోపం, దుఃఖం ముంచుకు వచ్చాయి.

"ఒసే స్వర్ణా! నీకు పుణ్యంవుంటుంది. చిన్నదానివయినా దణ్ణంపెడతాను. కాస్త బుద్ధిగా వుండు. పెళ్లిచేసుకో" అంది దీనంగా.

"అదేమిటమ్మా" అంది తెల్లబోయి.

"అవునే తల్లీ! కూతురు పొగరుగా

వుంటే సరిగా పెంచలేదని తల్లిని తిడతారు. నువ్వు ఆ పెళ్లి వారి ఎదుట ఏమైనా పిచ్చిప్రశ్నలు వేశావంటే నా మీద ఒట్టే" అంది.

కరిగిపోయింది స్వర్ణ. "సరేలే అమ్మా! నువ్వు బాధపడకు. నీకెందుకు చెప్పు. నీకు తలవంపులు తెచ్చేపని నేను ఎపుడూ చేయను. అసలు ముందు వాళ్ళను రానీ" అంది నవ్వుతూ.

ఆ రోజు రానే వచ్చేసింది. స్వర్ణ రిజల్ట్స్ వచ్చేశాయి. అనుకున్నట్లే అన్నింటిలోనూ తన్నేసింది. ఆ తరువాత పదిరోజులకే స్వర్ణకు పెళ్లిచూపులు. అతను ఇంటికి పెద్దకొడుకు. బి.ఇ. చదివి ఉద్యోగం కోసం వెతుకుతున్నాడు. అతని తల్లిదండ్రులు కోడలికోసం వెతుకుతున్నారు. ఉద్యోగం కంటే కోడలి వెతుకులాటే ముందు ఫలించి స్వర్ణని పెళ్లిచూపులు చూడ్డానికి వచ్చారు.

చక్కగా తలంటు పోసుకుని, నిండు నీలం అమెరికన్ జార్జెట్ చీర కట్టుకుని, సింపుల్‌గా మెడలో ముత్యాల గొలుసు వేసుకుని తయారయింది స్వర్ణ. రుక్మిణమ్మ ఒకటికి పదిసార్లు చెప్పింది. ఎలా తల వంచుకుని కూర్చోవాలో, ఎలా వినయంగా సమాధానాలు చెప్పాలో బోధపరచింది.

"అలాగేలే అమ్మా" అంది స్వర్ణ బుద్ధిగా.

సరే! పెళ్ళివారు వచ్చారు. కూర్చున్నారు. కుశల ప్రశ్నలు, కాఫీ ఫలహారాలు అయ్యాయి. స్వర్ణ ప్రవేశించింది. హేమ చెయ్యి పట్టుకుని తీసుకొచ్చి హాల్లో తివాచీమీద కూర్చోబెట్టింది.

"నీ పేరేమిటమ్మా?"

"స్వర్ణలత" పెళ్ళికొడుకు తల్లి ప్రశ్నకు వినయంగా సమాధానం చెప్పింది.

"పాటలు, సంగీతం, డాన్సులాంటి వేమైనా వచ్చా?" మరో ప్రశ్న.

హేమ గుండెలు దడదడలాడాయి. కానీ మళ్ళీ వినయంగానే సమాధానం వచ్చింది "రావండీ" అంటూ. తృప్తిగా వూపిరి పీల్చుకుంది రుక్మిణమ్మ.

"మరి కుట్లు వచ్చా?"

"వచ్చండీ! నా చీరలన్నింటికీ నేనే ఫాల్స్ కుట్టుకుంటాను"

"అవికాదు. ఎంబ్రాయిడరీలు" అంది కరుకుగా కాబోయే ఆడపడుచు.

"రావండీ" అంది స్వర్ణ కఠినంగా.

తిలక్‌గారు దీర్ఘంగా నిట్టూర్చారు. కలెక్టర్ అయి అందర్నీ గడగడలాడించవల్సిన చిన్నమ్మడు ఇలా తలవంచుకుని సమాధానాలు చెప్పవల్సిన అవసరం వచ్చిందే అని బాధపడ్డారు.

ఆ పెళ్ళివారు ఒకరి మొహాలొకరు చూసుకుని సూటిగా అసలు విషయంలోకి దిగిపోయారు.

"చూడండి తిలక్‌గారూ! మీ అమ్మాయి మాకు నచ్చింది. ఇక ఇచ్చిపుచ్చుకోవడాలు మాట్లాడుకుంటే, నిశ్చయం చేసుకుని ముహూర్తాలు పెట్టుకుందాం" అన్నారు.

తలెత్తి పెళ్ళికొడుకు సుబ్బారావుని చూసింది స్వర్ణ. పిచ్చివెధవలా ఉన్నాడు. అసలు స్వర్ణకి ఏమీ నచ్చలేదు. 'నూటికి పాతిక మార్కులకన్నా రావు ఇతనికి. స్థిరం చేసుకోవడం ఏమిటి నీ తలకాయ్' అనుకుంది.

తిలక్‌గారు మెల్లిగా నోరు విప్పారు. "చూడండి! మా పెద్దమ్మాయికి నేను కట్నం ఇవ్వలేదు. సామాన్లు అన్నీ ఇచ్చాను. లాంఛనాలు అన్నీ జరిపాను.

పెళ్ళి బ్రహ్మాండంగా చేశాను. నాకున్నది వీళ్ళిద్దరే. నాకున్నదంతా వీళ్ళిద్దరిదే" అన్నారు.

"దానిదేముంది లెండి. సామాన్లూ, లాంఛనాలూ ఇచ్చి పెళ్ళి చేయడమూ గొప్పేనా? అది అందరూ చేస్తారు. ఇక ఉన్నది అంతా వీళ్ళదే అంటే ముందు ఏం జరుగుతుందో ఎవరు చూడవచ్చారు? సందోరాజా భవిష్యతి" అంది పెళ్ళి కొడుకు తల్లి.

వెంటనే రుక్మిణమ్మ అందుకుంది. "మేం ఈ అమ్మాయికి కట్నం ఇవ్వం అని చెప్పడం లేదు. మీరు అడగండి" అంది.

ఇదంతా చూస్తుంటే స్వర్ణకి ఒళ్ళు మండిపోతోంది. 'వాళ్ళకి తను నచ్చగానే సరిపోయిందా ? ఆ మొద్దు స్వరూపం తనకు నచ్చలేదు' అనుకుంది కసిగా.

ఆడపడుచు కంఠం విప్పింది "దానిదేముంది. మేము నోరుతెరిచి అడగాలా? ఆ రాజమండ్రి సంబంధం వాళ్ళు మా తమ్ముడికి పాతికవేలు ఇస్తామని వచ్చారు. పిల్ల నచ్చలేదు. బరంపురం వాళ్ళయితే యాభైవేలు ఇస్తామని కాళ్ళు పట్టుకుని బతిమాలారు. ఆ అమ్మాయికి చదువు లేదని కాదన్నాము..."

స్వర్ణకి రక్తం మరిగిపోతోంది. తలెత్తి సుబ్బారావుని చూసింది. వక్కపొడి నవుల్తున్నాడు. ఆ క్షణాన అతన్ని చూస్తుంటే సంతలో తనను బేరమాడుతుంటే నిశ్చింతగా గడ్డి నెమరు వేసే ఎద్దులాగ వున్నాడు. 'నీకూ, ఆ ఎద్దుకీ తేడా ఏమిటి' అనుకుంది మండి పడుతూ.

ఆ ఆడపడుచు లిస్టు సాగిపోతూనే వుంది. "ఇక ఆ ఏలూరువాళ్లు యాభైవేలు ఇస్తామన్నారు. ఆ అమ్మాయికి పాటలు, పద్యాలు, వంట, కుట్లు అన్నీ వచ్చు. కానీ జాతకాలు కుదరలేదు. అందుకే..."

స్వర్ణ విసురుగా లేచి నిలబడడంతో ఆవిడ వాగ్ధాటికి అంతరాయం కలిగింది.

"ఏమండీ! మీరు చెప్పే ఈ వేలు అన్నీ ఈ దున్నపోతుకే ఇస్తామన్నారా? చీకేసిన తాటి టెంకలాగ ఆ మొహం చూడండి. వెధవ మొహం. ఆ యాభై వేలూ ఎదురిచ్చి నా కాళ్లు పట్టుకున్నా నేను చేసుకోను. నాకు పాటలు, కుట్లూ రావు సరే. మీకు వచ్చా? మీరు మాట్లాడుతుంటేనే గాడిద అరిచినట్లుంది. ఇక మీకు కుట్లు రావని తెలుస్తూనేవుంది. మీ జాకెట్టు మెడ దగ్గర హెమ్మింగ్ కుట్లుపోయాయి. ఇక చాలుగానీ లేచి బయటకి పొండి. తేరగా చాలా ఫలహారాలు మెక్కారు" అంటూ విసురుగా లోపలికివెళ్ళిపోయింది.

అందరూ నోళ్ళు తెరుచుకుని వుండడంవల్ల హాలంతా నిశ్శబ్దం. ముందు తేరుకున్నది మధుసూదనం. వెంటనే లోపలికి వెళ్ళి "స్వర్ణా! కంగ్రాట్స్" అనేసి మళ్ళీ హాల్లోకి వచ్చేశాడు.

తరువాత తేరుకున్నది ఆ ఆడపడుచు. భోరున ఏడుస్తూ స్వర్ణనీ, స్వర్ణ తల్లి దండ్రుల్నీ అందర్నీ తిట్టిపోసింది. ఆ ఏడుపుతో అందరూ ఇహలోకంలోకి వచ్చారు. ఇక కాసేపు గందరగోళం. తిట్టుకోడాలు, సాధించుకోడాలు, ఏడుపులు, శాపనార్థాలు. ఆ తర్వాత మగ పెళ్ళివారు రుసరుసలాడుతూ వెళ్ళిపోయారు. రుక్మిణమ్మ, హేమలత స్వర్ణ ప్రవర్తనని తీవ్రంగా గర్హించారు. మధు మాత్రం వాళ్ళ ఆరోపణ అన్యాయం అని తేల్చేశాడు. తిలక్‌గారు తటస్థంగా వుండిపోయారు.

ఆ పెళ్ళికొడుకు సుబ్బారావు తల్లీ

దండ్రి, అక్కగారూ తమను అడిగిన వాళ్ళకి, అడగని వాళ్ళకీ 'ఫలాని తిలక్ గారి చిన్నమ్మాయి మహా పొగరుబోతు, మొండిఘటం, మగరాయుడు, సంసారం చేసే లక్షణాలు ఎంతమాత్రం లేవు' అని ప్రచారం చేశారు.

ఫలితంగా స్వర్ణ కోసం ఉవ్విళ్ళూరుతున్న యువకులు, తిలక్ గారి ఆస్తికోసం నోరు చప్పరిస్తున్న యువకుల తండ్రులు వెనక్కి తగ్గారు. రుక్మిణమ్మ దిగులు పడింది. తిలక్ గారు పోనీ మళ్ళీ చదువులో దింపి చూద్దామా అని ఆలోచనలో పడ్డారు.

స్వర్ణలత మాత్రం నిశ్చింతగా ఓ రోజు బఠాణీలు, ఓ రోజు కారం శనగలు, ఓ రోజు వేరుశనగ పప్పులూ నములూ నవలలు చదువుకుంటోంది.

* * *

ఆనందరావుకి వచ్చే సంబంధాల క్వాలిటీ 'ఎ వన్' గ్రేడ్ నుండి 'సి త్రీ' గ్రేడుకి పడిపోయింది. పరంధామయ్యగారు సంబంధాలు తెస్తున్న పేరిశాస్త్రిని 'చేతగానివాడివి, ఎందుకూ పనికిరానివాడివి. రాజకుమారుడిలాటి మావాడికి తగిన సంబంధం తీసుకు రావడం నీ తరం కావడం లేదు' అని నిందించారు.

పేరి శాస్త్రికి కోపం వచ్చి మరింత పౌరుషంగా ఆంధ్ర దేశం అంతా గాలింపు మొదలుపెట్టాడు. సరిగ్గా ఆ సమయంలోనే అతని వేలు విడిచిన తమ్ముడు రామశాస్త్రి ఎదురయ్యాడు. ఆ రామశాస్త్రిదీ ఇదే డిపార్టుమెంటు. కష్టసుఖాలు మాట్లాడుకుంటూ తనకు జరిగిన అవమానాన్ని వివరించాడు పేరిశాస్త్రి.

తన కష్టం సుఖం వెళ్ళబోసుకుంటూ "నాకూ వుంది అన్నయ్యా అలాంటి లిటిగేషన్ వ్యవహారం. అమ్మాయికి అన్నీ వున్నాయి గానీ పొగరుబోతు" అంటూ తన క్లయింట్ తిలక్‌గారి అమ్మాయి సంగతి చెప్పుకొచ్చాడు రామశాస్త్రి.

అంతా విన్న పేరిశాస్త్రికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది. పిచ్చివాడిగా పేరుపడిన ఆనందరావుకీ, పొగరుబోతు బిరుదాంకితురాలు స్వర్ణలతకూ పెళ్ళి చేస్తే ఇద్దరి సమస్యలూ తీరిపోతాయి. ఒక దెబ్బకు రెండు పిట్టలు. వెంటనే ఇద్దరూ కలిసి పథకం వేశారు.

పేరిశాస్త్రి పరంధామయ్య దగ్గరకు వెళ్ళాడు. తను తెచ్చిన సంబంధం వివరాలు చెప్పాడు.

"చూసుకోండి పరంధామయ్యగారూ! అమ్మాయి బంగారుబొమ్మ. బోలెడు ఆస్తి. మరి మీ అబ్బాయి ఆనందరావు ఏమీ ఇబ్బంది పెట్టకపోతే ఈ సంబంధం స్థిరం అయిపోయినట్లే" అన్నాడు.

ఒక్కక్షణం ఆలోచించాడు పరంధామయ్య. "చూడు పేరిశాస్త్రీ! అసలు వాడు నోరెత్తకుండా చూసుకునే బాధ్యత నాది. నువ్వు వాళ్ళతో మాట్లాడు. పెళ్ళి చూపులు ఏర్పాటు చెయ్యి" అన్నాడు.

అన్నట్లుగా వెంటనే ఆనందరావుని రమ్మని ఆజ్ఞాపిస్తూ ఉత్తరం రాశారు. సమాధానం వెంటనే వచ్చింది.

"పూజ్యులైన నాన్నగారికి నమస్కారాలు. నాకు పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదు. నాకాబోయే భార్యను నేను నిశ్చయం చేసుకున్నాను. మన్నించగలరు" అని మూడు వాక్యాలు రాశాడు.

మండిపడ్డాడు పరంధామయ్య. శివతాండవం చేశాడు. ఉన్నపాటున సూర్యానికి కబురు వెళ్ళింది. సూర్యం వచ్చాడు. పరంధామయ్య చేత ముక్క-

చివాట్లు తిన్నాడు. ఆఖరున-

"నువ్వు వెంటనే వెళ్లి వాడిని ఈడ్చుకురా" అని శాసించాడాయన.

సూర్యం ఇరుకున పడ్డాడు. "నా వల్లకాదు బావగారూ! అయినా వాడేమైనా పాలుతాగే పసివాడా! కొట్టి,తిట్టి లాక్కురావడానికి. అన్నింటికీ నేనెక్కడతంటాలు పడేది చెప్పండి. బాబిగాడికి ఉత్తరం రాయండి. వాడు వచ్చాక వాడిష్టం, వాడి తమ్ముడి ఇష్టం. నేను పోతున్నా" అని చెప్పేసి చక్కాపోయాడు.

మరింత మండిపడ్డాడు పరంధామయ్య. బాబిగాడు ఉత్తరాలకు కదలడు అనుకుని నాలుగు తిట్టుకుని ఒరిస్సాలో ఇంజనీరుగా పన్జేస్తున్న పెద్దకొడుకు ఓ.బి. రావుకి పెద్ద టెలిగ్రామ్ ఇచ్చాడు.

టెలిగ్రామ్ మెసెంజరు ఓ.బి.రావు ఇంటి తలుపు తట్టగానే అన్నపూర్ణ తలుపు తీసింది.వెంటనే సంతకం పెట్టి టెలిగ్రామ్ అందుకుంది. చదివి వాచీ చూసుకుంది. సాయంత్రం అయిదుగంటలు. వెంటనే గేటుదాటి వెళ్ళబోతున్న టెలిగ్రామ్ మెసెంజర్‌ని వెనక్కి పిల్చి-

"అయ్యగారు క్లబ్‌లో వుంటారు. ఇచ్చి వెళ్తావా?" అనడిగింది రెండు రూపాయలు చేతిలో పెట్టి. సరేనని తలవూపి ఆ టెలిగ్రామ్ పట్టుకుని వెళ్ళిపోయాడతను. తలుపు వేసేసి లోపలికి వచ్చి కూని రాగాలు తీస్తూ పనిలో మునిగిపోయింది అన్నపూర్ణ.

క్లబ్ ముందర లాన్లో కూర్చుని వున్నాడు ఓ.బి.రావు తనస్నేహితులతో. అంతా నిశ్శబ్దంగా ఉన్న ఆ వాతావరణానికి టెలిగ్రాం మెసెంజరు రాకతో అంతరాయం కలిగింది. చెయ్యిజాచి టెలిగ్రామ్ అందుకున్నాడు ఓ.బి. రావు అనబడేఓరుగంటి భాస్కరరావు అనబడే బాబిగాడు.

అది చదువుకుని అతను నోరు విప్పే లోపలే ఎదురుగా కూర్చున్న 'మార్గదర్శి' నోరు విప్పాడు.

"బాబీ! ఎవరైనా టపాకట్టారా?" అనడిగాడు.

"లేదు" అన్నాడు భాస్కరరావు.

"పోనీ, టపా కట్టేలా వున్నారా?"

వెంటనే తల అడ్డంగా తిప్పాడు భాస్కరరావు.

"అయితే దాన్ని జేబులో పెట్టేసుకుని ముక్క వేసెయ్" అని ఆదేశించాడు మార్గదర్శి.

తలాడించి టెలిగ్రామ్ షర్టు జేబులోకి తోసేసి చేతిలోని ముక్కల మీద దృష్టి నిలిపాడు భాస్కరరావు.

అప్పటిదాకా ఆ టెలిగ్రామ్ వల్ల 'టచ్' కార్డు కోసం కూర్చుని తన ఆటకు నష్టం కలుగుతుందేమోనని బితుకు బితుకున చూస్తున్న కళ్ళజోడు తృప్తిగా ఊపిరి పీల్చుకున్నాడు. కానీ అతని ఆనందం ఎక్కువసేపు నిలవలేదు. అతని ఎదురుగా కూర్చున్న 'హార్మణీపెట్టె' ఆట ముగించేసరికి చికాకు ముంచుకు వచ్చింది.

"అసలు నాకు తెలియకడుగుతాను. టెలిగ్రామ్‌వచ్చినా ఆపకుండా ఆడేయడం ఏమిటి బాబీ" అన్నాడు ఉక్రోషంగా.

భాస్కరరావు ఏమీ మాట్లాడలేదు. మార్గదర్శి కళ్ళజోడు వంక చూసి చిన్నగా నవ్వేడు. ఆ నవ్వులో 'ఏడవకు. ముక్క కలుపు' అన్న భావం కనిపించింది కళ్ళజోడుకి. వెంటనే ముక్కలు కలిపి పంచాడు.

అలా మరో యాభై రెండు సార్లు పంచాక అందరూ లేచి బైటకి నడిచారు.

వాకిట్లో నిలబడ్డ వాచ్‌మన్ వాళ్ళ నలుగురికీ వినయంగా సలాం పెట్టాడు. వాళ్ళంటే అతనికి చాలా గౌరవం. వాళ్ళ హయాంలో అతని పని చాలా వరకూ తగ్గింది. అయిదు గంటలకు వచ్చి తలుపులు తెరిచి చిమ్మేసి, కూజాలో మంచినీళ్లు పెట్టేసి వెళ్లిపోయి మళ్ళా రాత్రి తొమ్మిదిన్నరకి హాయిగా ఇంట్లో భోజనం చేసి వస్తాడు. ఈమధ్య టైంలో ఆ క్లబ్బుకి ఆ నలుగురు స్నేహితులే కాపలా. అంతేకాక నెల తిరిగేసరికి నలుగురు తలో ఐదు రూపాయలు ఇస్తారు. అందుకే వాళ్లు అతని పాలిట దేవతామూర్తులు.

భాస్కర్రావు ఇంటిముందు స్కూటర్ దిగి, లోపలికి తీసుకొచ్చి లాక్ చేసేలోగా తలుపుతీసి అన్నపూర్ణ చిన్నగా నవ్వింది. తనూ సమాధానంగా నవ్వేసి "ఏం చేస్తున్నావు?" అని పలకరించి తిన్నగా బెడ్‌రూంలోకి వెళ్ళాడు. ముఖం, కాళ్లూ, చేతులూ కడుక్కొని బట్టలు మార్చుకుని వచ్చి డైనింగ్ టేబుల్ ముందు కుర్చీ లాక్కొని కూర్చున్నాడు.

నేతిగిన్నె తీసుకొచ్చి టేబుల్ మీద పెట్టి, తనూ పక్కనే కూర్చుని తింటూ వడ్డించింది అన్నపూర్ణ.

"నేను మధ్యాహ్నం కేశవరావు గారింటి కెళ్ళాను. వాళ్ళు 'శంకరాభరణం' సినిమా చూశారుట" అంది.

"అలాగా! ఎలా వుందిట?" అన్నాడు భాస్కర్రావు.

"చాలాచాలా బావుందిట. పూర్ణోదయా ఆర్టు క్రియేషన్ వాళ్ళ పిక్చర్. తారాగణం చంద్రమోహన్, సోమయాజులు, అల్లురామలింగయ్య, మంజుభార్గవి, రాజ్యలక్ష్మి, బేబీతులసి. టైటిల్స్ అవగానే నదిమీద లాంచీ వస్తూ వుంటుంది..." అంటూ సినిమా కథ చెప్పడం మొదలు పెట్టింది అన్నపూర్ణ.

అన్నం తింటూ వింటున్నాడు భాస్కర్రావు. తనూ తింటూనే కథ చెప్తోంది అన్నపూర్ణ. ఇద్దరి భోజనం ముగిసింది. ఫ్రిజ్‌లోంచి తమలపాకులు తీసి సున్నం రాసి చిలకలు అందించింది.



అందుకుంటూ "పూర్ణా! ఓ చి మాట చెప్పాలి. ఇంటర్‌వల్‌లో గుర్తు ...్యు. నీతో కాస్త మాట్లాడాలి" అన్నాడు.

కథ చెప్తూనే తలాడించింది అ... పూర్ణ. తాంబూలం వేసుకుని, మం... మీద పడుకుని పత్రిక తిరిగేస్తూ, ఆవలిస్తూ భార్య చెప్పే సినిమా కథ వింటున్నాడు భాస్కర్రావు.

"ఇపుడు ఇంటర్వెల్" అంది



అన్నపూర్ణ.

వెంటనే పుస్తకం మూసేసి భార్య వైపు తిరిగి "చూడు పూర్ణా! నాన్నగారి టెలిగ్రామ్ చదివావుగా. రేపు తెల్లవారు జామున మద్రాసు మెయిల్లో వెళుతున్నాం మనం" అన్నాడు.

"అయిపోయిందా మీరు చెప్పేది ?" అనడిగింది.

"అయిపోయింది" అన్నాడు భాస్కర్రావు.

మళ్ళీ కథలోకి వెళ్ళిపోయింది అన్నపూర్ణ. భార్య దగ్గరగా జరిగి సన్నజాజులు వాసన చూస్తూ, ముంచుకు వస్తున్న నిద్రను బలవంతాన ఆపుకుటూ, అన్యమనస్కంగా కథ వింటూ ముగింపు కోసం వేయికళ్ళతో ఎదురు చూస్తున్నాడు భాస్కర్రావు. ఎలాయితేనేం కథ ముగిసింది.

"ఎలా వుంది?" అంది అన్నపూర్ణ.

నిద్రమత్తులో వున్న భాస్కర్రావు ఉలిక్కిపడి లేచాడు.

"బాగుంది. చాలా బాగుంది" అన్నాడు.

"ఏమిటి బావుంది ? అంది పూర్ణ అనుమానంగా.

"అదే పూర్ణా, శంకరశాస్త్రి నిద్రపోవడం" అన్నాడు నిద్రమత్తులో.

"అదిగో మీరెప్పుడూ అంతే, సరిగ్గా వినరు. శంకరశాస్త్రి చచ్చిపోయాడు" అంది దీనంగా.

పూర్తిగా మెలకువ వచ్చిన భాస్కర్రావు "అది కాదు పూర్ణా! పడి పోయాడన్నావు కదా అంటే శాశ్వతనిద్రలో పడిపోయాడనుకున్నాను" అంటూ సర్ది చెప్పుకున్నాడు.

నిశ్వసించింది పూర్ణ. అమ్మయ్య అనుకున్నాడు భాస్కర్రావు లైటు ఆర్పేస్తూ. గడియారం పన్నెండు కొట్టింది.

భాస్కర్రావు బి.యస్.సి., బి.ఇ. చక్కటి రూపం. చూడగానే ఎలాటి వాళ్ళకైనా మరోసారి చూద్దాం అని పించక మానదు. అతను ఠీవిగా నుంచుంటే ఆడపిల్లల గుండెలు దడదడలాడతాయి. ఓరగా చూసి, చిలిపిగా నవ్వాడంటే జనం తమను తామే మర్చి పోతారు. కానీ ఆ ప్రమాదం రాకుండా భాస్కర్రావు భార్య దగ్గర మాత్రమే చిలిపిగా నవ్వుతూ, మిగతా అందరి దగ్గరా గంభీరంగా నవ్వుతాడు. ఎటువంటివారినైనా ఆమడ దూరం నిలబెడుతుందా నవ్వు.

అతి మంచివాడు, కడు సమర్థుడు. కాకపోతే పేకాట ఆడతాడు. అది అతని దృష్టిలో వ్యసనం కాదు. పూర్వజన్మ సుకృతం వల్ల అలవడే ఒక ఉపాసన లాంటిది. ఇంజనీరింగ్ కాలేజీ హాస్టల్లో ఏ పుణ్యాత్ముడు తనకు ఉపదేశం చేశాడో గుర్తులేదు గానీ ఆనాటి నుండి ఈనాటి వరకూ నిర్విరామంగా, నిరాటంకంగా సాగిపోతూనేఉంది ఆ యజ్ఞం.

ఉద్యోగరీత్యా ఓ ప్రాజెక్టులో ఇంజనీరుగా ఒరిస్సా రాగానే పరిచయం అయ్యాడు మార్గదర్శి. అతని అసలు పేరు మాధవరావు. ఈ మార్గదర్శి అన్నది ఒక గౌరవపూర్వకమైన బిరుదు. అతను బ్రహ్మచారి. ఎవరికి ఏ కష్టం వచ్చినా వాళ్ళ కష్టం అర్థం చేసుకుని ఆ కష్టం తీరిపోయే మార్గం సూచిస్తాడు. అందుకే అతను మార్గదర్శి. భాస్కర్రావుకి మార్గదర్శి అంటే అమితమైన ఇష్టం.

హార్మణీపెట్టె అసలు పేరు దత్తాత్రేయ శర్మ. చదువుకునే రోజుల్లో

హార్మణీ వాయించేవాడు సరదాగా. ఈ ఇంజనీరు ఉద్యోగం వచ్చి మార్గదర్శితో పరిచయం అయ్యాక తన కష్టాలు వెళ్ళబోసుకున్నాడు.

"అదేమిటోనండీ! నేనెంత బాగా వాయించినా ఎవరూ వినరు. నా కళ ఎవరూ గుర్తించడం లేదన్న దిగులు నన్ను క్రుంగదీస్తోంది" అని వాపోయాడు.

మార్గదర్శి ఓ రోజు మధ్యాహ్నం అతని హార్మణీ కచేరీ ఏర్పాటుచేశాడు. వచ్చిన వాళ్ళందరి ఎదటా పెద్ద పళ్ళాలలో మైసూరుపాకు ముక్కలు, ఉల్లిపాయ గారెలు కనిపించేలా పెట్టి కచేరీ అయ్యాక అవి అందరికీ పంచి పెడతానని చెప్పటంవల్ల అందరూ కదలకుండా కూర్చొని కచేరీ విన్నారు.

కచేరీ ముగిశాక అందరూ చప్పట్లు కొట్టారు. కాసేపు విద్వాంసుడిని పొగిడి అతనికి హార్మణీ పెట్టె అని బిరుదిచ్చాడు మార్గదర్శి. హార్మణీపెట్టె మహా అమాయకుడు. అతని భార్య మహా గయ్యాళి. పేకాట మానేయమని హోరాహోరీ పోరాడుతూ వుంటుంది. మార్గదర్శి ఆదుకోబట్టి సరిపోయింది గానీ లేకపోతే హార్మనీపెట్టె ఎప్పుడో భార్యచేతుల్లో హరీమనేవాడే.

కళ్ళజోడుగారి అసలు పేరు ఏమిటో ఎవరికీ తెలియదు. దేశంలో నూటికి యాభయిమంది కళ్ళజోడు పెట్టుకునే వాళ్ళే అయినపుడు ఆ 'కళ్ళజోడు' అన్న పేరు ఎపుడు, ఎలా వచ్చిందో అతనికే తెలీదు. కానీ జనం మాత్రం 'కళ్ళజోడుగారికి జ్వరం, కళ్ళజోడు భార్య కడుపుతో ఉంది. కళ్ళజోడింట్లో పేరంటం, కళ్ళజోడుగారి తల్లిపోయింది' అనే వ్యవహరిస్తుంటారు.

భాస్కర్రావు, మార్గదర్శి, హార్మణీపెట్టె, కళ్ళజోడు నలుగురూ ప్రాణస్నేహితులు.

భాస్కర్రావుకి ఉద్యోగం దొరకగానే పెళ్ళి ప్రయత్నాలు మొదలుపెట్టారు పరంధామయ్య. గడ్డిలాంటి తిండితో మొహం మొత్తిపోయిన భాస్కర్రావు వెంటనే పచ్చజెండా వూపేశాడు. తండ్రి దగ్గర్నించి ఉత్తరం రాగానే పెళ్ళిచూపులకి వెళ్దామని సిద్ధంగా వున్న సమయంలో పరంధామయ్య దగ్గర్నుంచి ఏకంగా పెళ్లి నిశ్చయం చేసేసినట్లు ఉత్తరం వచ్చింది.

"పెళ్ళికూతురు చాలా బావుంది. పెళ్లి చూపులు ఏర్పాటుచేద్దామని అనుకుంటూ వుండగా ఆ అమ్మాయి తల్లికి హఠాత్తుగా గుండెజబ్బు వచ్చింది. మరోసారివస్తే ప్రమాదం అని చెప్పాడు డాక్టరు. కూతురిపెళ్లి చూసిచచ్చిపోతానని ఆవిడ ఏడుస్తూ కూర్చుంది. పెళ్లి కూతురి తండ్రి పరుగున వచ్చి నా చేతులు పట్టుకుని 'ఇవి చేతులుకావు కాళ్ళు. దయచూపండి' అని బతిమాలాడు. నాకు జాలనిపించింది.పదిహేను తర్వాత ముహూర్తం నిశ్చయించాను. పెళ్లి పనులు మొదలయ్యాయి. శుభలేఖలు రాగానే పంపుతాను. నువ్వు ప్రయాణానికి సిద్ధంగా వుండు" అని దాని సారాంశం.

ముందు గతుక్కుమన్నాడు భాస్కర్రావు. కానీ ఫరవాలేదులే, సూర్యం, కామేశ్వరి తనకు అన్యాయం జరగనివ్వరు అని తృప్తిపడ్డాడు.

వెంటనే పెళ్లిబట్టలు కొనేసుకున్నాడు ఎందుకయినా మంచిదని తనూ పెళ్లి శుభలేఖలు ఆర్డరిచ్చి సిద్ధం అయ్యాడు

భాస్కర్రావు.

మార్గదర్శి వూళ్ళో లేడు. వాళ్ల సొంత వూరు పలాసా వెళ్ళాడు. తాము ముగ్గురూ ఫలాని రోజు ఫలాని బండికి వస్తున్నట్లు, రైల్లో కలవమని కోరుతూ మార్గదర్శికి ఎక్స్ప్రెస్ టెలిగ్రామ్ ఇచ్చేశాడు భాస్కర్రావు.

అతను ప్రింటు చేయించిన శుభలేఖలే ముందువచ్చాయి. అందరికీ పంచిపెట్టాడు.

మధ్యాహ్నానికల్లా తండ్రి పంపిన శుభలేఖలు వచ్చాయి. వృధా పోనీయడం ఎందుకని అవికూడా పంచిపెట్టి అనుకున్న ప్రకారం అనుకున్న రైలుకే కళ్ళజోడు, హార్మణీపెట్టెలతో సహా బయలుదేరాడు భాస్కర్రావు.

పలాసా స్టేషనులో బండెక్కాడు మార్గదర్శి. చేతిలో ఏమీ లగేజి లేదు. "ఏమిటి మార్గదర్శీ! సామాన్లు తెచ్చుకో లేదేం?" అన్నాడు భాస్కర్రావు ఆశ్చర్యంగా.

చిన్నగా నవ్వాడు మార్గదర్శి. ఆ నవ్వులో 'చెప్తానులే వెర్రివాడా! నాకూ ముక్కలు పంచు' అన్న అర్థం కనిపించింది. మాట్లాడకుండా ముక్కలు పంచాడు భాస్కర్రావు.

అలా మరో ముప్పైసార్లు ముక్కలు పంచాక మళ్ళీ అడిగాడు హార్మణీపెట్టె "ఏం మార్గదర్శీ! సామాన్లు తెచ్చుకో లేదేం?" అంటూ.

"నేను పెళ్లికి రాను" అన్నాడు మార్గదర్శి.

"నువ్వు రావా?" అన్నాడు భాస్కర్రావు దీనంగా.

"నువ్వు రాకపోతే సరదా ఏం వుంటుంది?" అన్నాడు కళ్ళజోడు.

"నేను రాను, మీరు వెళ్ళద్దు. పెళ్ళికి బాబి ఒక్కడే వెళ్తాడు" అన్నాడు మార్గదర్శి.

"ఏం?" అన్నారు ముగ్గురూ ఒకేసారి.

"అది అంతే" అంటూ అసలు నిజం బయటపెట్టాడు. బాబి పెళ్ళికి తాము ముగ్గురూ వెళ్తే తమ సందడిలో పడి బాబి పెళ్ళిపీటల మీద కూర్చోకుండా తమ ఎదుటే కూర్చునే ప్రమాదం వుంది. ఒకవేళ బలవంతాన కూర్చోబెట్టినా ఆ పుసెచేత్తో పట్టుకొని 'కళ్ళజోడూ! సేవయ్యావా!' అంటూ పరుగున వచ్చే ప్రమాదం కూడావుంది. తాము ముగ్గురూ ఆడకుండా వుండలేరు. తమని చూస్తూ బాబి వూరికే వుండలేడు. కాబట్టి తాము వెళ్ళడంవల్ల లాభంకన్నా, నష్టాలే ఎక్కువ. అందులో మరొకడు మరొకడు కాదు. ఏకంగా పెళ్ళికొడుకు. అందుకని ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని బాబి పెళ్ళికి తాము వెళ్ళకుండా మానెయ్యడం అన్ని విధాలా శ్రేయస్కరం అని తేల్చాడు.

నిజమే అంటూ ముగ్గురూ అంగీకరించారు. ఎలాగూ విజయవాడదాకా టిక్కెట్లు కొనుక్కున్నారు. కాబట్టి ఏలూరు దాకా వెళ్ళి ఏలూర్లో దిగిపోయారు ముగ్గురూ. 'నేనూ వచ్చేస్తాను' అని దిగులు పడిపోతున్న భాస్కర్రావుని ఓదార్చి ధైర్యం చెప్పి రైలు ఎక్కించాడు మార్గదర్శి.

బెజవాడ స్టేషనుకి వచ్చారు ఆనందరావు, సూర్యం. కాసేపు కబుర్లు, హోటల్లో కాఫీ ఫలహారాలు అయ్యాక బస్టాండుకి వచ్చేముందు మెల్లిగా అడిగాడు సూర్యం.

"బాబీ! పెళ్ళికూతురిది ఈ వూరే. చూస్తావా? చూస్తానంటే చెప్పు. గుట్టు చప్పుడుగా వెళ్ళి చూసేసి వద్దాం"

అన్నాడు.

వెళ్ళి చూడాలని మనసులో వున్నా తండ్రి గుర్తొచ్చి వెనక్కి తగ్గాడు భాస్కర్రావు.

"వద్దులేరా సూర్యం! నాన్నగారికి తెలిసిందంటే పెళ్ళిలో అందరి ముందూ తిడతారు. ఎలాగూ నాలుగు రోజులేగా వుంది పెళ్ళి. ఏకంగా అప్పుడే చూస్తాలే" అనేశాడు.

'సరే, అదీ నిజమే' అనుకుంటూ ముగ్గురూ బస్సెక్కారు.

"తమ్ముడూ! నువ్వుచూశావా?" అడిగాడు భాస్కర్రావ్.

"చూశానన్నయ్యా! చాలా బావుంది. కాకపోతే ఒక్కటే ఇబ్బంది" అని కిసుక్కున నవ్వాడు ఆనందరావు.

"ఏమిటది?" భాస్కర్రావు గొంతులో కుతూహలం.

"నువ్వు పేకాట డైలాగులు కొట్టినట్టే ఆవిడ సినిమా డైలాగులు కొడుతుంది" అన్నాడు నవ్వుతూ.

"ఏమిట్రా నువ్వు చెప్పేది! ముక్కకీ ముక్కకీ సంబంధం లేనట్లు మాట్లాడతావేం?" అన్నాడు భాస్కర్రావు.

"అదే అదే, నువ్వేచూడు" అంటూ నవ్వేసి తల తిప్పేసుకున్నాడు ఆనందరావు.

'ఏమిటో' అనుకుని మౌనంగా వుండిపోయాడు భాస్కర్రావు.

ఇంటికెళ్ళగానే కామేశ్వరి ఎదురై కుశల ప్రశ్నలు వేసి కాబోయే వదినని వర్ణించింది.

"అన్నయ్యా! మీ ఊళ్ళో సినిమాలు మంచివి వస్తాయా?" అంది.

"ఏమోనే! నేనంతగా సినిమాలు చూడనుగా! అయినా ఎందుకే" అన్నాడు భాస్కర్రావు.

"అది అంతేలే. ఇక నీకు సినిమాలు చూడక తప్పదు" అంటూ నవ్వుతూ పారిపోయింది.

అయోమయంలో పడిపోయాడు భాస్కర్రావు.

పెళ్ళి రోజు వచ్చింది. తెరతీశాక తలెత్తి భార్యని చూసి తనని తనే మర్చిపోయాడు భాస్కర్రావు. ఆలీస్ రాణిలా వుంటుందనుకున్నాడు. పసిమిరంగు, సన్నని బంగారు తీగలాంటి శరీరం. పెద్దకళ్ళు, సూటిగావున్న ముక్కు. రవ్వ ముక్కుపుడక. బారెడుజడ. పదహారణాల తెలుగు ఆడపడచులా వుంటుంది. అన్నపూర్ణ. తలంబ్రాలుపోస్తూ కళ్ళెత్తి చూసిన అన్నపూర్ణని చూసి చిలిపిగా నవ్వాడు భాస్కర్రావు. వెంటనే సిగ్గుగా తల దించుకుంది. 'అచ్చు ఆ ఫలానా సిన్మాలో ఫలానా హీరోలాగే ఉన్నాడే' అనుకుంది ఆనందంగా.

తొలిరేయి తన దగ్గరకు వచ్చి సినిమా పద్ధతిలో వంగి ప్రణామం పెట్టబోయిన భార్యని మధ్యలోనే ఆపేసి సినిమా స్టయిల్లోనే గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు భాస్కర్రావు. మెల్లిగా ఇద్దరి మధ్య మాటలు కదిలాయి.

"పూర్ణా! నాకు అన్నీ వున్నాయి. ఏలోటూ లేదు. కానీ ఎన్నిజోకర్లున్నా లైఫ్‌కార్డులేని ఆటలా వుండేది నాజీవితం. ఆ లైఫ్ కార్డులాగ నువ్వు వచ్చావు. ఇపుడు నాకెంతో బావుంది" అన్నాడు.

"అవునండీ! మనం పెళ్ళినాటి ప్రమాణాల్లో నాగేశ్వర్రావు-జమునల్లా, తేరేమేరే సప్నేలో ముంతాజ్- దేవానందుల్లా, కభీకభీలో రాఖీ-శశికపూర్లలా వుందాం." అంది పూర్ణ పరవశంగా.

"ఎవరు పూర్ణా వాళ్లు? ఎలావుంటారు వాళ్లు? వాళ్ళలా మనం వుండడం ఏమిటి?" అన్నాడు భాస్కర్రావు కుతూహలంగా.

హుషారుగా తలెత్తింది అన్నపూర్ణ. "అయ్యో! మీకు తెలీదా? ముందర కభీ కభీ స్టోరీ చెప్తాను వినండి. మొదటి సీన్లో..." అంటూ మొదలుపెట్టింది. పావు గంట గడిచినా అన్నపూర్ణ మొదటి సీన్లోనే వుండేసరికి భాస్కర్రావుకి ఓర్పు నశించింది.

"పూర్ణా! కథ రేపు చెబుదువుగాని" అన్నాడు బతిమాలుతూ.

"రేపా! రేపెలా వీలవుతుంది? రేపు తేరేమేరే సప్నే కథ చెప్పద్దూ!" అంది పూర్ణ దిగులుగా.

"అది ఎల్లుండి" అన్నాడు భాస్కర్రావు మత్తుగా.

"మరి పెళ్ళినాటి ప్రమాణాలు" అంది పూర్ణ అసహనంగా.

"ఆ మర్రోజు" అంటూ లైటుఆర్పేశాడు భాస్కర్రావు.

ఇది జరిగి నాలుగేళ్ళయినా ఆ సీన్ మాత్రం అప్పటికీ ఇప్పటికీ పూర్తికాలేదు. పూర్ణ రోజూ కథ చెప్తూ వుంటుంది. మొదటి సగం వినేసి ఇంటర్వెల్లో తను మాట్లాడదల్చుకున్నది మాట్లాడేసి భార్య జడతో ఆడుకొంటూ ముగింపు కోసం ఎదురు చూస్తూ ఓకునుకు తీస్తాడు భాస్కర్రావు.

తండ్రి టెలిగ్రామ్ పట్టుకుని భార్యా సమేతుడై బయల్దేరిన భాస్కర్రావు ముందు బెజవాడ్లో దిగి అత్తవారింటి కెళ్ళి మర్నాడు పొద్దున్నే ఫస్టుబస్సులో తమ ఊరు చేరుకున్నాడు.



## 4

ఊరు చేరేసరికి తొమ్మిది గంట లయింది. పరంధామయ్య వాకిట్లో అరుగు మీద కూర్చుని వున్నారు. మావగార్ని చూడగానే కొంగు భుజాలమీదుగా కప్పు కుంది అన్నపూర్ణ.

"నాన్నగారూ!" అని పలకరించాడు.

పలకరించడం పాపమన్నట్లు పరంధామయ్యగారు "ఆఁ ఏవిటోయ్! ఏమిటసలు మీధోరణి! నాకేం అంతుపట్టడం లేదు. చిన్నప్పట్నించి ముద్దు చేసినందుకు గాడిదల్లాగా తయారయ్యారు మీరు. అసలు తప్పంతా నాదిరా. దబ్బరంగా చెరో ఎకరం పొలం ఇచ్చి దున్నుకోండిరా అంటే సరిపోయేది. అపుడు వినయంగా వుండేవారు. పోనీలే అని చదువులు చెప్పించా కదూ! తలపొగర్లు ఎక్కువయ్యాయి. మా కాలంలో మేము ఇలాగే వుండేవాళ్లమూ!" అంటూ అగ్ని పురాణం విప్పారాయన.

'ఎంత చండశాసనమైనా మరీ భార్య ముందా!' అని మనసులో అనుకుని పైకి మాత్రం "నేను ఏం చేశాను నాన్నగారూ" అన్నాడు.

అన్నపూర్ణ మెల్లిగా లోపలికి వెళ్ళిపోయింది.

"ఆడేలేరా! నువ్వు కాకపోతే నీ తమ్ముడు. ఆ అంట్ల వెధవ. నువ్వు లోపలికెళ్ళు" అని కసిరాడు.

బతుకు జీవుడా అనుకుంటూ లోపలికి వెళ్ళాడు. తల్లి కనిపించింది. కొడుకుని యోగక్షేమాలడిగి అన్నపూర్ణకేసి తిరిగి—

"ఏమ్మా! నెల నెలా..." అంటూ అడగబోయిన తల్లిమీద తాడెత్తున లేచాడు భాస్కర్రావు.

"చాల్లేమ్మా! మా మొహాలకి అదొక్కటే తక్కువ. ఎందుకూ మాకు పిల్లలు? వాళ్ళ ఎదుట కూడా ఇలాగే చివాట్లు తిండానికా?" అన్నాడు ఉక్రోషంగా

నవ్వింది మాణిక్యాంబ. "నీ చిన్నప్పట్నుంచీ చూస్తున్నావు నాన్నగారి తీరు. ఇవాళ కొత్తేముందిరా బాబీ" అంది అప్యాయంగా.

నవ్వేశాడు భాస్కర్రావు.

స్నానాలూ, భోజనాలూ అయ్యాయి. గబగబా బట్టలు మార్చుకుని చెప్పులు వేసుకుని భోజనాలగది దగ్గరకు వచ్చాడు భాస్కర్రావు. అత్తగారి దగ్గర కూర్చుని కబుర్లు చెబుతోంది అన్నపూర్ణ.

"పూర్ణా! నేను మామయ్య దగ్గరికి వెళ్తున్నా. నువ్వూ వస్తావా?" అడిగాడు.

హుషారుగా లేచింది అన్నపూర్ణ. అత్తగారివంక చూసింది.

"వెళ్ళిరామ్మా" అంది మాణిక్యాంబ.

వెంటనే చీర మార్చుకుని వచ్చేసింది అన్నపూర్ణ. ఇద్దరూ జంటగా బైటికి వచ్చారు. మామిడి చెట్టుకింద మంచం వేసుకుని కూర్చుని వున్నాడు పరంధామయ్య.

"ఎక్కడికిరా ఇంత ఎండలో?" అన్నాడు.

"మావయ్య దగ్గరికి వెళ్తున్నాం" అన్నాడు భాస్కర్రావు మెల్లిగా.

"కోడలు కూడా ఎందుకు?"

"కామేశ్వరిని చూస్తుంది"

"అక్కర్లేదు. కామేశ్వరిని ఇదివరకు చూడలేదా? కుర్రకుంక. నా ఇంటిముందు దాకా వచ్చి వాకిట్లోంచే వెళ్ళిపోయింది. దానికోసం ఈ ఇంటి కోడలు వెళ్ళాలా?" అన్నాడు కఠినంగా.

"సరే! ఆగు పూర్ణా. నేను వెళ్తాను" అంటూ నాలుగడుగులు వేశాడు భాస్కరరావు.

కోడల్ని చూసి జాలేసింది పరంధామయ్యకి.

"ఊ! ఏడిశావులే. దాన్ని కూడా తీసుకెళ్ళు" అని గదిమాడు. అమ్మయ్య అనుకుని గబగబ వాకిట్లోకి నడిచింది పూర్ణ. ఇద్దరూ బస్సెక్కారు. సూర్యం ఊరికి బైటే తోటలో కనిపించాడు. బస్సాపించి తనక్కడే దిగిపోయి, అన్నపూర్ణని వూళ్ళోకి పంపాడు భాస్కరరావు.

మామిడికాయలు దింపిస్తున్న సూర్యం పాలేరు చెప్పడంతో తిరిగిచూశాడు. భాస్కర్రావుని చూడగానే ఎదురువచ్చి అమాంతం కావలించేసుకున్నాడు.

"ఎప్పుడ్రా రావడం" అంటూ పలకరించాడు.

"పొద్దున్నే వచ్చాన్లే"

ఇద్దరూ తోట మధ్యలో వేసివుంచిన నులకమంచం మీద కూర్చున్నారు. కొబ్బరి నీళ్ళుతాగి, దోర బంగినపల్లి మామిడికాయ ముక్కలు తింటూ—

"ఎందుకింత అర్జంటుగా రమ్మన్నారు నాన్న" అనడిగాడు భాస్కర్రావు.

"చెప్పలేదా?" అన్నాడు సూర్యం.

"లేదు మావయ్యా! ఒకటే మండి పడుతున్నాడు. చచ్చే చావుగా వుందనుకో

ఈయనతో" అన్నాడు విసుగ్గా.

నవ్వేసి అసలు సంగతంతా వివరించాడు సూర్యం. నోరు తెరుచుకుని విన్నాడు భాస్కర్రావు.

"ఇంతకీ ఆ లెటరు నువ్వు చూశావా?" అన్నాడు కుతూహలంగా భాస్కర్రావు.

"లేదురా! అది పర్సనల్ట! నాకు చూపలేదు వాడు" అన్నాడు సూర్యం.

"మొత్తానికి చాలా ఉందే వ్యవహారం"

"సరేలే! ఇక అసలు సమస్యచూడు. వచ్చిన సంబంధం చాలా మంచిది. వీడేమో మొండికెత్తాడు. అసలే మంచి సంబంధాలు రావడంలేదు. ఈ అవకాశం జారవిడుచుకుంటే కష్టం" అన్నాడు సూర్యం పరిస్థితి వివరిస్తూ.

నిట్టూర్చాడు భాస్కర్రావు. "వీడికి మతిపోయింది. యూస్‌లెస్ ఫెలో" అని తిట్టాడు తమ్ముడిని.

"ఇక్కడ కూర్చుని తిడితే ఏం లాభంరా? అక్కడికి వెళ్ళి చెడామడా వడ్డించు" అన్నాడు సూర్యం.

"తిట్టకుండా వూరుకుంటానా! చూపిస్తా నా తడాఖా" అన్నాడు ఖచ్చితంగా.

సాయంత్రందాకా ఉండి ఇంటికి తిరిగి వచ్చారిద్దరూ. అప నికి చాలా కబుర్లు చెప్పేసుకుని సాయంత్రం పని పూర్తి చేసుకుని మల్లెపూలు కట్టుకుంటూ కూర్చున్నారు కామేశ్వరి, అన్నపూర్ణ.

"ఏమ్మా! బావున్నావా?" అని పలకరించాడు చెల్లెల్ని.

"బాగానే ఉన్నాను. నువ్వేమిటలా నల్లబడిపోయావు'' అని అడిగింది కామేశ్వరి అలవాటుగా.

నవ్వేశాడు భాస్కర్రావు. కాఫీ లయ్యాక బయల్దేరుతున్న భాస్కర్రావుతో "ఈ పూటకి ఉండండిరా ఏం తొందర" అంటూ ఆపేశాడు సూర్యం.

"ఈవూళ్ళో ఏం సినిమా ఆడుతోంది అన్నయ్యగారూ?" అనడిగింది అన్నపూర్ణ.

"నువ్వు చూసిందే వదినా! జీవన జ్యోతి" అంది కామేశ్వరి నవ్వుతూ.

"సరేలేవమ్మా! అలాంటి సినిమాలు ఎన్నిసార్లు చూసినా బాగానే ఉంటాయి. వెళ్దాం" అంది అన్నపూర్ణ ఉషారుగా.

"ఏరా?" అన్నాడు సూర్యం.

"వద్దులే. నాకు ఓపికలేదు. వాళ్ళు వెళ్తారు. మనం ఎలాగోలా కాలక్షేపం చేసేద్దాం" అన్నాడు భాస్కర్రావు.

'సరే' అని ఆడవాళ్ళిద్దరూ టూరింగు హాలుకి వెళ్ళిపోయారు సినిమాకి. నేను ఆడను మొర్రో అంటున్నా వినకుండా బావగారిని పట్టుకుని బలవంతం పెట్టేసి ముక్కలు పంచాడు భాస్కర్రావు.

అర్ధరాత్రి పదకొండు గంటలకు జీవన



జ్యోతి ఇంటర్‌వెల్లో భార్యతో తమ్ముడి సమస్య చెప్పాడు భాస్కర్రావు.

"హైదరాబాద్ వెళ్ళాలి నేను" అన్నాడు.

"సరేగానీ చెప్పేది అయిపోయిందా" అంది అన్నపూర్ణ.

భాస్కర్రావు అయిపోయిందనగానే మళ్ళీ కథలోకి వెళ్ళిపోయింది అన్నపూర్ణ.

మర్నాడు పొద్దున్నే సూర్యాన్ని కూడా వెంటబెట్టుకుని తనింటికి తిరిగి వచ్చాడు భాస్కర్రావు. అన్నపూర్ణ వరండాలో మావగార్ని చూడగానే లోపలికి జారుకుంది.

"ఏరా! కూసేగాడిద వచ్చి మేసే గాడిదని చెడగొట్టిందట. అలా ఉంది మీ వ్యవహారం" అన్నాడు పరంధామయ్య.

"లేదు నాన్నగారూ! మావయ్య నాకు అంతా చెప్పేశాడు. నేను ఇవాళే వెళ్తాను. వెళ్ళగానే వాడి సంగతి తేల్చేస్తాను" అన్నాడు భాస్కర్రావు.

"సరే వుద్ధరించావులే. మరి ఆ సూర్యనారాయణమూర్తిగారు రారా?" అన్నాడు పరంధామయ్య.

సూర్యం నవ్వాడు – "లేదు బావా. నాకు పనుంది అన్నాడు"

* * *

అనుకున్న ప్రకారం హైదరాబాద్ వెళ్ళాడు భాస్కర్రావు. తలుపు తియ్యగానే అన్నయ్యని చూసి సగం అర్థం చేసుకున్నాడు ఆనందరావు.

"రా అన్నయ్యా!'' అంటూ లోపలికి ఆహ్వానించాడు.

లోపలికి వెళ్ళీ వెళ్ళగానే సూటిగా రంగంలోకి దిగిపోయాడు భాస్కర్రావు.

"ఏరా తమ్ముడూ! కనిపించిందా నీ ప్రేయసి?"

"లేదన్నయ్యా! కనిపిస్తే ఇలా వుంటానా?" అన్నాడు ఆనందరావు దిగులుగా.

"కనిపించేదాకా పెళ్లి చేసుకోకుండా ఇలాగే వుంటావా?" అనడిగాడు భాస్కర్రావు కరుకుగా.

"ఆ అంతే" అన్నాడు ఆనందరావు ఖచ్చితంగా.

"బుద్ధి లేదుట్రా నీకు? ముందూ వెనకా చూసుకోకుండా ఏమిటీ తెలివి తక్కువ" అన్నాడు మండిపడుతూ.

"అన్నయ్యా! చదువూ సంస్కారం వున్న ఈతరం వాడివి. నువ్వూ ఇలా అంటావని నేననుకోలేదు. ఆ అమ్మాయి క్రిస్టియన్ అయితేనేం? నన్నెంత లవ్ చేసిందో నీకు తెలీదు. అటువంటి దానికి అన్యాయం చేసి వేరే పెళ్లి చేసుకోనా? నావల్ల కాదు" అన్నాడు దీనంగా.

"నీ వల్లకాదు. క్రిస్టియనో, మహమ్మదెనో అసలు అమ్మాయి ఏదిరా? అమ్మాయంటూ వుంటేకదా నీ లవ్వూ నువ్వూను. నీకు మతిలేదురా. పూర్తిగా పిచ్చిపట్టింది."

"ఆ ఉత్తరం చదివితే నువ్వలా అనవు. నా పరిస్థితిలో నువ్వున్నా అలాగే ప్రవర్తించేవాడివి" అన్నాడు ఆనందరావు కళ్ళనీళ్ల పర్యంతం అవుతూ.

"సరే, ఆ ఉత్తరం ఇలా పట్రా చదువుతాను" అన్నాడు భాస్కర్రావు కుతూహలంగా.

"సారీ! అన్నయ్యా! అది పర్సనల్, పూర్తిగా పర్సనల్"

ఒళ్లు మండిపోయింది భాస్కర్రావుకి. "ఒరేయ్ ఆనందాయ్! చివరిసారి నిన్ను

ఎప్పుడు కొట్టానో గుర్తులేదు. మళ్ళీ ఆ అవసరం రానీయకు. ఎగ్జిక్యూటివ్ రాంక్‌లో వున్నవాడివి. అనవసరంగా నా చేతుల్లో తన్నులు తినకు" అన్నాడు కోపంగా.

"నన్నేం చెయ్యమంటావ్ అన్నయ్యా"

తమ్ముడి దీనత్వం చూసి జాలేసింది భాస్కర్రావుకి. మెల్లగా పక్కనేకూర్చుని "చూడు ఆనందూ! నేను చెప్పేది శ్రద్ధగా విను. ఏ ప్రేమ వ్యవహారానికయినా ఓ ఆడపిల్ల వుంటుంది. వుండాలి. వుంటేనే కథ నడిచేది. కానీ నీ ప్రేమకథలో అమ్మాయే లేదు. వున్నది కాగితంముక్క. దానిని ఆధారంగా తీసుకుని నువ్వు అనవసరంగా ప్రొసీడ్ అవుతున్నావు. చూడు తమ్ముడూ! ఆట ఆడాలంటే ఓసీక్వెన్సో, ఓ ట్రిప్లెటో, ఏదీ కాకపోతే కనీసం రెండు జోకర్లో వుండాలి. అదీఇదీ లేక పోతే డ్రాప్ చేసెయ్యాలి. నీ కేసూ అంతే. అమ్మాయి ఎదురుగా వుంటే ఆవిడ కులం, మతం ఆలోచించి వ్యవహారం నడిపించచ్చు, నాన్నగారితో పోట్లాడచ్చు, ఎదిరించి పెళ్ళి చేసుకోవచ్చు. ఆవు వుంటే పలుపుతాడు తేవచ్చు కానీ పలుపుతాడుకోసం ఆవుని కొనుక్కుంటారా ఎవరయినా?" అంటూ నచ్చచెప్పాడు.

ఆనందరావుకి అన్నయ్య వాదన నచ్చలేదు. "అన్నయ్యా! అమ్మాయి లేకపోతే ఈ ఉత్తరం ఎలా వస్తుంది. ఆ అమ్మాయికి నా మీద ఎంత ప్రేమ లేకపోతే అలా రాస్తుంది?" అన్నాడు - దీనికి జవాబు చెప్పు అనే ధోరణిలో.

భాస్కర్రావు నవ్వేశాడు. "అమ్మాయి వుంది. వుంటచ్చు. నేను కాదనను. కానీ నీ ఎదురుగా లేదు. అసలెక్కడ వుందో నీకు తెలీదు. ఆ అమ్మాయికి నీ మీద ప్రేమ కూడా వుండి వుండవచ్చు. అదీ నేను కాదనను. ఓ పాయింటు. పరిస్థితులకు తలవంచి వేరే ఎవరినయినా పెళ్ళి చేసుకుందేమో!" అన్నాడు.

"అన్నయ్యా!" ఆక్రోశించాడు ఆనందరావు.

"అంతేరా మరి. అలాంటిదేదో జరగకపోతే ఈపాటికి నీ ఎదుటికి వచ్చేదేగా? కనీసం మరో ఉత్తరం రాసేది కాదూ! ఇదంతా మర్చిపో. దీనివల్ల ఎంతమంది బాధపడతారో చూడు. నాన్నగారికి కోపం వస్తుంది. అమ్మ కుమిలిపోతుంది. సూర్యం, కామేశ్వరి, అన్నపూర్ణ, నేను మా కెవ్వరికీ మనశ్శాంతి వుండదు. ఇంతమందిని ఎందుకు బాధపెడుతున్నట్లు? ముక్కూ మొహం తెలీని ఓ అమ్మాయికోసం, ఆ అమ్మాయి రాసిన ఉత్తరం కోసం. అంతేనా? మేమందరం ఒకవేపు, ఆఅజ్ఞాత ప్రేయసి ఒకవేపు. ఎవరికి విలువ ఇస్తావో చూస్తాను" అన్నాడు భాస్కర్రావు.

ఆనందరావు సంకటంలో పడ్డాడు. ఒకవైపు తనవాళ్ళు, వాళ్ళ అభిమానం, ప్రేమ, మరో వైపు తనెవరో తెలియ చెయ్యకుండానే తన ప్రేమతో నిలువునా వెర్రివాడిని చేసిన సోనీ! ఎటువైపు మొగ్గాలి...?

"నన్నేం చెయ్యమంటావన్నయ్యా! నాకంతా అయోమయంగా వుంది"

"చూడు ఆనందాయ్! కనిపించని సోనీ కోసం ఏడుస్తూ కూర్చుని జీవితం నాశనం చేసుకోనక్కర్లేదు. అన్ని అర్హతలూ వున్న స్వర్ణలతను పెళ్ళి చేసుకుని హాయిగా వుండచ్చు..."

"అంతేనా అన్నయ్యా?" అన్నాడు దీనాతిదీనంగా.

"అక్షరాలా అంతే! నా మాటవిను. నువ్వు సుఖపడు. మమ్మల్నీ నిశ్చింతగా వుండనీ. మా మాటవిని మా పరువు దక్కిస్తావో, నీ ఇష్టం వచ్చినట్లు చేసి మన ఇంటి పరువు, ప్రతిష్ట, మన వంశ మర్యాద బజారుకి ఎక్కిస్తావో నీ ఇష్టం. మా అందర్లోకి పెద్ద చదువు చదివిన వాడివి. మాకన్నా గొప్ప హోదాలో వున్నవాడివి. అసలు నీకు చెప్పతగ్గ వాళ్ళంకాదు మేము. అయినా అన్నయ్యని కాబట్టి మనసు వుండబట్టలేక నీ దగ్గరికి పరిగెత్తుకొచ్చాను. నే చెప్పాల్సింది చెప్పాను. ఆ తర్వాత నీ ఇష్టం" అన్నాడు భాస్కర్రావు సీరియస్‌గా.

ఆ మాటలకి ఆనందరావు మనసు విలవిలలాడింది. చాలా సేపు ఆలోచించి, దీర్ఘంగా నిట్టూర్చి, "సరే అన్నయ్యా! మీ ఇష్టం. మీ ఇష్టప్రకారమే కానివ్వండి" అన్నాడు నిర్లిప్తంగా.

సంతోషంగా తమ్ముడి భుజం తట్టాడు భాస్కర్రావు.

"శభాష్! ఇలా ఉండాలి. వెరీగుడ్. అయితే తెల్లవారగానే వెళ్ళి శలవు పెట్టేసెయ్. ఇంటికెళ్దాం. తర్వాత పెళ్ళి చూపులకి" అన్నాడు సరదాగా.

"వద్దులే అన్నయ్యా! మీరు చూడండి చాలు" అన్నాడు నిరాసక్తంగా.

"అదేవిటి? నువ్వు చూడకుండా ఎలాగరా?" అన్నాడు భాస్కర్రావు.

"మరేం ఫరవాలేదు. నువ్వు మాత్రం చూశావా వదినని?" అన్నాడు.

"అవుననుకో! పరిస్థితులు అలా వచ్చాయి అపుడు. నీకేం లక్షణంగా పెళ్ళి చూపులు చూసే అవకాశం ఉంది నీకు.."

"అవన్నీ వద్దన్నానా? సోనీ కాక పోయాకా ఎవరైనా ఒకటే నాకు" అన్నాడు భాస్కర్రావు మాటలకి అడ్డొస్తూ.

ఒక్కక్షణం తమ్ముడి వంక అయోమయంగా చూశాడు భాస్కర్రావు. అంతలోనే 'ఆ... పెళ్ళయ్యాక సోనీలేదు, పోనీ లేదు. ఎంచక్కా భార్య కొంగుపుచ్చుకు తిరుగుతాడు' అనుకున్నాడు.

తెల్లారాకా తమ్ముడిని స్టూడియోకి లాక్కెళ్ళి మంచి ఫొటోలు తీయించి ఆరోజు అక్కడే ఉండి మర్నాడు సాయంత్రం ఫొటోలు తీసుకుని ప్రయాణం అయ్యాడు భాస్కర్రావు.

నిరాశగా ఏదో పోగొట్టుకున్నవాడిలా ఉన్న తమ్ముడిని చూసి-

"చూడు ఆనందూ! ఒక సత్యం తెలుసుకో. మనకు నాల్గు చేతులు అవతల వున్నవాడు ఎంత మంచి ముక్క వేసినా అది మనదికాదు. మనకు ప్రాప్తం లేదని నచ్చజెప్పుకుని ఆట మార్చేసుకోవాలి. ఇదీ అంతే! నేను వెళ్ళిచూసి ఆ అమ్మాయి ఫొటోలు నీకు పంపిస్తాను. ఆ సోనీని మర్చిపోయి స్వర్ణలత కోసం కలలుకను. ఓ.కె!" అంటూ తమ్ముడి భుజం తట్టి బస్సెక్కాడు భాస్కర్రావు.

అంత దిగులులోనూ అన్నయ్య మాటలకు నవ్వుకున్నాడు ఆనందరావు.

బెజవాడలో ఆగి పాత స్నేహితులను పలకరించి ఊరు చేరేసరికి రాత్రి పదకొండు గంటలయింది. వెళ్ళగానే ముందు ఆరుబయట పడుకొని ఉన్న తండ్రిని లేపాడు భాస్కర్రావు.

"నాన్నగారూ! ఆనందాయ్ పెళ్ళికి ఒప్పుకున్నాడు. పెళ్లిచూపులకి వాడు రాడట. అంతా మన ఇష్టమేనన్నాడు" అని చెప్పాడు.

పరంధామయ్యకి మహా సంతోషం వేసింది. ఇది మరీ మంచిది. పెళ్ళి చూపులంటే మళ్ళీ ఏం వెర్రివేషాలు వేస్తాడోనని లోలోపల ఆయనకి భయం గానే ఉంది. సమస్య తీరిపోయి తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు. ఎదురుగా ఉన్న పెద్దకొడుకుని ప్రసన్నంగా చూసి–

"సరేలే పో! పోయి పడుకో పొద్దు పోయింది" అన్నాడు.

భాస్కర్రావు హుషారుగా లోపలికి వెళ్ళాడు. మాణిక్యాంబ లేచి వచ్చింది.

"భోజనం చేస్తావురా బాబీ" అనడిగింది.

"వద్దమ్మా! చేసే వచ్చాను. కాసిని మంచినీళ్ళివ్వు చాలు"

మంచినీళ్ళు తాగి తన గదిలోకి వెళ్ళాడు. పందిరి మంచం మీద గాఢ నిద్రలో వుంది అన్నపూర్ణ. బట్టలు మార్చుకుని తనూ మంచం మీద వాలి పోయి భార్యని లేపాడు. బద్ధకంగా లేచింది అన్నపూర్ణ.

"ఎప్పుడొచ్చారు?" అంటూ పలకరించింది ఆవలిస్తూనే.

"ఇపుడే" అంటూ తను వెళ్ళి తమ్ముడిని ఎలా ఒప్పించిందీ చెప్పాడు టూకీగా.

అంతావిని "మంచిపని చేశారు. లేకపోతే అదేవతెకోసమో ఇతను పెళ్ళి మానెయ్యడం ఏమిటి? అసలా విడ ఎపుడో పెళ్ళి చేసుకునే వుంటుంది. 'పూజ' సినిమాలో అంతేగా! పాపం రామకృష్ణ ఏడిచి వాణిశ్రీనిఏడిపిస్తూవుంటాడు. కన్నడ మంజుల మాత్రం హాయిగా పిల్లాడిని కంటుంది" అంది అన్నపూర్ణ.

"అలాగా?" అన్నాడు భాస్కర్రావు ఏమనాలో తోచక.

"అయ్యో!" అంతేగా మరి. మీరా సినిమా చూడలేదా? ఎ.వి.యం. వాళ్ళ సినిమా. తారాగణం రామకృష్ణ, వాణిశ్రీ..." అంటూ చెప్పబోయిన అన్నపూర్ణ నోరు మూసేశాడు భాస్కర్రావు.

"అబ్బ! ఫో పూర్ణా. ఎపుడూ వెధవ సినిమాకబుర్లే. నాలుగు రోజుల తర్వాత వచ్చాను కదా! మామూలుగా కబుర్లు చెప్పరాదూ" అన్నాడు ప్రేమగా.

సూటిగా చూసింది భర్త వంక. "అవునూ! హైదరాబాద్‌లో ఎపుడు బయల్దేరారు?" అంది

"నిన్నరాత్రి" అనేసి నాలిక కరుచుకున్నాడు.

"ఊ! నిన్నరాత్రి అక్కడ బస్సెక్కి పొద్దున్న తొమ్మిదికల్లా ఇంటికి చేరకుండా ఎక్కడికి వెళ్ళారు?" అంది నిలదీస్తూ.

"పాత ఫ్రెండ్స్ వుంటే వాళ్ళింటికి వెళ్ళొచ్చాను" అన్నాడు.

"మనలో మన మాట. ఎంత పోయిందేమిటి?" అంది చిలిపిగా.

నవ్వేశాడు భాస్కర్రావు. భార్య భుజం మీద తలవాల్చి "పూర్ణా! పూజ కథ చెప్పు" అన్నాడు కొంటెగా.

"వద్దులెండి. రేపు చెప్తాను" అంటూ తనూ నవ్వేసింది అన్నపూర్ణ.

* * *

తెల్లవారింది. పేరిశాస్త్రిని పిలిపించి ఫలానిరోజు పెళ్ళి చూపులకి వస్తామనీ, అబ్బాయి రాడనీ, ఈ సంగతి వాళ్ళకి తెలియజెయ్యమనీ చెప్పాడు పరంధామయ్య. పేరిశాస్త్రి వెళ్ళిపోయాడు. భాస్కర్రావు తన గదిలోకి వెళ్ళి పేపరు తిరగేస్తూ పడుకున్నాడు.

పరంధామయ్య స్నానం చేసి దేవుడి

ముందు కూర్చుని, అక్కడే భార్య సిద్ధంగా వుంచిన పంచ పాత్ర, ఉద్ధరిణి, అరివేణం అన్నీ తీసుకుని విభూతి పెట్టుకుని సంధ్యావందన కార్యక్రమాన్ని మొదలు పెట్టాడు. ఇంతలోకే వంటింట్లోంచి—

"అమ్మమ్మమ్మా... ఏం మొగుడివి? నువ్వేం మొగుడివి" అని పాట వినిపించింది.

భార్య సరసం ఆడుతుందేమోనని సంధ్యావందనం మానేసికాసేపు విన్నాడు. కానీ అది మాణిక్యాంబ గొంతుకాదు. తన దృష్టి మళ్ళించి మళ్ళీ సంధ్యావందనం మొదలెట్టబోయాడు. కానీ ఆ పాట అతన్ని పక్కదారి పట్టిస్తోంది. అతికష్టం మీద ఓర్పు వహించాడు.

"...చెప్పుకోను ఏముంది?మంగళగిరి గోపురంలా నెత్తి మీద పిలకుంది" అనే సరికి కోపం ముంచుకు వచ్చింది. చివాల్న లేచి వంటింట్లోకి నడిచాడు.

అప్పటిదాకా పాట పాడుకుంటూ కొబ్బరి పచ్చడి రుబ్బుతున్న అన్నపూర్ణ గభాల్న లేచి నిలబడి కొంగు కప్పుకొని వినయంగా తలవంచుకుంది. ఆయన కోపం తగ్గిపోయింది. భార్యని నమిలి మింగేసేలా చూసి వెనక్కి తిరిగాడు.

భర్త మనసులోని భావం కనిపెట్టింది మాణిక్యాంబ.

"అమ్మాయ్ పూర్ణా! నీకెందుకమ్మా శ్రమ. లేచి చెయ్యి కడుక్కో. వెళ్ళి ఏ పుస్తకమన్నా చదువుకోక ఎందుకొచ్చిన తిప్పలు" అంది.

"సరేలెండి! ఇదేం శ్రమ? అసలు ఏటికేడాదీ మీకు చేసి పెట్టాల్సిన దాన్నిగామా నేను? అలా దూరంగా వుండిపోబట్టి మీకింకా వంట పొయ్యి తప్పలేదు" అంటూ కొంగు దోపుకుని మళ్ళీ రోటి ముందు కూర్చుంది అన్నపూర్ణ.

ఇబ్బందిగా, ప్రేమగా కోడలి వంక చూసింది మాణిక్యాంబ. మళ్ళీ పచ్చడి రుబ్బుతూ పాట మొదలు పెట్టింది అన్నపూర్ణ. ఈసారి పాట మారింది.

"ఓరబ్బీ తిక్కరేగిందా! ఒళ్ళంతా తిమ్మిరెక్కిందా...!"

భయంగా కోడల్ని చూస్తూ...వాకిలి కేసి చూస్తూ కూర్చుంది మాణిక్యాంబ.

పరంధామయ్యకి ఒళ్ళుమండిపోతోంది. అసలు పాపం అన్నపూర్ణకి మావగారి దైవధ్యానం పాడుచేయాలనే దురుద్దేశం ఎంతమాత్రమూ లేదు. అదొక అలవాటు. కూనిరాగం తియ్యకుండా ఏ పనీ చెయ్యలేదు అన్నపూర్ణ. పాట ఆగిందో పని ఆగిందే. పాట మొదలైతేగాని పని మొదలుకాదు.

అన్నపూర్ణది చక్కని కంఠం. త్యాగరాజ కృతులు పాడితే సంగీత జ్ఞానం లేనివాళ్ళు కూడా తలలూపి వింటారు. కానీ అవి సామాన్యంగా పాడదు. సినిమాపాటలే పాడుతుంది. అవీ ఫాస్ట్ సాంగ్స్. అవన్నీ ఎవరూ కాదనలేరు. కానీ ఇపుడు మాణిక్యాంబ పరిస్థితి ఇరకాటంగా ఉంది. వద్దని చెప్తే కోడలి మనసు నొచ్చుకుంటుందేమో! ఊరుకుంటే భర్తకి కోపం వస్తుందేమో అనుకుంటూ తల పట్టుకుని కూర్చుంది.

రెండు నిమిషాలు కోడలి పాట వినేసరికి నిజంగానే తిక్కరేగింది పరంధామయ్యకి. లేచి విసురుగా పీటనుతన్ని గబగబా హాల్లోకి నడిచాడు.

"బాబీ...బాబీ!" అని గర్జించాడు.

పరధ్యానంగా పేపరు చదువుకుంటున్న భాస్కర్రావు పరుగున వచ్చి తండ్రిని

చూసి తెల్లబోయాడు 'ఇప్పటిదాకా ప్రసన్నంగానే వున్నారుగా. మళ్ళీ ఏం ముంచుకువచ్చిందో' అనుకుంటూ భయం భయంగా తల వంచుకుని నిలబడ్డాడు.

"ఒరేయ్! నీ పెళ్ళాన్ని నీతో గదిలోకి తీసికెళ్ళి తలుపేసుకో" అన్నాడు పరంధామయ్య.

భాస్కర్రావు మొహం ఎర్రబడిపోయింది. నోటమాటరాక నిలబడిపోయాడు.

"ఏరా! చెప్పింది వినబడలేదా? పందిరి గుంజలా నిలబడ్డావేం? నీ పెళ్ళాన్ని నీతో నీ గదిలోపెట్టి తలుపేసుకో. నేను పిల్చేదాకా బైటికిరాకు" అన్నాడు మరింత కోపంగా.

"అదికాదు నాన్నగారూ..." అంటూ చెప్పబోయిన భాస్కర్రావుని ఒక్క అదిలింపుతో ఆపేశాడు పరంధామయ్య.

"నోరుమూసుకో. చెప్పినపని చెయ్యి" అన్నాడు నిప్పులు కక్కుతూ.

ఇక విధిలేక వంటింటి వైపునడిచాడు. అన్నపూర్ణ పచ్చడి రుబ్బుతోంది. తల్లి పొయ్యిముందు కూర్చుని కూర కలియబెడుతోంది. చచ్చే చావుగా ఉంది భాస్కర్రావుకి. భర్తని చూసి తలెత్తి—

"ఏం కావాలి?" అనడిగిందిఅన్నపూర్ణ.

"నువ్వురా" అని సైగచేశాడు భాస్కర్రావు.

అదిరిపడింది అన్నపూర్ణ. భయంగా అత్తగారి వంక చూసింది. ఆవిడ తల వంచుకుని ఉంది. భర్తని మింగేసేలా చూసి 'బైటికిపొండి' అని సైగ చేసింది. మెల్లిగా వెనక్కితిరిగి హాల్లోకి వచ్చాడు భాస్కర్రావు. వచ్చీరాగానే—

"ఏరా! ఏదీ కోడలు?" అన్నాడు పరంధామయ్య.

"రానందండీ! పని ఉందిట" అన్నాడు భాస్కర్రావు తలవంచుకుని. మరింత తిక్కరేగింది పరంధామయ్యకి.

"ఛీ! చేతకాని వెధవ. మా రోజుల్లో ఇలాగే ఉండేవాళ్ళమా! పెళ్ళాలు గడగడలాడిపోవాల్సిందే. నుంచోమంటే నుంచుని, కూర్చోమంటేకూర్చోవాల్సిందే. మీరూ ఉన్నారు ఎందుకు? పెళ్ళాన్ని నీతో తీసుకుపోరా అంటే 'రానంది' అని వణుక్కుంటూ చెప్తున్నావు...."

పౌరుషం వచ్చింది భాస్కర్రావుకి. చివాల్న వెనక్కితిరిగి, వంటింట్లోకి వచ్చాడు. తల్లివంక చూశాడు. తల వంచుకుని పనిచేసుకుంటోందావిడ. చరచర అన్నపూర్ణ దగ్గరికెళ్ళి తెల్లబోయి చూస్తున్న అన్నపూర్ణను చెయ్యిపట్టి లేవదీసి, తనతో లాక్కొచ్చి 'ధన్'మని తలుపులు మూసేశాడు.

అమ్మయ్య అనుకుంటూ వెనక్కివెళ్ళి పూజగదిలో పీటమీద కూర్చున్నాడు పరంధామయ్య.

ఒక్క విదిలింపు విదిలించుకుంది అన్నపూర్ణ. "ఏమిటీ పోకిరివేషాలు మతేమైనా పోయిందా! ఆలుమగల్లో రాజబాబులా పట్టపగలు వెధవ వేషాలేస్తున్నారు మరీను. అత్తగారు, మావగారి ముందూనా ఈ సరసాలు ఛీఛీ..." అంది కళ్ళనీళ్ళ పర్యంతం అవుతూ.

"ఏడవకు. ఏం చేస్తాం. నాన్నగారి ఆజ్ఞ. నాకూ మొహమాటంగానే అనిపించింది. అప్పటికీ చాలాసేపు వూరుకున్నాను. ఇక అదేపనిగా కోప్పడుతుంటే తప్పలేదు" అన్నాడు భాస్కర్రావు.

నోరుతెరిచింది అన్నపూర్ణ "ఏమిటీ! మావగారు చెప్పారా! చూస్తుంటే సప్తపదిలో యాజులుగారిలాగా వుండే ఈయన

ధోరణి" అంది ఆశ్చర్యంగా.

అలాగా అనిగానీ, ఏ సప్తపది అని గానీ అనలేదు భాస్కర్రావు. భార్య చెయ్యి పట్టుకొని "ఏం పచ్చడి? కొబ్బరి పచ్చడా? ఉప్పు సరిపోయిందో లేదో చూడనీ" అంటూ ముందుకి వంగేసరికి చెయ్యిలాగేసుకుంది.

"అయ్యో! తప్పు. మహానైవేద్యం కాలేదింకా" అంటూ తలుపు తీసుకుని బయటికి వెళ్ళబోయింది.



వెనక్కి లాగేశాడు భాస్కర్రావు. "చంపేశావ్! మళ్ళీ నాన్నగారు పిల్చే వరకూ మనిద్దరం ఇలాగే వుండాలి" అన్నాడు.

"మరెలాగండీ! చెయ్యిమండుతోంది" అంది చెయ్యి వూదుకొంటూ.

జాలేసింది భాస్కర్రావుకి. "సరే. ఈ ఇవతలి గుమ్మంలోంచి వెళ్ళి చెయ్యి కడుక్కుని చప్పున వచ్చెయ్" అన్నాడు.

తూరీగలా వెళ్ళి చెయ్యి కడుక్కుని వచ్చేసింది అన్నపూర్ణ. ఒంటిగంటకి దేవతార్చన ముగించి విసరి ముందు కూర్చుని 'వాడిని రమ్మను' అని అజ్ఞాపించాడు పరంధామయ్య.

తల్లి పిలుపుతో మంచినిద్రలో వున్న భాస్కర్రావు ఉలిక్కిపడి లేచి భోజనానికి వచ్చేశాడు తిన్నగా.

"ఒరేయ్ బాబ్! భోంచేశాక సూర్యం దగ్గరికి వెళ్ళు. వాడికీ సంగతి చెప్పి పెళ్ళిచూపులకి వెళ్ళాలి. అవేళ్టికి ఏ కొంప మునిగిపోయే పనీ పెట్టుకోకుండా వుండమను" అని చెప్పాడు పరంధామయ్య. సరే అని తల వూపాడు భాస్కర్రావు.

పేరిశాస్త్రి కబురు అందుకుని తిలక్ ఇంటికెళ్ళాడు రామశాస్త్రి. అతన్ని చూడగానే రుక్మిణమ్మ ఎదురువచ్చి "రండి శాస్త్రిగారూ!" అంటూ ఆహ్వానించి కూర్చో బెట్టింది. ఇంతలో తిలక్‌గారు కూడా లోపల్నించి ముందు గదిలోకి వచ్చారు

"ఏమండీ! ఏమిటి విశేషం? ఆ జగన్నాధపురంవాళ్ళని మళ్ళీ కలిశారా?"



అంది రుక్మిణమ్మ ఆత్రంగా.

"కలవటమేమిటమ్మా! అన్నీ మాట్లాడాను. వాళ్ళు మనతో సంబంధం చేసుకోడానికి చాలా సుముఖంగా వున్నారు. ఇది గనక కుదిరితే మీరెంతో అదృష్టవంతులు" అన్నాడు రామశాస్త్రి.

పరమానందభరితురాలైంది రుక్మిణమ్మ. అక్కడే కూర్చుని నవల చదువుకుంటున్న స్వర్ణ తల నిమిరింది. చెంపలు నిమిరింది. 'నాతల్లి దశవంతురాలు' అనుకుంది.

"ఇక మీదే ఆలస్యం తిలక్‌గారూ! మీరు నిర్ణయించుకుని తెలియజేస్తే వాళ్ళు



అమ్మాయిని చూడ్డానికి వస్తారు" అన్నాడు రామశాస్త్రి.

"నాదేముంది? ఆ అబ్బాయికి ఎపుడు వీలో చూసుకుని వాళ్ళ ఇష్టం వచ్చినపుడు రమ్మనండి" అన్నారు తిలక్‌గారు.

"ఆ అబ్బాయి రాడు తిలక్‌గారూ! వాళ్ళ కుటుంబంలో అతను తప్ప మిగతా వాళ్లు వస్తారు"

అప్పటిదాకావింటున్న స్వర్ణ విసురుగా లేచి నిలబడి చేతిలోని పుస్తకం విసిరికొట్టి "నాన్నగారూ!నాకీ సంబంధం ఇష్టంలేదు" అనేసి చరచరా వెళ్ళిపోయింది.

కూతురు వెళ్ళిన వైపుచూసి తలబాదు కుంది రుక్మిణమ్మ. తిలక్‌గారికి ఈ వ్యవహారం నచ్చలేదు.

"అదేమిటి శాస్త్రిగారూ! అసలు ముఖ్యమైనవాడు అబ్బాయి రాకుండా మిగతావాళ్లు రావడమేమిటి? అసలు అబ్బాయి, అమ్మాయి చూసుకోకుండా, ఇష్టపడకుండా పెళ్ళేమిటి? ఇదంతా ఏదో గూడుపుఠాణిలాగా వుంది" అన్నారు అసహనంగా.

రుక్మిణమ్మ లోపలికి వెళ్ళిపోయింది. శాస్త్రి నవ్వాడు."అయ్యో...తిలక్‌గారూ! ఆమాత్రం అనుమానం నాకూ వచ్చింది. కానీ అన్నీ వివరంగా కనుక్కున్నాక నా అనుమానం తీరిపోయింది. వాళ్ళ ఇంట్లో పెళ్లిచూపులు - ముఖ్యంగా అబ్బాయి అమ్మాయిని చూడ్డం ఆనవాయితీ లేదుట. ఈ పెళ్లికొడుకు అన్నగారు కూడా పెళ్లిపీటలమీదే భార్యని చూసుకున్నాడు. ఆ అమ్మాయి వాళ్ళది బెజవాడ. మీలాగా ముందూ వెనకా ఆడకుండా ధైర్యం చేసి పిల్లను ఇచ్చేరేమో ఇపుడు నిశ్చింతగా వున్నారు. ఆంధ్ర దేశం అంతా అరవై సార్లు గాలించినా అలాంటి సంబంధం దొరుకుతుందిటండీ!

బోలెడు భూమి, తోటలు - ఇక అబ్బాయా...? చూడ్డానికి రెండు కళ్ళు చాలవుట. ఉద్యోగం సంగతి చెప్పనే అక్కర్లేదు. ఇద్దరే అన్నదమ్ములు. ఉన్న ఒక్క ఆడపిల్లకి పెళ్ళయి హాయిగా సంసారం చేసుకుంటోంది. ఇలా సందేహిస్తూ కూర్చుంటే తర్వాత పశ్చాత్తాప పడాల్సివస్తుంది. అయినా ఆ అబ్బాయి తప్ప మిగతా అంతా వస్తున్నారుగా! అన్నం అంతా పట్టి చూడాలా? మెతుకు పట్టిచూస్తే చాలదూ! వాళ్ళనిబట్టి ఆ అబ్బాయిని ఆ మాత్రం అంచనా వేయలేర్టండీ!"

తిలక్‌గారు ఆలోచనలో పడ్డారు. ఇంతలోనే కబురందుకున్న మధుసూదన్, హేమలత వచ్చేశారు. అల్లుడిని చూడగానే ప్రాణం లేచివచ్చింది రుక్మిణమ్మకి. తన బాధ వెళ్ళబోసుకుంది.

"చూడు నాయనా! మంచి సంబంధం. ప్రతిదానికీ ఇలా వంకలు పెట్టుకుంటూ కూర్చుంటే ఎలా? ఏదో సర్దిచెబుదూ మీ మావగారికి"

మామగారి దగ్గర కూర్చుని మరోసారి ఆయన అభిప్రాయం తెలుసుకున్నాడు మధుసూదన్. ఓ రెండు నిమిషాలు ఆలోచించి-

"చూడండి మామగారూ! అబ్బాయి హైదరాబాద్‌లోనే వున్నాడుగానీ అరేబియాలోనో, ఆఫ్రికాలోనో లేడుకదా! మీకున్న అనుమానమంతా 'ఆ అబ్బాయి పెళ్లిచూపులకి ఎందుకు రావడంలేదు?' అని. అంతేనా?" అన్నాడు.

"అంతేబాబూ! ఎంతగొప్ప సంబంధం అయినా అబ్బాయిని చూడకుండా ఎలా

చెప్పు?" అన్నారు తిలక్‌గారు సందేహిస్తూ.

"మీరా సంగతి నాకు వదిలేయండి. హైదరాబాద్‌లో నాకు తెలిసినవాళ్లున్నారు. మా చిన్నన్నయ్య వున్నాడు. ఇంకా బోలెడంత మంది స్నేహితులున్నారు. ఎవరో ఒకరు అతని వివరాలు కనుక్కోకపోరు. మీరంతగా కాదంటే నేనే స్వయంగా వెళ్ళి చూసివస్తాను. మీరు వాళ్ళని రమ్మని కబురు చేయండి. నేనీలోపల అబ్బాయి వివరాలు తెప్పించేస్తాను. మీరేమాత్రం సంశయించద్దు" అన్నాడు మధుసూదన్.

అతని ఆలోచన దివ్యంగా వుందనిపించింది తిలక్‌గారికి.

"సరే అయితే రామశాస్త్రిగారూ! ఆ రోజుకి వాళ్ళని రమ్మని తెలియబర్చండి" అన్నారు తిలక్‌గారు.

అక్కణ్నించిలేచి తిన్నగా స్వర్ణలత గదిలోకి వెళ్లాడు మధు. హోరాహోరీ అక్కతో పోట్లాడుతోంది.

"ఓంశాంతి...శాంతి..శాంతి...ఏమిటది మరదలా" అన్నాడు నవ్వుతూ.

"చూడండి బావగారూ! అంతగొప్ప సంబంధం, ఇంతగొప్ప సంబంధం అని పొగుడుతోంది అక్క. బోలెడు తోటలూ,పొలాలూవున్నాయిట. ఎందుకు? పడి దొర్లడానికా? పెద్ద ఉద్యోగం చేస్తున్నాట్ట! ఏమో ఎవరికి తెలుసు? అదే అణాకానీ ఉద్యోగమో! అసలన్నీ వున్న వాడైతే, ఏ లోపమూలేని వాడైతే పెళ్ళి చూపులకి ఎందుకురాడు? ఏదో తిరకాసుంది. నేను చేసుకోను" అంది స్వర్ణలత, ఆవేశంతో ముఖం అంతా ఎర్రబడిపోగా.

"ఏడిశావులే. పెద్ద పండితురాలివి బయల్దేరావు. నీకే అన్నీ తెలుసు. మాకు ఎవ్వరికీ ఏమీ తెలీదు. నీ బాగోగులు మాకంటే నీకెక్కువ తెలుసా? ఇప్పటికే నీకు మగరాయుడు, పొగరుబోతు, మొండిశిఖండి అని బిరుదులొచ్చి మంచి సంబంధం ఒక్కటి రావడంలేదు. ఇక మన చదువు సరేసరి. పోనీ డిగ్రీ అయినా ఏడిసిందా అంటే అదీ లేదు. ఏదో పెద్ద అన్ని క్వాలిఫికేషన్లూ ఉన్నదానిలా వంకలు పెడుతోంది" అంది హేమలత కోపంగా.

ఉక్రోషం ముంచుకొచ్చింది స్వర్ణకు. కళ్ళనీళ్ళు తిరిగాయి. ముక్కు ఎగబీలుస్తూ "చూశారా చూశారా బావగారూ! దానిమాటలు ఎలా అంటోందో. నాకు డిగ్రీ లేదుట. అందుకే నాకు సంబంధాలు రావడం లేదుట. నీకుందిలే మాలావు డిగ్రీ, బోడి బి.ఎ. అదయితే నేనూ ఫస్టు క్లాసులో పాసయ్యేదాన్నే. నాది రాయల్ బి.యస్‌సి. ఆ ప్రాక్టికల్సూ అవీ ఎంత కష్టం. ఇక నీకెన్ని మంచి సంబంధాలు వచ్చాయమ్మా! ఆ నైలాన్ తాడు పుచ్చుకుని బావగారు రాకుండావుంటే తెలిసేది నీకెంత గొప్ప సంబంధం వచ్చేదో!"

"నోర్ముయ్! వెధవ వాగుడూ నువ్వూనూ. నాకోసం కాబట్టి మీ బావ వచ్చారు. నీకదీ లేదు. నిన్ను చూసి మనుషులు పారిపోతున్నారు"

పరిస్థితి విషమించడం గమనించి జేబులోంచి తెల్ల రుమాలు తీసి ఇద్దరి మధ్యా నిలబడి "లతలూ శాంతి...శాంతి" అంటూ ఊపాడు మధుసూదన్.

ఏమనుకున్నారో ఇద్దరూ శాంతించారు.

"చూడు స్వర్ణా! కాస్త నా మాట విను. వాళ్లని రానీ. ఈ లోపల అతని వివరాలు తెప్పిస్తాను. వాళ్లకి నువ్వు నచ్చితే, పెళ్ళిదాకా వస్తే నిన్ను తీసుకుని మీ

అక్కా, నేను హైదరాబాద్ వెళ్ళే ప్రోగ్రాం వేస్తాం. ఎలాగోలా పెళ్ళికి ముందే నువ్వతన్ని చూసే ఏర్పాటుచేస్తాను సరేనా! ఇప్పటికి ఒప్పుకో. ఏం హేమా! అలా అయితే బావుంటుంది కదూ!" అన్నాడు ఇద్దరికీ తన ఆలోచన చెబుతూ.

హేమలత వెంటనే "మీ ఆలోచన అమోఘం" అంది. స్వర్ణలత కూడా మెత్తబడింది.

"అయితే బావగారూ! మరో షరతు. కట్నం ఇవ్వడానికి వీల్లేదు. నాకెంత మాత్రం ఇష్టం లేదు" అంది ఖచ్చితంగా.

గతుక్కుమన్నాడు మధుసూదన్. ఇది కాస్త ఇరకాటపు వ్యవహారమే. "సరే కానీలే చూద్దాం. అలాగే ప్రయత్నం చేద్దాం" అన్నాడు.

"ప్రయత్నం చేయడం కాదు జరిగి తీరాలి. అంతే" అంది స్వర్ణలత మరింత పట్టుగా.

హేమలతకి కోపం వచ్చింది. అయినా దిగమింగుకుని లేచి వెళ్ళి స్వర్ణలత పెళ్ళిచూపులకి ఒప్పుకుందన్నమాట చేర వేసింది.

"సరే, నేను వెళ్ళి వాళ్ళకీవార్త అంద జేస్తాను. అమ్మాయి పెళ్ళికి నాకు సంభావన బాగా ముట్టజెప్పాలి మరి" అని నవ్వుతూ వెళ్ళిపోయాడు రామశాస్త్రి.

తిలక్‌గారి కబురందుకుని పెళ్ళి చూపుల ప్రయాణానికి సిద్ధమయింది పరంధామయ్య కుటుంబం. సూర్యం, కామేశ్వరి వచ్చేశారు. తీరా బయల్దేరే టైముకి పరంధామయ్యకి జ్వరంవచ్చింది. ప్రయాణం వాయిదా వేద్దామా అనుకున్నారు. ఆయన ఒప్పుకోలేదు:

"మీరంతా వెళ్ళండి" అన్నాడు. మాణిక్యాంబ తనూ వెళ్ళననేసింది.

నలుగురూ బయల్దేరారు. అన్నపూర్ణ సినిమా కబుర్లు, భాస్కర్రావు పేకాట కబుర్లు, సూర్యం చేసే తమాషాలతో సరదాగా గడిచింది టాక్సీ ప్రయాణం. ఊరు చేరగానే—

"అన్నయ్యా! ఏదైనా హోటల్‌కి వెళ్ళి కాస్త మొహాలు కడుక్కుని వెళ్దాం" అంది కామేశ్వరి.

"ఎందుకు దండగ. అసలు పెళ్ళికొడుకు ఎలాగూ రాలేదు. మనం అందంగా వుంటే ఏం, లేకపోతే ఏం?" అన్నాడు భాస్కర్రావు.

"కాదులేరా! ఇపుడు తతంగం అంతా మన అందచందాల మీదే ఆధారపడి వుంది" అన్నాడు సూర్యం.

సరేనని అందరూ దిగి లోపలికి వెళ్ళి మొహాలు కడుక్కున్నారు. అన్నపూర్ణ, కామేశ్వరి జడలు వేసుకుని తమతో తెచ్చుకున్నపట్టుచీరలు మార్చుకొన్నారు.

"అన్యాయం, మోసం. మాకు వేరే బట్టలు తేలేదు" అంటూ దెబ్బలాడారు సూర్యం, భాస్కర్రావు.

ఒక అరగంట రెస్ట్ తీసుకుని సాయంత్రం నాలుగింటికి పెళ్ళివారింటికి చేరుకున్నారు, పేరిశాస్త్రి చెప్పిన గుర్తుల సాయంతో.

కారు ఆగగానే పరుగెత్తుకు వచ్చారందరూ. పేరిశాస్త్రి అక్కడే వున్నాడు. "పరంధామయ్యగారు రాలేదా?" అనడిగాడు. రాలేదంటూ కారణం చెప్పాడు సూర్యం.

ఆ నలుగురినీ తిలక్ గారికి పరిచయం చేశాడు పేరిశాస్త్రి. 'చూడముచ్చటగా వున్నారు నలుగురూ' అనుకుంది రుక్మిణమ్మ.

కాఫీ ఫలహారాలు అయ్యాయి. మధుసూదన్ మంచి కంపెనీ ఇస్తున్నాడు అందరికీ.

తిలక్‌గారికి తృప్తిగానూ వుంది; అంతలోనే ఏదో అసంతృప్తిగానూ వుంది. మధుసూదన్ చిన్నన్నయ్య దగ్గరికి పంపిన వ్యక్తి తిరిగి వచ్చాడు.

'ఆ అబ్బాయి వివరాలు కనుక్కున్నాననీ, అందరూ చాలా మంచివాడని చెప్పారనీ, వాళ్లు చెప్పిన వివరాలన్నీ నిజమేననీ, అయితే అతను టూర్‌లో వుండడం వల్ల మనిషిని చూడలేదనీ, చూడగానే తెలియజేస్తాననీ ఉత్తరం రాసి పంపాడు.

తృప్తిపడ్డారు తిలక్‌గారు. ఇపుడు ఎదురుగా మన్మధుడిలా వున్న అతని అన్నగారు, దర్జాగా వున్న బావగారు, బంగారు బొమ్మల్లా వున్న వదిన, అక్కా వున్నా అతనెలా వుంటాడో చూచాయగా తెలిసిపోతున్నా, అతనెందుకు రాలేదన్న సందేహం మాత్రం ఓ మూల పీడిస్తూనే వుందాయన్ని. కానీ అదేమాత్రం బైట పడకుండా ఎంతో మర్యాదగా మాట్లాడుతున్నారు.

మరో పది నిమిషాలు అయ్యాక స్వర్ణని తీసుకొచ్చింది హేమలత. మెరూన్ కలర్ మీద జరీ ఎంబ్రాయిడరీ చేసిన అమెరికన్ జార్జెట్ చీర, అదేరంగు జాకెట్టు, వాలుజడ, మల్లెపూలు, మెడలో ఒంటిపేట గొలుసు. చేతినిండా కెంపు రంగు గాజులు, రెండోచేతికి వాచీ చూడ ముచ్చటగా వుంది.

మామూలుగా తివాచీ మీద కూర్చోబెట్టబోయింది హేమలత. భాస్కర్రావుకి చాలా తప్పుగా అనిపించింది. అతనెపుడూ పెళ్ళిచూపులకి వెళ్ళలేదు. ఇదే మొదలు. అందరూ కుర్చీల్లో, సోఫాల్లో కూర్చోగా ఆ అమ్మాయిని ఒక్కదాన్నీ కింద తివాచి మీద కూర్చోబెట్టటం చాలా అన్యాయం అనిపించింది. అందుకని–

"అదేమిటి! ఆ అమ్మాయినలా కింద కూర్చోబెడతారేం? సోఫాలో కూర్చోమనండి" అన్నాడు భాస్కర్రావు.

వెంటనే తలెత్తి చూసింది స్వర్ణ. 'సంస్కారం పూర్తిగా నశించిపోలేదు. ఇంకా ఇలాంటివాళ్ళలో మిగిలేవుంది' అనుకుంది మనసులో. మెల్లిగా వెళ్ళి అన్నపూర్ణ పక్కన సోఫాలో కూర్చుంది. పరీక్షగా చూసింది అన్నపూర్ణ. 'అచ్చు రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్‌లో జయప్రదలా వుంది, అనుకుంది.

"నీ పేరేమిటమ్మా?" అంది తృప్తిగా స్వర్ణలతని చూస్తూ కామేశ్వరి.

"స్వర్ణలత" అంది మెల్లిగా. 'పేరుకు తగ్గట్టే వున్నావు' అనుకుంది కామేశ్వరి.

కాసేపు మౌనంగా కూర్చుని తలఎత్తి బావగారిని చూసింది స్వర్ణ. ఈ చూపులు గ్రహించుకుని గొంతు సవరించుకున్నాడు మధుసూదన్.

"చూడు స్వర్ణా! ఈయన భాస్కరరావుగారు. ఆనందరావుగారి అన్నగారన్నమాట" అన్నాడు.

ఆయన్ని చూసింది స్వర్ణ. 'అగ్నిపరీక్ష' నవల్లో విష్ణువర్ధన్‌లాగా వున్నాడనుకుంది.

"ఈయన సూర్యనారాయణమూర్తి. ఆనందరావుగారి బావగారు. అంతేకాదు సాక్షాత్తు మేనమామ కూడా" అన్నాడు మధు నవ్వుతూ.

మెల్లిగా తలెత్తి చూసి చిరునవ్వు నవ్వింది స్వర్ణ. తనూ ఆప్యాయంగా నవ్వాడు సూర్యం. 'అపస్వరం' నవల్లో

శ్యాములాగా వున్నాడనుకుంది స్వర్ణలత.

"ఇక నీ పక్కన కూర్చున్నావిడ ఆనందరావు వదినగారు. ఆవిడ పక్కన ఆయన అక్కగారు" అన్నాడు మధు.

చిన్నగా నవ్వింది స్వర్ణలత. మరో పావుగంట సేపు అలాగే కూర్చుని లేచి లోపలికి వెళ్ళింది స్వర్ణలత.

పెళ్ళి కూతురు భాస్కర్రావుకి నచ్చింది. తన తమ్ముడికి అక్షరాలా తగినట్లే వుందనుకుని తనతో తెచ్చిన ఫొటోలు తీసి "ఇదిగోండి మా తమ్ముడి ఫొటోలు" అంటూ అందించాడు.

వెంటనే అందుకుని చూశారు తిలక్ గారు. మరుక్షణం తృప్తితో ఆయన గుండెలు ఉప్పొంగాయి. మధుకి చూపించాడు. చూసీచూడగానే హుషారుగా చిన్నగా ఈల వేశాడు మధుసూదన్.

భాస్కర్రావు నవ్వుకున్నాడు. "పూర్ణా! ఫొటోలు తీసికెళ్ళి ఆ అమ్మాయికి చూపించు" అన్నాడు.

మధు ఫొటోలు అన్నపూర్ణ చేతికి అందించాడు. అందుకుని లేచింది అన్నపూర్ణ. కామేశ్వరి కూడా లేచింది. ఇద్దరూ లోపలికి వెళ్ళారు.

రుక్మిణమ్మ "రండమ్మా!" అంటూ పిలిచింది.

"మా మరిది ఫొటోలు" అంటూ అందించింది అన్నపూర్ణ.

రుక్మిణమ్మ ఫొటోలు చూసి బంగారు తండ్రిలా వున్నాడని తృప్తిపడి "హేమా! అమ్మాయివాళ్ళని గదిలోకి తీసుకెళ్ళు" అని కేక పెట్టింది.

కొడుక్కి పాలుపడుతున్న హేమ వెంటనే వచ్చింది. 'రండి' అంటూ తమ గదిలోకి తీసుకెళ్ళింది.

"ఇదిగో మా తమ్ముడి ఫొటోలు" అని హేమకి చూపించింది కామేశ్వరి.

హాయిగా నవ్వింది హేమలత. "మీరు ముగ్గురూ చాలా చక్కటివాళ్ళు. మీ అమ్మ, నాన్నగారు చాలా బాగుంటారు కాబోలు" అంది నవ్వుతూ.

మంచంమీద కూర్చుని వున్న స్వర్ణలత ఆ ఫొటోల వంకే అసహనంగా చూస్తోంది. తనకు చూపించరేం అనుకుంటోంది చిరాకుగా. హేమలత చేతిలోని ఫొటోలు తీసుకుని స్వర్ణలతవైపు నడిచింది అన్నపూర్ణ.

"ఇవిగో మీరు చూస్తారని తీసుకు వచ్చాం" అంటూ అందించింది. మొహమాటంగా, సిగ్గుగా అనిపించింది స్వర్ణలతకి. ఫొటోలు తీసుకుని మెల్లిగా కిటికీ దగ్గరికి వెళ్ళి పూర్ణవైపు వీపుపెట్టి కళ్ళారా ఫొటో చూసింది. గుండె ఝల్లుమంది. బుగ్గలు ఎర్రబడి పోయాయి. ఒళ్ళంతా పులకించిపోయింది.

'ఎవరు? ఎవరితను? ఎవరిలా వున్నాడు? ఏ హీరోతో పోల్చాలి? కాదు ఏ హీరోకీ ఇంత అందంలేదు. ఎవరూ ఇంత బావుండరు. ఆ ఠీవి, ఆ రాజసం, ఆ నిర్లక్ష్యం, అందులోనే కొంటెతనం... మరి ఇంత అందగాడికి తను నచ్చుతుందా?'

భరించరాని దిగులు ముంచుకు వచ్చింది స్వర్ణలతకి. 'పెళ్ళిచూపులకి ఇతనొస్తే ఎంత బావుండేది!' వెనకనుండి భుజంమీద చెయ్యి పడ్డంతో ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది స్వర్ణలత.

"చూశారా మా మరిది ఫొటోలు?" అంది అన్నపూర్ణ.

అంతలోనే రుక్మిణమ్మ వచ్చి "ఇలా ఇవ్వు స్వర్ణా! నాయనమ్మ చూస్తుందిట"

అంటూ ఫొటోలు తీసుకెళ్ళింది.

తన ప్రాణాలు ఎవరో తీసుకుపోతున్నట్టు అనిపించింది స్వర్ణలతకి. దీనంగా చూసింది. స్వర్ణలతని చూసి లోలోపలే నవ్వుకుంది అన్నపూర్ణ. ఆ అమ్మాయిని ఒంటరిగా వదిలేయడం మంచిదనిపించి అక్కడనుండి కదిలి కామేశ్వరి పక్కన కూర్చుంది అన్నపూర్ణ.

సూటిగా, పరీక్షగా అన్నపూర్ణనే చూస్తోంది స్వర్ణలత. 'ఎంత అందంగా వుందీవిడ! ఎంత అదృష్టవంతురాలు. అవునుమరి ఎంత అదృష్టం లేకపోతే ఆ ఇంటికి కోడలు కాగలదు! మరి తనకా అదృష్టం వుందో లేదో! వీళ్ళెవరూ తననేమీ అడగలేదేం? అందరూ మౌనంగా వుండిపోయారేం? ఏమిటి దానర్థం? తను వాళ్ళకి నచ్చలేదా? వీళ్ళ ముగ్గురికీ పెళ్ళిళ్ళయిపోయాయి. ముగ్గురికీ చక్కటి భర్తలు. అలా ఆలోచిస్తున్నకొద్దీ దిగులు, బాధ ఎక్కువవడంతో తనూ వాళ్ళతో మాటలు కలిపింది.

"మీరేం చదువుకున్నారు?" మెల్లిగా అన్నపూర్ణని అడిగింది.

"నేనా? బి.ఎ. పాసయ్యాను" అంది అన్నపూర్ణ స్నేహపూర్వకంగా నవ్వుతూ.

స్వర్ణ గుండె నీరైపోయింది. 'ఈవిడ గ్రాడ్యుయేట్. పెద్ద కోడల్ని గ్రాడ్యుయేటని తెచ్చుకున్నవాళ్ళు చిన్న కోడలికి డిగ్రీ లేకపోతే ఒప్పుకుంటారా? తన మీద తనకే కోపం వస్తోంది. వెధవది ఇంకాస్త బాగా చదివి పరీక్షలు పాసై వుండాల్సింది' అనుకుంది బాధగా.

స్వర్ణలత వైపే చూస్తున్న కామేశ్వరి అందుకుంది. "అంతేకాదు స్వర్ణా! వదిన చాలా బాగా పాడుతుంది" అంది నవ్వుతూ.

"నిజంగానా! మా ఇంట్లో అందరికీ సంగీతం అంటే చాలాయిష్టం. మా నాన్నగారికి మరీ ఇష్టం. మాకు సంగీతం నేర్పించాలని ఎంతో ప్రయత్నించారుగానీ మా ఇద్దరికీ వంటబట్టలేదు. అన్నపూర్ణగారూ! మీకు అభ్యంతరం లేకపోతే ఒక పాట పాడరూ..." అంది హేమలత బతిమాలుతూ.

అన్నపూర్ణ మొహమాట పడిపోయింది. కామేశ్వరి బలవంత పెట్టేసింది.

"పాడు వదినా! ఇంట్లో పొద్దస్తమానం పాడుతూనే వుంటావుగా అన్నయ్య చెవిలో" అంది హాస్యంగా.

"ప్లీజ్ పాడండి" అంది హేమలత.

స్వర్ణలత గుండె మరింత దిగజారిపోయింది. 'అయితే ఈవిడ పాటలు కూడా పాడుతుందా' అనుకుని—

"పాడండి నాకూ వినాలని వుంది" అంది.

తలెత్తి స్వర్ణలత వంక చూసింది అన్నపూర్ణ. దైవం దయదలిస్తే ఈ అమ్మాయి తన తోడికోడలవుతుంది. చిన్నపిల్ల అడిగితే కాదనడానికి మనసు ఒప్పలేదు. "అలాగే పాడతాను" అంది నవ్వుతూ.

"ఒక్క క్షణం ఆగండి. అమ్మను పిలుస్తాను" అంటూ పరుగున వెళ్ళి రుక్మిణమ్మను, నాయనమ్మను తీసుకొచ్చింది హేమలత.

గొంతు సవరించుకుని "నగుమోము గనలేని..." త్యాగరాజకృతి మొదలు పెట్టింది అన్నపూర్ణ.

పక్కన హాల్లో కూర్చుని మాటలు చెప్పుకుంటున్న మగవాళ్ళ కబుర్లాపేశారు. తిలక్‌గారు తన్మయంగా వింటూ—

"ఎవరుబాబూ ఆ పాడేది" అనడి

గాను.

సూర్యం నవ్వి "పిడి భార్య అన్నపూర్ణ" అన్నాడు.

"భాస్కర్రావుగారూ! నాకు శాస్త్రీయ సంగీతం అంటే చాలా ఇష్టం. చెవి కోసుకుంటాను. ఆ గదిలోకి వెళ్ళి విందామా?" అన్నాడు మధుసూదన్.

"అలాగే పదండి" అన్నాడు భాస్కర్రావు నవ్వుతూ.

అందరూ పక్క గదిలోకి వెళ్ళి అన్నపూర్ణ పాటను హాయిగా విన్నారు. అయిపోగానే చప్పట్లు కొట్టాడు మధుసూదన్.

"చాలా బాగుంది. థాంక్స్" అన్నాడు.

"మీకు పాటలు వచ్చా?" అనడిగాడు భాస్కర్రావు స్వర్ణలతని.

ఏడుపొచ్చింది స్వర్ణలతకి. తల వంచుకుని రావని తలాడించింది.

అందరూలేచి హాల్లోకి వెళ్ళిపోయారు. ఒంటరిగా వుండిపోయింది స్వర్ణలత. ఏదో దిగులు, దుఃఖం.

అమిత సంస్కారవంతుడు. ఆ భావగారి కాళ్ళమీద పడి 'నన్ను క్షమించండి. నాకు పాటలురావు. కానీ మీ తమ్ముడి భార్యగా అర్హురాలిని కానని అనకండి' అని వేడుకుంటే? 'అక్కా! నీ చెల్లెలి లాంటిదాన్ని. నన్ను నీ తోటికోడల్ని చేసుకో' అని అన్నపూర్ణని బతిమాలుకుంటే? ఏమీ చెయ్యలేక కిటికీదగ్గర కూలబడి హాస్యంలోకి చూస్తూ వుండిపోయింది స్వర్ణ.

మరి కాసేపు కూర్చున్నాక "మీ అమ్మాయి ఫొటో ఇవ్వండి మా తమ్ముడికి పంపుతాను. మీరు వచ్చి మా నాన్నగారితో మాట్లాడండి" అని చెప్పి లేచాడు భాస్కర్రావు. అందరూ మర్యాదగా సాగనంపారు.

టాక్సీ ఎక్కగానే సూర్యం ఒకటే నవ్వు. "ఇవేం పెళ్ళిచూపులురా బాబీ! మనమే మాట్లాడేసి మనమే పాటలుపాడేసి వచ్చాం. అసలివాళ బావ లేకపోబట్టి సరిపోయింది. లేకపోతే నీకూ, అన్నపూర్ణకీ, కామేశ్వరికీ అందరికీ చివాట్లు పడేవే" అన్నాడు సూర్యం.

"ఏమోరా! ఏం ప్రశ్నలు వేస్తాం కొత్త అమ్మాయిని? అసలు నేనెపుడూ పెళ్ళిచూపులు ఎలా వుంటాయో చూడలేదు" అన్నాడు భాస్కర్రావు.

"అన్నయ్యా! అపుడు నీ పెళ్ళిచూపులు నువు లేకుండానే అయిపోయాయి గానీ ఇవాళ ఆ లోటు తీరిపోయింది. వదిన పాటలు పాడ్డం, నువ్వు కన్నార్పకుండా తననే చూస్తూ కూర్చోవడం, నీ పెళ్ళిచూపుల్లాగే వుంది" అంది కామేశ్వరి నవ్వుతూ.

"ఫో!...కొంటెపిల్లా! మరి నీ పెళ్ళి

చూపులు ఎప్పుడు ఎలా అయ్యాయో చెప్పు వింటాను" అంది అన్నపూర్ణ.

"నేను చెప్పనా అన్నపూర్ణా?" అన్నాడు సూర్యం.

"చెప్పండి అన్నయ్యగారూ!" అంది అన్నపూర్ణ.

"నేను స్కూలునుంచి రాగానే అక్కయ్యకి ఆడపిల్ల పుట్టింది. 'నీకు పెళ్లాం రా' అంటూ తీసుకెళ్లి చూపించింది మా అమ్మ. అపుడు చూశాను. చక్కగా చాటలో పడుకుని వుంది" అన్నాడు సూర్యం.

అన్నపూర్ణ, భాస్కర్రావు పెద్దగా నవ్వేశారు. కామేశ్వరి మూతి ముడుచుకుంది.

"కామేశ్వరీ! ఇంతకీ పెళ్లికూతురెలా వుందో చెప్పలేదేం నువ్వు?" అన్నాడు భాస్కర్రావు.

"చాలా బాగుందన్నయ్యా! నాకైతే ఎంతో నచ్చింది. ఏవండీ మీకు?" అంది భర్తని.

"నాకూ నచ్చింది. అక్షరాలా ఆనందుకి తగ్గట్టుంది" అన్నాడు సూర్యం.

"నాకూ నచ్చింది. వాళ్ళ కుటుంబం, వాళ్ళ ప్రవర్తన అన్నీ ఎంతో బావున్నాయి. ఏం పూర్ణా నీకో?" అనడిగాడు భాస్కర్రావు.

"చాలా బాగుందండీ! అచ్చు రాజేశ్వరీ విలాస్ కాఫీక్లబ్‌లో జయప్రదలా వుంది" అంది అన్నపూర్ణ.

వెంటనే మొహం తిప్పుకుని కిటికీలోంచి బయటకి చూడసాగాడు భాస్కర్. బావమరిదిని ఏడిపించబుద్దేసింది సూర్యానికి.

"అన్నపూర్ణా! నేనూ, కామేశ్వరీ చూశాం ఆ సినిమా. ఈ బావిగాడే చూడలేదు. మిస్సయ్యాడు. మంచి పిక్చరు" అన్నాడు జాలిగా.

నమిలి మింగేసేలా చూస్తున్నాడు భాస్కర్రావు. అయినా లెక్కచెయ్యలేదు సూర్యం.

అంతమంచి సినిమా మిస్సయిన భర్త మీద హఠాత్తుగా జాలేసింది అన్నపూర్ణకి.

"దానికేంభాగ్యం. నేచెబుతా వినండి. తారాగణం కృష్ణ, జగ్గయ్య..." అంటూ మొదలుపెట్టింది.

సూర్యం భాస్కర్రావువేపు అల్లరిగా చూసి ముందుకి తిరిగిపోయాడు. పక్కనే వున్న భార్య భుజం మీదుగా చెయ్యివేసి—

"కామేశ్వరీ! ఇక మనిద్దరం హాయిగా కబుర్లు చెప్పుకోవచ్చు. మీ అన్నయ్య మరో మూడుగంటల దాకా బిజీ" అన్నాడు నవ్వుతూ.

వెనక్కి చూసింది కామేశ్వరి. అన్నపూర్ణ పూర్తిగా కథలో లీనం అయిపోయింది. భాస్కర్రావు సీటుమీద వెనక్కివాలి కళ్ళు మూసుకుని కూర్చుని ఉన్నాడు. నవ్వు ముంచుకువచ్చింది కామేశ్వరికి. 'అబ్బ ఈ వదినకి ఇదేం పిచ్చి' అనుకుంది.

అన్నపూర్ణ కథ ముగిసిన కాసేపటికే ఊళ్ళోకి వచ్చేసింది టాక్సీ. ఇంటికి చేరగానే పరంధామయ్యకి అన్నీ విపులంగా చెప్పారు. పిల్లను వర్ణించి చెప్పి ఫొటో చూపించారు పరంధామయ్యకు, మాణిక్యాంబకు తృప్తిగానే ఉంది.

ఆ మధ్యాహ్నమే తమ్ముడికి ఫొటో పంపుతూ ఉత్తరం రాశాడు భాస్కర్రావు. సూర్యంకూడా 'చక్కటిపిల్ల,మంచి వంశం, మంచిసంప్రదాయం.మా అందరికీ నచ్చింది. వాళ్ళు వచ్చి మాట్లాడాక ముహూర్తం

నిర్ణయమవుతుంది. నీకేమైనా అభ్యంతరం ఉంటే వెంటనే తెలియబర్చు. వీలైతే నువ్వోసారి రా. ఇంట్లో నాలుగు రోజు లున్నట్లుంటుంది. వెళ్ళి ఆ అమ్మాయిని చూసిరావచ్చు' అంటూ రాశాడు.



## 5

ఆనందరావుకి ఉత్తరం అందింది. 'అయిపోయింది...సర్వనాశనం అయిపోయింది. సోనీ... నేను అసమర్థుణ్ణి. నువ్వు అంతగా వేడుకున్నా నిన్ను నా స్వంతం చేసుకోలేని చేతకానివాడిని. నన్ను క్షమించగలవా? ఇప్పటికైనా నా ఎదుటికి రా, నిన్ను నాదాన్ని చేసుకుంటాను. అవసరం అయితే ఎవరికీ కనిపించకుండా ఎటైనా పారిపోదాం' అనుకున్నాడు.

చేతిలోని ఫొటో చూడగానే భరించలేనంత కంపరం వేసింది. అతని కళ్ళ ముందు సోనీ చూపించిన బంగారు స్వప్నం పునాదులతో కదలిపోతూ కనిపించింది. అన్ని తియ్యని అనుభూతులూ చెదిరిపోతున్నాయి.

ఇక మామూలు పెళ్ళి. ఆ స్వర్ణలతా దేవితో గంగిరెద్దు జీవితం. పెళ్ళయ్యాక అన్నయ్యలాగా సినిమా కథలు వినాలో, మామయ్యలాగ చీరలు, నగలు అంటూ పరుగులు పెట్టాలో! భరించలేనంత దిగులు వేసింది ఆనందరావుకి. ఆ ఫొటోని చింపి అవతల పారేశాడు కసిగా. బాధగా చేతుల్లో ముఖం దాచుకుని ఉండిపోయాడు.

అక్కడ ఆనందరావు అలా ఉంటే ఇక్కడ మరింత దిగులుగా కాలం గడుపుతోంది స్వర్ణ. ఇదివరకులా కలలు రావడంలేదు. అక్కతో పోట్లాడ్డంలేదు. నవలలు చదవటంలేదు. 'ఇక రెండు మూడు రోజుల్లో వాళ్ళింటికెళ్తారు నాన్నగారు. ఏమంటారో వాళ్ళు. అతను ఇష్టపడ్డాడో లేదో? ఈ పెళ్ళి జరుగుతుందో లేదో?' కళ్ళు నీళ్ళు కారిపోయాయి స్వర్ణకి. కళ్ళు తుడుచుకుని చేతులు జోడించి 'స్వామీ! ఎలాగైనా ఈ పెళ్ళి జరిగితే కాలినడకన నీ కొండకి వస్తాను' అని ఏడుకొండలవాడికి మొక్కుకుంది.

అనుకున్న ప్రకారం ముందుగా తెలియబర్చి, రామశాస్త్రిని వెంటబెట్టుకుని తిలక్ గారు పరంధామయ్యగారింటికి వచ్చారు. వస్తూ వస్తూ ఊళ్ళో ఆయనకు గల పేరు ప్రతిష్ఠల్ని తెల్సుకుని, ఇంటిని చూసి తృప్తిగా నిట్టూర్చి లోపలికి వెళ్ళారు.

పరంధామయ్య లేచి నిలబడి "రండి రండి" అని ఆహ్వానించారు.

ఆయన చేతులు పట్టుకుని "మీలాంటి గొప్పవారితో, పెద్దవారితో వియ్యం పొందే అదృష్టం కలగడం నా పూర్వజన్మ పుణ్యం" అన్నారు తిలక్.

పరంధామయ్యకి మహా సంతోషం వేసింది. "దానిదేముందిలెండి. సమాన వియ్యం. మీరు మాత్రం తక్కువవారా?" అన్నాడు.

"పరంధామయ్యగారూ! మీరు అన్నీ తెలిసినవారు. ఎంతో అనుభవజ్ఞులు. మీకు వేరే చెప్పే అవసరంలేదు. నాకు ఓ చిన్న

ఇబ్బంది ఉంది. మీకు చెప్పుకోవాలనుకుంటున్నాను" అన్నారు తిలక్.

"ఏమిటో చెప్పండి"

"చూడండి! నాకు ఇద్దరే కూతుళ్ళు. నాకున్నదంతా వాళ్ళదే. మా పెద్దమ్మాయికి నేను కట్నం అంటూ ఏమీ ఇవ్వలేదు. మా అల్లుడు కట్నంపద్దని పట్టుబట్టి చేసుకున్నాడు. అలా అని నేను ఊరుకోలేదనుకోండి – వాళ్ళ సంసారానికి కావల్సినవన్నీ ఇచ్చాను. లాంఛనాలు జరిపాను. పెళ్ళి నాకు తోచినంతలో బాగానే చేశాను. అది చూసి మా చిన్నమ్మాయి తనకూ కట్నం ఇవ్వద్దని బతిమాలుకుంటోంది. ఏం చెయ్యాలో నాకు తోచడం లేదు. కట్నం అని డబ్బుగా కాకుండా మీరు ఏది అడిగినా ఇవ్వడానికి సిద్ధమే నేను" అన్నారు.

పరంధామయ్య ఒక్క క్షణం ఆలోచించాడు. మెల్లిగా లేచి లోపలకి వెళ్ళాడు. ఆయన వెంట సూర్యం, భాస్కర్రావు కూడా లోపలికి వెళ్ళారు. ముందు అల్లుడిని అడిగాడు మెల్లిగా—

"ఏం సూర్యం ఏమంటావు?"

"ఇందులో ఏమనడానికైనా ఏముంది బావగారూ? అమ్మాయి బావుంది. ఆయన కట్నం తప్ప అన్నీ ఇస్తాననే అంటున్నాడు. సరేనసండి" అన్నాడు సూర్యం.

వెంటనే కొడుకుని దగ్గరికి పిల్చి "ఏరా బాబూ! నువ్వేమంటావు?" అనడిగారు.

తండ్రి అంత ఆదరంగా మాట్లాడేసరికి నిలువునా పులకించిపోయాడు. హీరోలా—"చూడండి నాన్నగారూ! ఆట బతికిన తర్వాత రెండు ట్రిప్లెట్లూ, రెండు సీక్వెన్సులూ అయితేనేం? మూడు సీక్వెన్సులూ, ఒక ట్రిప్లెట్టూ అయితేనేం? ఇది మరీ మంచిది. ఊ అనెయ్యండి" అన్నాడు భాస్కర్రావు హుషారుగా.

సూటిగా కొడుకు ముఖంలోకి చూశాడు పరంధామయ్య. ఆయనకి కొడుకు మాట్లాడిన భాష కాస్త గందరగోళంగా వుంది.

"ఒరే బాబీ! ఆట గెలవడం, ఓడడం విన్నాను గానీ బతకడం, చావడం నేను ఎక్కడా వినలేదురా! ఏమిటది?" అన్నాడు.

గతుక్కుమన్నాడు భాస్కర్రావు. నాలిక్కరుచుకుని నెత్తి గోక్కుని నానా అవస్థపడిపోయాడు. వెంటనే సూర్యం అందుకున్నాడు—

"వాడి మొహం లెండి బావగారూ! తెలుగుదేశం వదిలేశాక వాడి తెలుగు అలా తగలబడింది" అన్నాడు.

పరంధామయ్యకి నవ్వు వచ్చింది. నవ్వుతూనే లోపలికి వెళ్ళి భార్య అభిప్రాయం కూడా తెలుసుకుని ప్రసన్నంగా బైటకి వచ్చాడు.

"మీ ఇష్టప్రకారమే కానివ్వండి" అన్నాడు తిలక్‌తో.

తిలక్‌గారి సంతోషం వర్ణనాతీతం. చేతులు పట్టుకుని కృతజ్ఞత తెలుపుకున్నారు. తను ఇవ్వదల్చుకున్న వాటి జాబితా చదివేశారు. ఇవి గాక ఇంకా కావాలంటే అడగమన్నారు. హఠాత్తుగా—

"అన్నట్లు మరిచేపోయాను, మీ అమ్మాయిని ఇటు రమ్మనండి" అన్నారు.

"ఎందుకు?" అన్నాడు పరంధామయ్య.

"ఏం లేదులెండి! ఒక్కసారి రమ్మనండి" అన్నాడు మళ్ళీ

భాస్కర్రావు వెళ్ళి చెల్లెల్ని పిల్చుకు వచ్చాడు.

"రామ్మా! అలా కూర్చో. నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలని పిల్చానమ్మా. మా పెద్దమ్మడు పెళ్ళికి అతనికి ఇద్దరు అక్కచెల్లెళ్ళు. అందుకని వాళ్ళిద్దరికీ చెరో వెయ్యినూట పదహార్లు, స్టీలు పానకం బిందెలు, వెండి బొట్టుపెట్టెలు, పట్టు చీరలు ఇచ్చాము. ఈసారి నువ్వొక్కదానివే కాబట్టి నీకు వెయ్యి నూట పదహార్లు, నవర్సు బంగారం, స్టీలు పానకం బిందెలు, వెండి బొట్టు పెట్టె, రెండు పట్టు చీరలు గాక మరేదైనా వస్తువు రూపంలో ఇవ్వాలని అనుకుంటున్నారు మా ఇంట్లో. నీకేది కావాలంటే అదే ఇస్తాం చెప్పమ్మా!" అన్నారు తిలక్.

కామేశ్వరికి నోట మాట రాలేదు. 'ఏమిటి తనకే ఇన్ని లాంఛనాలు!' ఆనందబాష్పాలు వచ్చేశాయి. ఆడపడుచునన్న గర్వం వచ్చేసింది.

కామేశ్వరికి మొదట్నించి పుట్టింట మర్యాదలు ఘనంగా పొందాలన్న కోరిక. కానీ సూర్యం ఆ ఇంట్లో పిల్లవాడులాగ చనువుగా వుంటాడు కాబట్టి పండుగలకని ప్రత్యేకంగా తీసుకు రావడం, మర్యాదలు జరపడం అలవాటులేదు. అలా అని పెట్టిపోతలకి లోపం జరగదు.

ఇకపోతే భాస్కరరావు. అదో అయోమయం వ్యవహారం అతనిది. అతనే ఏ మర్యాదలూ ఎరగడు. అతని పెళ్ళి అన్నపూర్ణ తల్లి గుండె జబ్బు కారణంగా ఆదరాబాదరాగా జరిగింది. పెళ్ళి ఘనంగా చెయ్యాలని పరంధామయ్య గట్టిగా చెప్పడం వల్ల అన్నీ ఒక్కసారి సమకోవడం కష్టమని లాంఛనాలు, కట్నం అవీ కొంత వరకు వాయిదా వేశారు.

ఆ పైన ఏడాది ఇంటిల్లిపాదినీ పండక్కి తీసికెళ్ళి మిగిలిపోయిన మర్యాదలన్నీ జరిపారు. కానీ కామేశ్వరికి మాత్రం అసంతృప్తిగానే వుండేది. ఎంత తర్వాత ఇచ్చినా పెళ్ళిలో వాళ్లు ఇవ్వడం, తన వూళ్ళో తనకి తెల్సిన వారికి చూపించుకోడం ఆ తీరేవేరు, ఆ నిండుదనం వేరు అన్న ధోరణి కామేశ్వరిది.

ఆ తర్వాత భాస్కరరావు, అన్నపూర్ణ కూడా తమ అభిరుచి ఇంకొకరికి నచ్చుతుందో లేదోనని పండగైనా, మరే సందర్భమైనా డబ్బిచ్చి కామేశ్వరినే చీర కొనేసుకోమనేవారు.

అక్కడే కామేశ్వరికి చిరాకు వేసేది. 'ఏం తనకి లేదా వెధవ డబ్బు?' అని సణుక్కునేది.

మళ్ళీ ఆనందరావు ఈ విషయంలో చాలా మెరుగు. అక్కగారికి చాలా మర్యాదలు చేస్తాడు. అందుకే అతని పెళ్ళికి అతని ద్వారానే లాంఛనాలు రాబట్టాలి అనుకుంది. అతను పెళ్లిచూపులకి రాకపోయినా ఆడబోయిన తీర్థం ఎదురైనట్లు తిలక్‌గారే లాంఛనాల లిస్టు చదివేసేసరికి కామేశ్వరిని పరవశురాలిని చేసింది.

"ఎందుకు మావయ్యగారూ! ఇవన్నీ ఇస్తున్నారు. ఇంకా ఏం కావాలి నాకు?" అంది మురిసిపోతూ.

"అలా అనకమ్మా! ఏదో ఒకటి అడుగు" అంటూ బలవంతం చేశారు.

"మీ ఇష్టం" అనేసింది కామేశ్వరి.

భార్య ముఖంలోని మార్పును కనిపెట్టి లోలోపలే నవ్వుకున్నాడు సూర్యం.

మరికాసేపటికే ముహూర్తాలు కూడా నిశ్చయం చేసేశారు. వాళ్లిద్దరి జాతకాల ప్రకారం ఇరవై రోజుల్లో మంచి

ముహూర్తం ఉంది. అది దాటితే మరో మూడు నెలల వరకూ వీళ్ళకు సరిపోయే ముహూర్తాలు లేవు.

"ఏం పరంధామయ్యగారూ! ఏం చేస్తారు?" అన్నాడు రామశాస్త్రి.

"మాదేముంది? భోజనాలు చేసిపోయే వాళ్ళం. అన్నీ చూసుకోవాల్సిన వారు బావగారు. ఆయన ఇష్టం" అన్నాడు పరంధామయ్య.

నిజానికి ఇటు పరంధామయ్యగారికీ తొందరగానే వుంది. కొడుక్కి అంత మంచి పేరు లేదు పెళ్ళిచూపుల్లో. ఇది మంచి సంబంధం. మళ్ళీ ఏ చుప్పనాతి వాళ్ళో అడ్డుపడే లోపల ఆ శుభకార్యం జరిగిపోతేమేలు అనుకున్నాడు. అటు తిలక్‌గారికీ అలాగే వుంది. ఖర్మగాలి స్వర్ణలతకి పొగరుబోతు అనే పేరొచ్చింది. ఇది చూస్తే దివ్యమైన సంబంధం. ఏ పుణ్యాత్ముడో పుణ్యం కట్టుకునే లోపలే ఆ మూడుముళ్ళు వేయించేస్తే సరిపోతుందనుకున్నారు. అందుకనే—

"అదేంమాట బావగారూ! మీకు కావాలంటే రేపీపాటికి పెళ్ళి జరిపించేయగలను. 'శుభస్య శీఘ్రం' అన్నారు. ఈ ముహూర్తానికే కానిచ్చేయండి" అన్నారు తిలక్.

వెంటనే నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుని లగ్న పత్రిక రాసేసుకున్నాక వెళ్ళిపోయారు.

"నేనోసారి వూరికి వెళ్ళొస్తాను" అన్నాడు భాస్కర్రావు.

"ఏడిసినట్లుంది. ఇరవై రోజుల్లో పెళ్ళి పెట్టుకుని ఎపుడు వెళ్తావు? ఎపుడొస్తావు? వూరికే పనికిరాని ఆలోచనలు చెయ్యకు" అని కసిరాడు పరంధామయ్య.

సరేనని శలవు పొడిగించి స్నేహితులను తమ్ముడి పెళ్ళికి రమ్మని ఆహ్వానిస్తూ ఉత్తరం రాశాడు భాస్కర్రావు.

పెళ్ళి పనులు మొదలయ్యాయి. కామేశ్వరి పుట్టింట్లోనే వుండిపోయింది సూర్యం అటూ ఇటూ తిరుగుతూ కాలక్షేపం చేస్తున్నాడు.

* * *

తండ్రి పెండ్లి ముహూర్తం తెలియజేస్తూ రాసిన ఉత్తరం అందుకుని దీర్ఘంగా నిట్టూర్చాడు ఆనందరావు. బల్లమీద తల వంచుకుని కూర్చున్నాడు దిగులుగా. మార్గరెట్ లోపలికి వచ్చింది.

"సర్" అంది మెల్లిగా.

"ఎస్" అన్నాడు ఆనందరావు.

"అలా వున్నారేం?" అంది ఆదుర్దాగా.

"ఏం లేదు. నాకు మేరేజ్" అన్నాడు సూటిగా మార్గరెట్‌ని చూస్తూ.

వెంటనే సంతోషంతో ఆవిడ మొహం విప్పారింది.

"కంగ్రాట్స్ సర్! హార్టీ కంగ్రాచ్యులేషన్స్. ఎవరుసార్ ఆ లక్కీగర్ల్?

పేలవంగా నవ్వి వూరుకున్నాడు ఆనందరావు.

"సార్! మా కందరికీ మీ మారేజ్ తర్వాత గ్రాండ్‌గా పార్టీ ఇవ్వాలి. ముందు ఎడ్వాన్స్‌గా నాకు పార్టీ ఇవ్వాలి" అంది మార్గరెట్ చిన్నపిల్లలా సరదా పడుతూ.

"అలాగే...అలాగే" అన్నాడు నిర్లిప్తంగా.

వెంటనే చిరునవ్వు నవ్వుకుంటూ మార్గరెట్ వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళినవైపే చూసి దీర్ఘంగా నిట్టూర్చి 'అందరికీ సంతోషంగానే వుంది నాకు తప్ప' అనుకున్నాడు.

ఆ సాయంత్రం అంతా పిచ్చివాడిలాగా అటూ ఇటూ తిరిగాడు. మనసు గట్టి చేసుకుందుకు ప్రయత్నించాడు. తనకు తానే ధైర్యం చెప్పుకున్నాడు. రాత్రంతా కలత నిద్రపోయినా మర్నాడుదయం మామూలుగా ఆఫీసుకి వచ్చేశాడు.

పదకొండుగంటలకి ఆదుర్దాగా ఆనంద రావు గదిలోకి వచ్చింది మార్గరెట్.

"సార్! నేను వెంటనే వెళ్ళాలి. అర్జంట్" అంది.

చివాల్న తలెత్తి చూసి – "ఎనీథింగ్ రాంగ్?" అనడిగాడు.

"ఎస్ సర్! మా ఫ్రెండ్ సిస్టరు స్లీపింగ్ పిల్స్ మింగిందట. కండిషన్ సీరియస్‌గా వుందిట"

"అరే! ఎన్నేళ్ళమ్మాయి? ఎందుకిలా చేసింది?" అన్నాడు సానుభూతితో.

"ట్వంటీ ఇయర్స్ వుంటాయి సార్! ఏముంది లవ్ ఎఫైర్. ఈ అమ్మాయి లవ్ చేసింది. ఆ అబ్బాయి వేరే పెళ్లి చేసుకుంటున్నాడు" అంది మార్గరెట్.

అదిరిపడ్డాడు ఆనందరావు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి.

"మార్గరెట్! ఎవరా అమ్మాయి? ఎక్కడ వుంటుంది?" అన్నాడు వణికి పోతూ.

అంతులేని అతని ప్రశ్నలకి విసుగు వేస్తోంది మార్గరెట్‌కి.

"ప్లీజ్ సర్! మళ్ళీ వచ్చాక అన్నీ డిటైల్డ్‌గా చెప్తాను. ప్లీజ్ లెట్ మిగో" అంది బతిమాలుతూ.

"సరేపద. నేనూ వస్తాను" అంటూ లేచాడు ఆనందరావు.

ఇద్దరూ కిందకి వెళ్ళారు. రంగస్వామి ముందుకి వచ్చి కారు తలుపు తీశాడు.

"ఎస్... ఇపుడు చెప్పు. ఏమిటా అమ్మాయిపేరు?" అన్నాడు ఆనందరావు లోపల కూర్చుని కారు డోర్ వేస్తూ.

"సోఫియా" అంది మార్గరెట్.

"అన్నీ వివరంగా చెప్పు. ఎవరా అమ్మాయి? ఎక్కడుంటుంది? ఎవర్ని లవ్ చేసింది?" అన్నాడు గబగబా.

"మా సిస్టర్ ఫ్రెండ్. బి.ఎ పాసయి వర్క్ చేస్తోంది. ఆ అమ్మాయి లవ్ చేసింది మీ హిందూస్ అబ్బాయినే" అంది మార్గరెట్ రోడ్డువంక చూస్తూ.

గుండె దడదడా కొట్టుకుంది ఆనంద రావుకి.

"ఎవరు...ఎవరతను? నీకు తెలుసా?" అన్నాడు చెప్పలేనంత ఉద్వేగంతో.

"ఆ... తెలుసు సార్! మా ఇంటికి దగ్గర్లోనే వుంటాడు. చాలా రోజులు కలిసి తిరిగారు. తీరా ఇప్పుడు వాళ్లింట్లో వాళ్లు ఎగ్రీ అవలేదుట. అందుకని వేరే మారేజ్ చేసుకుంటున్నాడట. అయినా నాకు తెలీక అడుగుతున్నాను సార్! మేము కానా లంటే ఎవరినయినా క్రిస్టియన్స్‌గా కన్వర్ట్ చేసుకుంటాం కదా! మరి మీ మతంలో అలాంటి అవకాశం లేదా?" అంది కొంచెం ఆవేశంగా.

దీర్ఘంగా నిట్టూర్చాడు ఆనందరావు. "ఏమో మార్గరెట్! ఐ డోంట్ నో!" అన్నాడు.

మార్గరెట్‌తో ఆస్పత్రికెళ్లి స్పృహ లేకుండా నిస్సహాయంగా పడివున్న ఆ అమ్మాయిని చూసి పది నిమిషాలుఅక్కడే ఉండి వెనక్కి తిరిగి వచ్చేశాడు ఆనంద రావు.

కళ్ళు తెరిచినా, మూసుకున్నా ఆ అమ్మాయి అమాయకమయిన ముఖమే

కనిపించసాగింది. 'ఈ పెళ్ళి గురించితెలిసి తన సోనీకూడా ఏ అఘాయిత్యమయినా చెయ్యదుగదా! ఏం చెయ్యడం? అసలు తనెటువంటి పరిస్థితిలో వుందో! ఎంత ప్రయత్నించినా తనను కలుసుకోడానికి వాళ్ళ పెద్దవాళ్లు ఇష్టపడటంలేదేమో! ఆ అమ్మాయిని కట్టుదిట్టం చేశారేమో! అలా జరిగేందుకు చాలా అవకాశాలున్నాయి.

'మగవాడు...తనకాళ్ళమీద తను నిల బడ్డవాడు, తనే తనవాళ్ళను కాదనలేక పోతున్నాడే! మరి పాపం! ఆడపిల్ల సోనీకి ఎలా స్వాతంత్ర్యం వుంటుంది? అటువంటి సోనీకి తన పెళ్ళివార్త శరాఘాతంలా తగలదూ? పొరపాటు...క్షమించరాని పొరపాటు జరిగిపోయింది...' ఆనందరావు ఆవేదనకు అంతులేదు.

వెంటనే కాగితం తీసి 'అన్నయ్యా! మావయ్యా! నేనీ పెళ్ళి చేసుకోలేను. పెళ్ళి ఆపించెయ్యండి. మిమ్మల్ని ఇబ్బంది పెడుతున్నందుకు క్షంతవ్యుడిని' అని రాసి సూర్యం అడ్రస్‌కి పోస్ట్ చేశాడు.

* * *

భోజనంచేసి ఉయ్యాల బల్లమీద కూర్చుని తాంబూలం నములుతున్న సూర్యం దవడలు ఆనందరావు ఉత్తరం చదవగానే ఆటోమేటిక్‌గా ఆగిపోయాయి. వెంటనే లేచి ఉన్నపాటున బయలుదేరి బస్సెక్కి మావగారి ఊరు చేరాడు. తిన్నగా భాస్కర్రావు గదిలోకి దూరి పందిరి మంచం మీద కూర్చుని తనలో తనే ముక్కలు పంచుకుని ఆడుకుంటున్న భాస్కర్రావుని చెయ్యిపుచ్చుకుని తోటలోకి లాక్కెళ్ళాడు.

"ఇలా లాక్కువచ్చేశావేంరా? ముక్కలు సగం అక్కడే వుండిపోయాయి. అన్నీ తెచ్చుకుంటే ఆడుకునే వాళ్ళంకదా" అన్నాడు భాస్కర్రావు బాధగా.

చిర్రెత్తుకొచ్చింది సూర్యానికి. "ఛీ నోర్ముయ్! నీకు పేకాటపిచ్చి, మీనాన్నకి అందర్నీ తిట్టే పిచ్చి, నీ పెళ్ళానికి సినిమాల పిచ్చి, నీ చెల్లిలికి పుట్టింటి నుంచి తెచ్చుకోవాలని పిచ్చి,నీ తమ్ముడికి ప్రేమ పిచ్చి-మీ అందరి పిచ్చివాళ్ళ మధ్యా నాకూ పిచ్చెక్కేలా వుంది" అన్నాడు విసుగ్గా.

తేరిపార చూశాడు భాస్కర్రావు. "ఏమిటి మావయ్యా! ఎందుకలా మండి పడిపోతున్నావు?" అన్నాడు అనుమా



నంగా.

"ఇదిగో చూడు" అంటూ ఉత్తరం విసిరి కొట్టాడు సూర్యం. చదివాడు భాస్కర్. కళ్ళు బైర్లు కమ్మాయి. ఒళ్ళు మండిపోయింది. ఎదురుగా వున్న సూర్యం మీద విరుచుకుపడ్డాడు.

"ఎక్కడికి పోతాయ్ మేనమామ బుద్ధులు? నువ్వూ ఇంతే. నీకు తోచిందే



గాని మరొకళ్ళమాట వినిపించుకోవు. నీ పోలికలే వాడికీను" అని తిట్టాడు.

సూర్యం వూరుకోలేదు. ఇద్దరూ అలా హోరాహోరి కాసేపు తిట్టుకుని తర్వాత ఇద్దరూ కల్సి ఆనందరావుని తిట్టారు. చివరికి జాలి హృదయుడైన ఆనందరావుని శోకరసంతో లొంగదీయాలనుకుని ఇంటికి వచ్చారు. ఇద్దరి పేర్లతోనూ ఉత్తరం రాసి పోస్టుచేశారు.

"చిరంజీవి ఆనందాయికి ఆశీస్సులు.

నీ ఉత్తరం అందింది. నీకు ఏం శని పట్టిందో! అన్నీ తెలిసినవాడివి. ఇలా ఎందుకు మమ్మల్ని వేధిస్తున్నావో మాకు అర్థం కావడం లేదు. శుభలేఖలు వచ్చేశాయి. అందరికీ తెలిసిపోయింది. ఇంత జరిగాకా పెళ్లి ఆపడం ఎంత కష్టమో, ఎంత పరువుతక్కువో నీకు తెలియంది కాదు. ఇంత అవమానం జరిగాక నాన్నగారు ప్రాణాలతో వుండలేరు. ఆయన లేకపోతే అమ్మ వుండలేదు. వాళ్లులేక పోయాక మేమిద్దరం ఎలా బతికి ఉండగలం? ఏ విషమోతాగి చస్తాం.మాతరువాత అన్నపూర్ణ, కామేశ్వరి ...ఎందుకులే ఇవన్నీ నీకు. పెళ్ళికి వారం రోజుల ముందరి వరకూ చూస్తాం నీకోసం. వచ్చావా సరేసరి. లేకపోతే ఇదే ఆఖరి అప్పగింతలు. వంశానికి నువ్వొక్కడివే మిగులుతావు అన్నీ జాగ్రత్తగాచూసుకో. మరి వుంటాం.

నీ అన్నయ్య, మామయ్య"

ఉత్తరం చదివిన ఆనందరావుకి కడుపులోంచి దుఃఖం పొర్లుకు వచ్చింది. సోనీ ఆత్మహత్య చేసుకుంటుందేమోనని పెళ్లి ఆపేద్దాం అనుకుంటే ఇటు మూక ఉమ్మడి ఆత్మహత్యలు జరిగేలా వున్నాయని నెత్తిబాదుకున్నాడు. జుట్టు పీక్కున్నాడు. ఇది ఎక్కడి పరీక్షరా భగవంతుడా అనుకుని తల పగిలిపోయేలా ఆలోచించాడు. మెరుపులాంటి ఆలోచన తట్టింది. వెంటనే ఇంటికి వెళ్లి పాత ఉత్తరాలు తీసి వెతికాడు. తండ్రి రాసిన ఉత్తరంలో ఆ స్వర్ణలతాదేవి వివరాలు, ఆవిడ తండ్రి వివరాలు దొరికాయి. డైరీలోంచి ఓ ఇన్లాండు కవరు తీసి—

"శ్రీ తిలక్‌గారికి నమస్కారములు.

మీరు మీ అమ్మాయి స్వర్ణలతకు నిశ్చయంచేసిన వరుడు ఓంకారుని ఆనందరావుకి కాస్త పిచ్చి. వాళ్ళ వాళ్లు వేపకాయంత వెర్రి అంటారుగానీ అతనికి మాత్రం కొబ్బరికాయంత పిచ్చివుంది. చూసూ చూస్తూ అలాటి పిచ్చివాడికి ఇచ్చి చేసేకన్నా మీ అమ్మాయిని ఏగంగలోనో తొయ్యడం నయం. ఆలోచించి నిర్ణయానికి రండి.

ఇట్లు

మీ శ్రేయోభిలాషి"

అని రాసి, అడ్రసు తనకు తెలిసినంత వరకూ ఎలాగోలా రాసి పోస్టులో పడేసి వెనక్కి తిరిగాడు.

'ఈ ఎత్తు పారితే తన ప్రమేయం లేకుండానే పెళ్ళి తప్పిపోతుంది. ఇంత దాకా వచ్చాక అందరికీ తనకి పిచ్చని తెలిసిపోతుంది. ఇక తనకు సంబంధాలు రావు. హాయిగా వుండచ్చు. ఏదోనాడు సోనీ బైటికి రాకమానదు. అపుడు హాయిగా వుండచ్చు' అనుకుంటూ వెనక్కి తిరిగి వచ్చేసి మరో కవరు తీసి 'అన్నయ్యా, మావయ్యా! నేను ఫలాని రోజుకు బయల్దేరి వస్తాను' అంటూ ఉత్తరం రాసేశాడు.

'ఎలాగూ తను వెళ్ళేసరికి ఆ పెళ్లి

ఆగిపోనేపోతుంది. నాలుగు రోజులు అందరితో కులాసాగా గడిపేసి తిరిగి రావచ్చు' అనుకుంటూ పడుకున్నాడు. తన అద్భుతమైన ప్లానుకు తనని తనే అభినందించుకున్నాడు.

* * *

పరంధామయ్య పోస్టులో వచ్చిన ఉత్తరాల్ని ఒక్కొక్కటీ పరిశీలిస్తున్నాడు. పెళ్ళి శుభలేఖలు అందుకున్న బంధుమిత్రుల నుండి సమాధానాలు వచ్చాయి. వాటిల్లో చిన్నకొడుకు ఉత్తరం చదువుకుని తృప్తిగా నిట్టూర్చాడు. మరో ఉత్తరం పైన భాస్కర్రావు పేరుంది. ఆయనకి ఏ వుత్తరమైనా సరే వెంటనే చింపి చదివేసే అలవాటుంది. అందుకే చింపి చదివాడు వెంటనే.

"బాబీ...బాబీ!" అని కేక పెట్టాడు.

గదిలో పడుకుని గోళ్లు కొరుక్కుంటున్న భాస్కర్రావు పరుగున వచ్చేశాడు.

"ఏమిటి నాన్నగారూ!"

"మార్గదర్శి అంటే ఎవర్రా?"

భాస్కర్రావు గుండె దడదడలాడింది. "ఏం నాన్నగారూ! చచ్చిపోయాడా? పేపర్లో వేశారా?" అన్నాడు దీనాతి దీనంగా.

"ఛీ...అపశకున పక్షి! ఉత్తరం రాశాడు" అన్నాడు తాపీగా.

"అలాగా! అతను నా స్నేహితుడు నాన్నగారూ! ఆ ఉత్తరం ఇలా ఇవ్వండి" అన్నాడు భాస్కర్రావు హుషారుగా.

"ఇస్తాలేరా! నీ తెలుగే అధ్వాన్నం అనుకుంటే ఈ మార్గదర్శి తెలుగు మరీ ఛండాలంగా వుందే! కళ్లజోడుకి జ్వరం వస్తే హాస్పిటల్‌కి తీసికెళ్లానని రాస్తాడేమిటి ? కళ్ళజోడు చెడిపోతే రిపేరుకి తీసికెళ్ళానని రాయాలిగానీ ! ఇదేం భాషరా నీ తలకాయ"

"మీరు పొరబడ్డారండీ! కళ్లజోడంటే కళ్ళజోడు కాదు ... కళ్ళజోడు" అన్నాడు భాస్కర్రావు నవ్వుతూ.

చిరాకుగా చూశాడు పరంధామయ్య.

"కళ్లజోడు కాదంటే కళ్ళజోడేమిట్రా! నీ తలకాయ" అని కసురుకున్నాడు.

"అది కాదండి నాన్నగారూ! కళ్ళజోడు అంటే కళ్లజోడు కాదు. నా ఫ్రెండు కళ్లజోడు" అని వివరించ ప్రయత్నించాడు భాస్కర్రావు.

కొడుకుని ఎగాదిగా చూసి "అన్నపూర్ణా...అన్నపూర్ణా" అని కేక పెట్టాడు.

భోజనాల గదిలో కూర్చుని అత్తగారు, ఆడబడుచుతో కబుర్లు చెబుతూ ఒడియాలు ఒలుస్తున్న అన్నపూర్ణ పరుగున వచ్చేసింది. పయట భుజం చుట్టూ కప్పుకుని-

"పిలిచారా?" అంది మెల్లిగా.

"అవును. చూడమ్మాయ్! నా దగ్గర వున్నంతవరకూ వీడికీ, వీడి తమ్ముడికీ ఏ దురలవాట్లు లేకుండా పెంచాను. మరి ఆ తర్వాతి సంగతులు నాకు తెలీవు. ఇపుడు వీడిని చూస్తుంటే నాకేదో అనుమానంగా ఉంది. కళ్ళజోడంటే కళ్ళజోడు కాదు నా ఫ్రెండు కళ్ళజోడు అంటాడేమిటి? కళ్లు చూడబోతే తెల్లగానే వున్నాయ్! ఏమిటమ్మా వీడి వ్యవహారం? ఏదైనా వుంటే చెప్పు. కాళ్ళు విరగ్గొట్టేస్తాను" అన్నాడు పరంధామయ్య.

అన్నపూర్ణకి నవ్వు ముంచుకు వచ్చింది. భర్త వంక చూసింది. తల వంచుకుని నుంచున్నాడు. వెంటనే మామగారి కేసి తిరిగి-

"అదికాదు మామగారూ! ఈయనకి

అక్కడ ఒక స్నేహితుడు వున్నారు. అతనికి వీళ్లు కళ్ళజోడని ముద్దు పేరు పెట్టారు. బహుశా ఆ కళ్ళజోడు గురించి చెప్పి వుంటారు" అంది.

"ఏమిటి...మనిషి పేరు కళ్ళజోడా! బావుంది. చాలా అందంగా వుంది. మరి వీడి పేరు ముద్దు పేరు ఏమిటి కత్తిపీటా?" అన్నాడు నవ్వుతూ.

అన్నపూర్ణకి నవ్వాగలేదు 'ఫర్వా లేదు. మూడ్‌లో వుంటే మావగారూ మంచి జోకులే వేస్తారు' అనుకుంది. వెనక్కి తిరిగి లోపలికి వెళ్ళిపోయింది.

"ఇదిగో ఉత్తరం. ఫో!" అనేసి తన పనిలో మునిగిపోయాడు పరంధామయ్య.

లోపలికొచ్చి ఉత్తరం విప్పాడు భాస్కర్రావు.

'చిరంజీవి బాబిని సౌభాగ్యవంతుడిగా దీవించి రాయునది...

మేము క్షేమం. నువ్వూ క్షేమమని తలుస్తాను. మీ తమ్ముడి పెళ్ళికి నువ్వు ఆహ్వానించిన ప్రకారం మేమందరం వస్తున్నాం. నాలుగైదు రోజుల ముందుగానే వచ్చేస్తాం. నువ్వు లేకపోతే మాకేమీ బావుండలేదు. కళ్ళజోడుకి ఈమధ్య జ్వరం వస్తే హాస్పిటల్‌కి తీసుకెళ్ళాను. ఇపుడు కండిషన్ ఓ.కె. ఆమధ్య ఓరోజు మరీ ఆలస్యం అయిపోయిందని సుశీలగారు హార్మణీ పెట్టెను వాకిట్లోకి విసిరేసింది. పెద్దగా దెబ్బలేం తగల్లేదు. మరింక కబుర్లేమిటి? శ్రీమతి అన్నపూర్ణగారు ఎన్ని సినిమాలు చూశారు? ఆవిడకి నా నమస్కారాలు. ఇంకా మీ నాన్నగారికీ, అమ్మగారికీ నమస్కారాలు. మీ చెల్లెల్నీ, బావగారినీ అడిగానని చెప్పు. పెళ్ళికొడుక్కి అభినందనలు స్వయంగా చెప్తాను. ఎపుడు వచ్చేదీ టెలిగ్రాం ద్వారా తెలియపరుస్తాను.

వుంటాను
నీ
మార్గదర్శి'

నవ్వు వచ్చింది భాస్కర్రావుకి. 'వచ్చేస్తున్నారు స్నేహితులు. చాలా సరదాగా వుంటుంది' అనుకున్నాడు తృప్తిగా.

మర్నాటి నుంచి పెళ్ళి పనులతో బాగా బిజీ అయిపోయారందరూ. పెళ్లికూతురి నగలు, చీరలు, ఇంటివాళ్ళ బట్టలు ఇవన్నీ కొనడం పెద్దపని అయిపోయింది. ఒకరికి నచ్చినవి మరొకరికి నచ్చవు.

'పెళ్లిసందడి వచ్చేసింది ఇంటికి. ఇక పెళ్ళికొడుకే రావాలి' అనుకున్నారందరూ.

ఆనందరావు రాసిన ఉత్తరం తిలక్ గారికి అందింది. అయోమయంగా అనిపించిందాయనకి. వెంటనే పనివాణ్ని పిల్చి "అల్లుడుగార్ని ఉన్నపాటున రమ్మన్నానని చెప్పు" అని పంపించారు.

క్లినిక్‌లో పేషంట్లని చూస్తున్న మధుసూదన్ చెవుల్లోంచి స్టెతస్కోపు కూడా తియ్యకుండా అలాగే పరిగెట్టుకు వచ్చేశాడు. మావగారిచ్చిన ఉత్తరాన్ని పైనుంచి కిందకి, కింద నుంచి పైకి రెండుసార్లు చదివేడు. సూటిగా మామగారి వంక చూసి ఆయన ఎదురుగా కుర్చీలో కూలబడ్డాడు.

"ఏం నాయనా... ఏమిటిది? ఏం చేద్దాం?" అన్నాడు తిలక్‌గారు గాభరాగా.

పది నిమిషాలు ఆలోచించాడు మధుసూదన్. "మావయ్యగారూ! ఇది గిట్టని

వాళ్ళెవరో రాసిన ఉత్తరం. దీనిలో ఎంత మాత్రం నిజంలేదు. పిచ్చివాడైతే అంత చదువు ఎలా చదువుతాడు. ఆ ఉద్యోగం ఎలా చేస్తాడు? వాళ్ళ వాళ్ళం దర్నీ చూశాం కదా మనం. అంత మంచి కుటుంబంలోంచి వచ్చినతనికి పిచ్చి ఎలా వుంటుంది చెప్పండి? అసలు మన కింత మంచి సంబంధం దొరికిందని అందరికీ చాలా కుళ్ళుగా వుంది. ఎవరో కడుపుమంట పట్టలేక ఇలా రాసి వుంటారు" అన్నాడు.

"అంతేనంటావా?"

"అంతే! అక్షరాలా అంతే" అన్నాడు మధు నమ్మకంగా.

తిలక్‌గారికి దిగులు తీరిపోయింది. అంతేకాబోలనుకుని ఆ ఉత్తరం కాస్తా చింపి అవతల పారేశారు.

* * *

పెళ్లి వారం రోజుల్లోకి వచ్చేసింది. ఆనందరావు శెలవుపెట్టి ఇంటికి చేరుకున్నాడు. భాస్కర్రావు, సూర్యం తృప్తిగా ఊపిరి పీల్చుకున్నారు. అన్నపూర్ణ మరిదిని ఆటపట్టించింది. కామేశ్వరి చేటంత మొహం చేసుకుని తనకు వచ్చే లాంఛనాలన్నీ ఏకరువు పెట్టింది. మాణిక్యాంబ, పరంధామయ్యా ఇంటికిపుడు పూర్తి పెళ్ళికళ వచ్చేసిం దనుకుని సంతోషపడ్డారు.

అన్నీ చూసి లోలోపల నవ్వుకున్నాడు – 'వెర్రిమొహాలు! ఇది జరిగే పెళ్లి కాదని తెలీదు వీళ్ళకి. ఇపుడో, ఇంకో క్షణంలోనో అటువైపు నుండి పెళ్లి రద్దు చేసుకున్నాం అంటూ కబురు వచ్చేస్తుంది' అనుకుంటూ మామూలుగానే సరదాగా అందరితో మాట్లాడుతూ వుండిపోయాడు.

తమ్ముడు వచ్చినందుకే సంతోషపడుతున్న భాస్కర్రావు మరో అర గంట తర్వాత వచ్చిన టెలిగ్రాం చదివి గాల్లో తేలిపోయాడు.

"మార్గదర్శివాళ్ళు వచ్చేసేది రేపే" అని తల్లికీ, తండ్రికీ చెప్పేశాడు. "వాళ్ళ ఎదుట నన్ను తిట్టకండి నాన్నగారూ!" అని బతిమాలుకున్నాడు తండ్రిని. ఇక ఆ పూట తను చేయాల్సిన పనులన్నీ చేసేశాడు. హుషారుగా కాలక్షేపంచేసి ఈస్టుకోస్టులో వచ్చే స్నేహబృందాన్ని రిసీవ్ చేసుకుందుకు పొద్దున్నే బెజవాడ వెళ్ళిపోయాడు.

రైలు రెండు గంటలు లేటుగా వచ్చింది. అందరికన్నా ముందు మార్గదర్శి దిగాడు. అతని వెనకాల హార్మణీ పెట్టె, తర్వాత కళ్ళజోడు, శ్రీమతి గాయత్రీ కళ్ళజోడుదిగారు. హడావుడిగా సామాన్లు దింపేశారు,

సంతోషంగా అందరూ భాస్కర రావుని కావలించేసుకున్నారు – గాయత్రి తప్ప.

"హార్మణీ! నీ మిసెస్ ఏదీ?" అన్నాడు భాస్కర్రావు.

"గూడెంలో దిగిపోయింది. డైరెక్టుగా పెళ్ళికి వస్తుంది" అన్నాడు హార్మణీ పెట్టె.

కళ్ళజోడు సీరియస్‌గా జేబులోంచి ముక్కలుతీసి–

"ఇదిగో బాబీ నీ ముక్కలు. నీకూ పంచేశాం" అంటూ అందించాడు.

మహా ప్రసాదంలా వాటినందుకుని అందర్నీ ముందు శాకాహార భోజన హోటలుకి తీసికెళ్ళాడు. భోజనాలవగానే పోదామని బస్సెక్కి రాత్రి ఎనిమిదింటికి ఊరు చేరుకున్నారు.

సూర్యం బస్టాండుకి వచ్చాడు. పరిచయాలయ్యాయి.

"ఏం సార్! మీకూ పంచెయ్యనా" అన్నాడు కళ్ళజోడు.

"అలాగే తప్పకుండా. కానీ ఇంటికి వెళ్ళాకసుమా" అంటూ నవ్వాడు సూర్యం.

అందరూ ఇంటికెళ్ళేసరికి అన్నపూర్ణ గుమ్మంలోనే ఎదురైంది. గాయత్రిని పలకరించి "సుశీలగారు రాలేదా?" అనడిగింది. గాయత్రి జవాబు విని మిగతా ముగ్గుర్నీ పలకరించింది.

"ఎన్ని సినిమాలు చూశారు?" అని అడిగారంతా.

చెప్పింది అన్నపూర్ణ.

ముందు గదిలోకి వెళ్ళగానే పరంధామయ్య ఎదురొచ్చి ఆహ్వానించాడు. అందర్నీ పేరు పేరునా పరిచయం చేశాడు సూర్యం.

"అంతా బాగానేవుంది. కానీ ఆ ముద్దు పేర్లేమిటోయ్? చక్కగా పూర్తి పేర్లతో పిల్చుకోకూడదూ?" అన్నాడు పరంధామయ్య.

"అలవాటయిపోయింది బాబాయి గారూ!" అన్నాడు మార్గదర్శి.

"ఏమిటో ఈ రోజులు! మా కాలంలో లక్షణంగా పూర్తి పేరుతో పిల్చుకునే వాళ్ళం. సరేలే వెళ్ళండి. ప్రయాణంచేసి వచ్చారు. స్నానాలు, భోజనాలు కానివ్వండి" అన్నాడు పరంధామయ్య.

లోపలికి వెళ్ళగానే మాణిక్యాంబ, కామేశ్వరి కనిపించారు.

"మీరందరూ రావడం చాలా సంతోషంగా వుంది" అంది కామేశ్వరి.

"మీ ఇల్లులాగే అనుకోండి బాబూ! దేనికీ మొహమాట పడకండి. మా బాబీతో బాటే మీరూను" అంది మాణిక్యాంబ.

ఈ సంపడికి ఆనందరావు తన గది లోంచి హాల్లోకి వచ్చాడు. "లాస్ట్ బట్ నాట్ లీస్ట్. ఇదిగో అసలు హీరో మా తమ్ముడు" అంటూ పరిచయం చేశాడు భాస్కర్రావు.

"కంగ్రాట్స్" అని చెయ్యి అందించాడు హార్మణీపెట్టె.

"నేను మిమ్మల్ని అభినందించను. మీకాబోయే భార్యను అభినందిస్తాను. ఆవిడ చాలా అదృష్టవంతురాలు" అన్నాడు మార్గదర్శి.

"ఏంతమ్ముడూ! నీకూ పంచెయ్యనా" అన్నాడు కళ్లజోడు.

అందరికీ నవ్వుతూ సమాధానం చెప్పి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయాడు ఆనందరావు.

ఇల్లంతా తిరిగి చూశారు. హాయిగా వేడినీళ్ళతో స్నానాలుచేసి కమ్మటి భోజనం పూర్తి చేశారు.

అతిథులందరికీ మంచాలువేసి మెత్తటి పక్కలు వేశారు. ఆ రాత్రి భాస్కర్రావు గదిలో పందిరి మంచంమీద బాతాఖానీ వేశారు మిత్రబృందం సూర్యంతో సహా. అన్నపూర్ణ గాయత్రితో కబుర్లు చెబుతూ నడవలో మంచంమీద నడుం వాల్చింది. తొలికోడి కూసేదాకా కబుర్లాడి నిద్రలోకి జారుకున్నారంతా.

తెల్లారి బారెడు పొద్దెక్కాక లేచి స్నానపానాదులయ్యాక సూర్యంతో అందరూ అతని వూరెళ్ళారు.

ఆ రోజంతా అక్కడే గడిపేసి తిరిగి వచ్చారు.

"ఏవోయ్ కళ్ళజోడుపెట్టే! ఎలా వున్నాయ్ మా వూళ్లు?" అని పలకరించాడు పరంధామయ్య.

"ఊళ్ళు బాగున్నాయి గానీండీ, నా పేరు కళ్ళజోడు మాత్రమే. పెట్టె అయినది" అన్నాడు హార్మణీనిచూపిస్తూ.

అందరూ కులాసాగా నవ్వుకున్నారు.

పెళ్ళి ఆరు రోజులుంది. ఒక్కోరోజు గడుస్తున్నకొద్దీ ఆనందరావు గుండె బరువెక్కసాగింది. ప్రతీరోజూ పోస్ట్‌మాన్ రాగానే ఆశతో ఎదురు చూసేవాడు. తండ్రి మండిపడి చీవాట్లు పెడతాడేమో! అన్నయ్య స్నేహితులు కూడా ఉన్నారని మనసు పీకినా నిండా మునిగినవాడికి చలేమిటని అన్నింటికీ సిద్ధపడే ఉన్నాడు.

కానీ రోజూ పరంధామయ్య ఉత్తరాలు చదివేసుకుని మామూలుగా పక్కన పెట్టేసుండేసరికి తన ఉత్తరం అందలేదేమో అన్న డౌట్లో పడ్డాడు. మళ్ళీ అలాంటిదే మరో ఉత్తరం రాసి ఈసారి కరెక్టు ఎడ్రస్‌కి పోస్టుచేశాడు.

పెళ్లి అయిదు రోజులే వుంది. దగ్గరి బంధువుల రాక మొదలయింది. పెళ్లి పందిరి వేసేశారు. ఇల్లంతా పచ్చితాటాకుల సువాసన. అంతా సందడిగా ఉంది. ఏ ఉత్సాహమూలేనిది ఆనందరావుకే.

ఆ రోజు పొద్దున్నే అక్కడికి దగ్గర్లో ఉన్న మేనమామను చూసి వస్తానని వెళ్ళాడు కళ్ళజోడు. మార్గదర్శి, హార్మణీపెట్టె, భాస్కరావు ముగ్గురూ పందిరిలో నిలబడి రంగు కాయితాలు ఎలా అంటించాలో సలహాలు ఇస్తున్నారు.

పరంధామయ్య అక్కడికి వచ్చి "ఒరే బాబీ! నువ్వు అర్జంటుగా వెళ్లి ఆ పని చక్కబెట్టుకురా. వెళ్ళు" అని ఏదో పని పురమాయించారు.

"అలాగే" అని లోపలికి వెళ్లి బట్టలు మార్చుకుని బయటికెళ్లిపోయాడు భాస్కరావు.

"ఏవయ్యా హార్మణీ...!నీకెందుకు చెప్పు అనవసరమైన శ్రమ?" అన్నాడు పరంధామయ్య.

కిసుక్కున నవ్వేడు హార్మణీపెట్టె. "బాబాయ్‌గారూ! వచ్చి నాలుగురోజులవుతున్నా మా పేర్లు మీకింకా అంతుబట్టడం లేదు. నాపేరు హార్మణీపెట్టె. మీరు నా పెట్టెని తీసికెళ్ళి కళ్ళజోడుకి తగిలించేసి నన్నొట్టి హార్మణీని చేసేస్తున్నారు. ఇదేం బావులేదు'' అన్నాడు నవ్వుతూనే.

పరంధామయ్యకి నవ్వొచ్చింది. "బావుందిలేవయ్యా! ఏదో పెట్టె. అయినా మీరేం రైలుబళ్ళా? పెట్టెలు తగిలించడానికి. భలేవాడివే'' అంటూ వెళ్ళిపోయాడు ఏదో పనిమీద.

రంగుకాగితాలు అంటించే పని పూర్తయ్యేసరికి పదిగంటలయింది. ఇద్దరు మిత్రులూ కూర్చుని ఏం చేద్దాం అంటే ఏం చేద్దాం అనుకున్నారు. మార్గదర్శికే ముందు ఐడియా వచ్చింది.

''ఒరే! హార్మణీ! పద బజారుకెళ్ళి పెళ్ళికొడుక్కి ప్రజంటేషన్ కొని తెచ్చేద్దాం. ఒకపని అయిపోతుంది'' అన్నాడు.

ఇద్దరూ బజారువైపు వెళ్ళారు.

మార్గదర్శి, హార్మణీపెట్టె బజారుకు వెళ్ళడానికి పదహారు గంటలముందు తిలక్‌గారికి ఆనందరావు రాసిన రెండో ఉత్తరం అందింది. నెత్తిమీద చేతులు పెట్టుకుని కూర్చున్నాడు. వెంటనే పిలుపందుకుని మధుసూదన్ వచ్చాడు. అతనికి ఒళ్ళుమండిపోయింది. పెళ్ళిచూస్తే దగ్గరికొచ్చేసింది. అన్ని ఏర్పాట్లూ అయిపోయాయి. కొంతమంది బంధువులు కూడా వచ్చేశారు. స్వీట్లు చేస్తాం అంటే సరుకులు ఏవేవి ఎంతెంత కావాలో

నని మాట్లాడుతున్న టైంలో ఈ ఉత్తరం 'పెళ్ళికొడుక్కి పిచ్చి. అతనికి ఇచ్చి పెళ్ళిచేసే బదులు మీ అమ్మాయికి ఇంత విషం ఇచ్చి చంపడం మంచిద'ంటూ!

ఒక్క నిమిషం ఆలోచించి "మామయ్యగారూ! ఇక ఇలా లాభం లేదు. రేపొద్దున్న నేనే స్వయంగా వాళ్ళ వూరు వెళ్ళి ఆనందరావుని చూసి వస్తాను" అన్నాడు విసురుగా.

తిలక్‌గారి ప్రాణం లేచి వచ్చింది. "మానాయనే! అలాచెయ్యి బాబూ! ఏవిటో కన్నప్రాణం ఎటూ తోచడం లేదు. ఈ ఉత్తరాలు చూస్తే దిగులుగా ఉంది. నువ్వొకసారి చూసివస్తే ఇంక నిశ్చింత'' అన్నారు.

అన్న ప్రకారం పొద్దున్నే బయల్దే



రాడు మధుసూదన్.

మార్గదర్శి, హార్మణీపెట్టె తిన్నగా స్టీల్‌సామాన్ల కొట్టుకి వెళ్ళారు. అసలు ఎవరికి వాళ్ళుగాక ముగ్గురూ కలిసి ప్రెజెంటేషన్ ఇస్తే ఘనంగా ఉంటుం దనుకుని ఒక్కోరు రెండువందల రూపాయలు వేసుకున్నారు. ఆరువందల్లో భువనేశ్వర్లో అరిస్టోక్రాట్ సూట్‌కేస్ కొనగా మిగిలిన డబ్బుల్తో స్టీలుక్యారేజ్ కొనాలని తీర్మానించుకున్నారు. బస్సుల్లో ప్యాకింగ్ పాడయిపోతుందని, తను జాగ్రత్తగా చూసుకుంటానని సుశీల సూట్‌కేస్ తనతోబాటు తాడేపల్లిగూడెం తీసికెళ్ళింది. అదన్నమాట సంగతి.

ప్రస్తుతం మిత్రద్వయం నానా తంటాలుపడి చివరికి దిట్టంగా వున్న నాలుగు గిన్నెల క్యారేజీ ఎన్ను కున్నారు. బేరం చేశారు. అరగంట తర్వాత షాపతనికి, వాళ్ళకి రాజీ కుదిరింది.

"పేర్లు ఏం వెయ్యమంటారు?" అనడి



గాడు షాపతను.

మార్గదర్శికో ఆలోచన వచ్చింది. "చూడు హార్మణీ! ఈ క్యారేజీలో నాలుగు గిన్నెలున్నాయి. మన స్నేహానికి గుర్తుగా నాలుగు గిన్నెల మీదా నలుగురి పేర్లు వేయించుకుందాం. ఏమంటావ్?" అన్నాడు.

"ఓకే" అన్నాడు హార్మణీపెట్టె.

మొదటి గిన్నె మీద ఎస్. మాధవరావు (మార్గదర్శి) అని వేయించారు. రెండో గిన్నె మీద ఒ. భాస్కరరావు (బాబి) అని వేయించారు. మూడో గిన్నె మీద కె. దత్తాత్రేయశర్మ (హార్మణీపెట్టె) అని వేయిం చారు. నాలుగో గిన్నె దగ్గరికి వచ్చేసరికి బ్రేక్ పడింది. కళ్ళజోడు అసలు పేరు ఇద్దరికీ తెలీదు.

అసలు కళ్ళజోడుది వీళ్ళ డిపార్టు మెంటు కాదు. అతను స్టేట్‌బ్యాంకులో

ఆఫీసరు. వీళ్ళది కేవలం పేకాట స్నేహమే! అందరూ కళ్ళజోడుగారనే అంటారు. అతని పేరు తెలుసుకోవలసిన అవసరం ఇంతవరకూ ఎవరికీ రాలేదు. ఇప్పు డొచ్చిపడింది చిక్కు.

"పోనీ కె.జి.డు అని వేయిద్దామా?" అన్నాడు హార్మణీపెట్టె.

మార్గదర్శి ఒప్పుకోలేదు. "అసలే ఆయనగారికి కోపం ఎక్కువ. మనందరం పూర్తి పేర్లు వేయించుకుని తనకి మాత్రం అలా పొడక్షరాలువేయిస్తేమండిపడతాడు. ఓపని చేద్దాం. గాయత్రిగారున్నారుకదా! ఒక్కక్షణంలో వెళ్ళి అడిగేసి వస్తాను. నువ్వు ఇక్కడే వుండు" అని చెప్పి వెళ్ళి పోయాడు.

ఇంటికి వచ్చేసరికి ఆనందరావు, భాస్కర్రావు పందిట్లో నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఎక్కడికి కెళ్ళావు?" అని పలకరించాడు భాస్కర్రావు.

"చెప్తాలే! నీకు కళ్ళజోడు పేరు తెలుసా?" అని అడిగాడు మార్గదర్శి.

"తెలీదు. ఎందుకు?"

"కావాలి. గాయత్రిగారిని అడుగుదాం పద" అంటూ లోపలికి నడిచాడు మార్గదర్శి.

భాస్కర్రావు కూడా వెంటవెళ్ళాడు.

గాయత్రి దొడ్లో అరుగుమీద కూర్చుని కామేశ్వరి చేత గోరింటాకు పెట్టించుకుంటోంది. రెండు చేతులకీ పెట్టి ఫినిషింగ్ టచెస్ ఇస్తోంది కామేశ్వరి.

"గాయత్రిగారూ!" అని పిల్చాడు మార్గదర్శి.

"ఏంకావాలన్నయ్యగారూ! కాఫీ తాగుతారా?" అనడిగింది గాయత్రి నవ్వుతూ.

"కాఫీ వద్దులేమ్మా! మీతో ఓ చిన్న పనుండి వచ్చాను. మా కళ్ళజోడు అసలు పేరేమిటి?" అన్నాడు మార్గదర్శి.

"ఎందుకండీ?" అంది గాయత్రి ఆశ్చర్యంగా.

అవును మరి ఇన్నేళ్ళ పరిచయంలో ఏనాడూ ఈ ప్రశ్న అడగలేదు మార్గదర్శి.

"కావాలి పనివుంది. త్వరగా చెప్పమ్మా" అన్నాడు.

"మీరుమరీ అన్నయ్యగారూ! నేనాయన పేరెలా చెబుతాను?" అంది సిగ్గుపడుతూ.

"ఇంకా ఈ కాలంలో ఇవన్నీ ఏం చాదస్తాలు చెప్పండి!" అన్నాడు భాస్కర్రావు.

"ఏమో బాబూ! మా ఇంట్లో ఎవ్వరం భర్త పేరు చెప్పం. నాకూ అదే అలవాటు. నేను పెళ్ళిలో చెప్పాను అంతే" అంది తలొంచుకొని.

"పోనీ కాగితంమీద రాసి చూపిస్తారా?" అన్నాడు మార్గదర్శి.

"రాయడానికి నాకేం అభ్యంతరం లేదు గానీ, ఎలా? గోరింటాకు పెట్టుకున్నాగా" అంది.

"తీసి పారెయ్యండి. రాసేశాక మళ్ళీ పెడుతుంది మా చెల్లాయ్" అన్నాడు భాస్కర్రావు తేలిగ్గా తేల్చేస్తూ.

గయ్యిన లేచింది కామేశ్వరి - "ఎంత తేలిగ్గా చెబుతున్నావు. ఒకసారి పెట్టాక మళ్ళా పెట్టడం కుదరదు" అంది ఖచ్చితంగా.

తలపట్టుకున్నాడు మార్గదర్శి.

"పోనీ గాయత్రిగారూ! ఏదైనాహింట్ ఇవ్వండి" అన్నాడు భాస్కర్రావు.

"కింగ్"అందిగాయత్రి తలవంచుకుని.

"ఓహో! రాజు అంతేనా" అన్నాడు భాస్కర్రావు.

"కాదు"అంది గాయత్రి.

"రాజారావు" అన్నాడు మార్గదర్శి.

"ఊహూ" అంది గాయత్రి.

ఇద్దరు స్నేహితులు అలా వంతులు వేసుకుని రాజశేఖర్,రాజేంద్ర,రాజబాబు, రాజమౌళి, రాజాచంద్ర, రాజా అంటూ రకరకాల పేర్లు చెప్పారు.

అన్నీ కాదంది గాయత్రి"అసలు మీరు తప్పుదోవన వెళ్తున్నారు" అంది నిస్సహాయంగా.

ఒళ్ళు మండిపోతోంది ఇద్దరికీ.ఇంతలో బైటనుండిపనివాడు వచ్చి"చిన్నయ్యగారు రమ్మంటున్నారోసారి" అని చెప్పాడు భాస్కర్రావుతో.

"తర్వాత వస్తాలే! ఆగమను" అని విసుక్కుని పంపేశాడు పనివాణ్ని.

ఆనందరావు పిలవడానికి కారణం వుంది. అతను పందిట్లో కుర్చీలో కూర్చుని ఆలోచనల్లో మునిగిపోయి వుండగా మధుసూదన్ లోపలకు వచ్చాడు. ఎదురుగా వున్న ఆనందరావుని చూసి ఫొటోలో కంటే అందంగా వున్నాడనుకున్నాడు.

కొంచెం దగ్గరికెళ్ళి "హలో"అన్నాడు.

ఆలోచనల్లోవున్న ఆనందరావు ఉలిక్కిపడి తలెత్తి చూశాడు. ఎవరో అపరిచిత యువకుడు. అప్రయత్నంగానే "హలో" అన్నాడు.

"మీ నాన్నగారు లేరా?" అన్నాడు మధుసూదన్ కాబోయే తోడల్లుడిని తనివి తీరా చూస్తూ.

"లేరు ఎక్కడికో వెళ్ళారు. రండి కూర్చోండి" అంటూ మరో కుర్చీ చూపించాడు ఆనందరావు.

కుర్చీ లాక్కుని కూర్చుంటూ "మీ అన్నయ్యగారు లేరా ?" అనడిగాడు మధుసూదన్.

"ఉన్నాడు పిలిపిస్తానుండండి" అని పనివాడితో కబురుచేశాడు. అతను తిరిగొచ్చి తర్వాత వస్తానని చెప్పమన్నారన్నాడు.

మధుసూదన్ తనని తాను పరిచయం చేసుకుందామా అనుకొని కూడా ఆ ప్రయత్నం విరమించుకుని ఆనందరావుని మాటల్లోకి దింపాడు.

ఆనందరావు స్వతహాగా మంచి మాటకారి. ఏఅంశమైనా ఎదుటి వాళ్ళకి విసుగు కలిగించకుండా మాట్లాడగలడు. అందుకే మధుసూదన్‌తో మాట కలవగానే తన సహజ ధోరణిలో సరదాగా నవ్వుతూ నవ్విస్తూ కబుర్లు చెప్పుకుంటూపోయాడు. మధుసూదన్‌కి చెప్పలేనంత సంతోషంగా వుంది ఆనందరావుని చూస్తుంటే. పదేపదే స్వర్ణ అదృష్టానికి మురిసిపోతూ ఆనందరావుతో కబుర్లు చెప్తూ కూర్చున్నాడు.

కాసేపటికి సూర్యం వచ్చాడు.వస్తూనే "అరె! మధుసూదనంగారా!" అంటూ పలకరించాడు

"ఏమండీ బాగున్నారా?" అంటూ లేచి చెయ్యి అందించాడు.

"ఏమిటి ఇలా వచ్చారు?" అన్నాడు సూర్యం.

"అదే! పెళ్ళి దగ్గరకు వచ్చేసింది కదా! మామగారు వెళ్ళి మీఏర్పాట్లు అవీ ఎలా వున్నాయో చూసి రమ్మన్నారు. ఇంకా ఏమైనా మాట్లాడాల్సినవి వున్నాయేమో అడిగి రమ్మన్నారు" అన్నాడు మధుసూదన్ నవ్వుతూ.

ఆనందరావు అయోమయంలోపడిపోయాడు. ఎవరై వుంటాడో అంతుపట్టక "మామయ్యా! ఈయన ఎవరు?" అనడిగాడు.

"అరే! పరిచయాలవకుండానే

మాట్లాడేసుకుంటున్నారన్న మాట. బలే! ఆనంద్... ఈయన నీకాబోయే తోడల్లుడు అంటే మీ స్వర్ణలత బావగారు" అన్నాడు నవ్వుతూ.

ఆనందరావు పరిస్థితి వర్ణనాతీతం. తల గోడకేసి బాదుకోవాలనిపించింది. ఏడుపొచ్చింది. తల వంచుకుని నిలబడిపోయాడు

అంతలోకే భాస్కర్రావు, మార్గదర్శి బైటికి వచ్చేశారు. గాయత్రిచేత ఇంగ్లీషులో స్పెల్లింగ్ చెప్పించుకోవడంతో వాళ్ళపని అయింది. కళ్ళజోడు పేరు భూపతి.

రాగానే మధుసూదన్‌ను చూసి ఆశ్చర్యపోయాడు భాస్కర్రావు. మరుక్షణం కబురు లోపలికి వెళ్ళింది. ఆడపెళ్ళివారి వైపు బంధువు వచ్చాడుకదా! చెప్పలేనంత సంపడి. అందరూ వచ్చి పలకరించారు. కాఫీ ఫలహారాలు అందించారు.

కాఫీ తాగుతూ "భాస్కర్రావుగారూ! ఇంత మంది యువకులు వుండి కూడా ఎక్కడా సంపడి లేదేమండీ! మా ఇంట్లో మహా సీరియస్‌గా యజ్ఞం సాగిపోతోంది అపుడే" అన్నాడు మధుసూదన్ నవ్వుతూ.

మార్గదర్శికి పౌరుషం వచ్చేసింది– "ఎంత మాటన్నారు? ఇదిగో ఇపుడే, ఇక్కడే...." అంటూ జేబులోంచి ముక్కలుతీసి పంచేశాడు.

నిర్విరామంగా చతుర్ముఖ పారాయణ యజ్ఞం సాగిపోతోంది. మార్గదర్శి చకచక గెలుస్తున్నాడు. అయినా అతనికి ఎందుకో సంతోషంగా లేదు. భాస్కర్రావు, సూర్యం, మధుసూదన్ కూడా మహా హుషారుగా ఆడుతున్నారు.

ఆనందరావు లోపల మంచం మీద దిండులో తల పెట్టుకుని పడుకున్నాడు. అతని ఆశలన్నీ నిరాశలైపోయాయి. నిస్సహాయంగా పడుకున్నాడు.

మార్గదర్శికి ఎందుకో వుండుండి గుండె కలుక్కుమంటోంది. ఎవరో తనని తల్చుకుంటున్న ఫీలింగ్! బాధగా గుండె తడుముకున్నాడు. గరగరలాడింది. మరోసారి తడుముకున్నాడు. కొత్త వంద రూపాయలనోట్లు తగిలాయి. చివాల్న లేచాడు– "హార్మణీ...హార్మణీపెట్టె" అంటూ.

'సిరికిం జెప్పడు...' అన్నట్లు ఏం మాట్లాడకుండా చకచకా బైటికినడిచాడు అతనివెంటే అయోమయంగా భాస్కర్రావు, సూర్యం కూడా వెళ్ళిపోయారు.

మధుసూదన్ ఒక్కడూ మిగిలాడు. నిద్రలో లేచి నడిచే జబ్బు గురించి అతనికి తెలుసు. అతను చదువుకున్నాడు. కానీ ఇలా పేకాట మధ్యలో లేచి నడిచే జబ్బు ఏమిటో అతనికి తెలియదు. అందుకే తలెత్తి పందిరి వంక చూస్తూ దీర్ఘాలోచనలో పడ్డాడు.

మార్గదర్శి తిన్నగా స్టీలు సామాన్ల కొట్టుకి వెళ్ళాడు. అక్కడి పరిస్థితి దయనీయంగా ఉంది. హార్మణీపెట్టె మోకాళ్ల మీద తలవాల్చుకుని కూర్చుని వున్నాడు. అతని వెనకాల షాపు ఓనరు, మరో పనివాడూ కోపంగా చూస్తూ నిలబడిఉన్నారు. అప్పటికి చాలా సేపట్నించీ వాళ్ళకి అతని మీద కోపంగా వుంది.

మార్గదర్శి వెళ్ళిన అరగంట వరకూ 'సార్...సార్' అంటూ మర్యాదగా మాట్లాడారు. తర్వాత కాసేపటికి వాళ్ళకి అనుమానం వచ్చింది.

"ఏది ఆ మనిషి?" అన్నారు – ఏ సంబోధన లేకుండా.

"వచ్చేస్తాడు" అన్నాడు హార్మణీ రోడ్డు వంక చూస్తూ.

మరో అరగంట గడిచినా మార్గదర్శి జాడ లేకపోయేసరికి వాళ్ళకి ఒళ్ళు మండింది "ఏవయ్యా! ఏడీ నీస్నేహితుడు? ఇదేదో తిరకాసు వ్యవహారంలా వుందే!" అన్నాడు ఓనరు.

హార్మణీపెట్టెకి చచ్చేమొహమాటంగా వుంది. పోనీ డబ్బిచ్చేసి కళ్ళజోడు పేరు లేకుండానే క్యారేజి తీసుకుపోదామంటే డబ్బుకాస్తా మార్గదర్శి దగ్గరే వుండి పోయింది.

అప్పటికీ పరంధామయ్యగారింట్లో పెళ్ళికి వచ్చానని చెప్పాడు. వాళ్ళు నమ్మలేదు.

"ఇదో దొంగ వేషం. పరంధామయ్య గారబ్బాయి పెళ్ళని ఈ ఊళ్ళోనే కాదు,ఈ చుట్టుపక్కల అంతా కూడా తెలుసు, నీ మాట ఎవరు నమ్మవచ్చారు" అన్నాడు ఓనరు.

"పోనీ ఈ పనివాడికి క్యారేజి ఇచ్చి నాతో పంపండి. డబ్బిచ్చి పంపుతాను" అన్నాడు హార్మణీపెట్టె.

'ఎండ తీవ్రతకి రోడ్డు మీదెక్కడా జనసంచారంలేదు. ఎవరూ లేకుండా చూసి ఆ క్యారేజీతోనే పనివాడి నెత్తిన కొట్టి పారిపోతే ఎవరు దిక్కు' అనుకుని "అలా పంపను" అన్నాడు ఓనరు.

"సరే నేను వెళ్తాను.సాయంత్రం వచ్చి తీసుకెళ్తాం" అన్నాడు హార్మణీపెట్టె.

మరింత మండిపడ్డాడు షాపు ఓనరు. "ఏం నీబాబు సొమ్మనుకున్నావా? ఎవడు నమ్మతాడు నీ మాటలు? క్షణానికోమాట చెప్తున్నావు. ప్రతి గిన్నెమీదా ఆ మూల నుండి ఈ మూలదాకా పేర్లు కొట్టించారు. నిన్ను వదిలితే తిరిగి వస్తావన్న నమ్మకం ఏమిటి? అసలా వెళ్ళినవాడో దొంగై ఉంటాడు. మీ ఇద్దరికీ ఇదో వ్యాపారం అయివుంటుంది నీలాంటివాళ్ళకు ఎలా బుద్ధిచెప్పాలో నాకు బాగా తెలుసు. నోరు మూసుకుని కూర్చో" అని కసిరాడు.

వసుదేవుణ్ణి తల్చుకుని "పోనీ నా చేతి ఉంగరం, వాచీ తీసుకుని నన్నొదిలెయ్" అన్నాడు హార్మణీపెట్టె.

"సరేలే! ఆ ఉంగరం బంగారందో కాదో, వాచీ చూస్తుంటే ఎక్కడో కొట్టుకొచ్చినట్లే ఉంది'' అని నిందించాడు ఓనరు.

ఇక చేసేదిలేక మార్గదర్శిని తిట్టిపోస్తూ 'ఏమయ్యాడు? వీడు వెళ్తూ వెళ్తూ దార్లోనే చచ్చిపోయాడా!' అనుకుంటూ కూర్చున్నాడు హార్మణీపెట్టె.

ఆ షాపతను మాత్రం గట్టిగానే అరుస్తున్నాడు.

"దిక్కుమాలిన బేరం. పొద్దున్నే ఎవరిమొహం చూశానో ఏమో! ఆ క్యారేజి మళ్ళీ ఫాక్టరీకి పంపాలి. పేర్లేసినదాన్ని చూసి వాళ్ళేమంటారో.."

సరిగ్గా ఆ సమయంలోనే హార్మణీపెట్టెకి మార్గదర్శి, అతని వెనక భాస్కర్రావు, సూర్యం కనిపించారు. మార్గదర్శిని చూసి సంతోషపడలేదు హార్మణీపెట్టె. అలా అని కోపమూ రాలేదు. ముఖం పక్కకి తిప్పుకుని నిర్లిప్తంగా ఉండిపోయాడు.

సూర్యాన్ని చూడగానే షాపతనికి కాళ్ళు వణికాయి. నోరు ఎండిపోయింది. వెంటనే హార్మణీపెట్టె చేతులు పట్టుకుని-

"సార్..సార్! మన్నించండి సార్! బుద్ధి గడ్డితింది. మీ కాళ్ళు పట్టుకుంటాను" అని బతిమాలసాగాడు.

భాస్కర్రావుకి ఇక ఓర్పు చచ్చిపోయింది. "మార్గదర్శీ! ఏమిటిది? హార్మణీపెట్టె ఇక్కడ ఎందుకున్నాడు?"

అన్నాడు ఆరాగా.

మార్గదర్శి ఏమీ మాట్లాడలేదు. షాపు కుర్రాడు అంతా వివరంగా చెప్పేశాడు బాల్యచాపల్యం వల్ల. మరుక్షణం సూర్యం ఆ షాపు ఓనరు మీద మండిపడ్డాడు.

"అంత కళ్లు మూసుకుపోయాయా? పరంధామయ్యగారి పేరు చెప్పినా నీకు లక్ష్యం లేకుండాపోయిందే...!" అని ఓ పావుగంట మాటల్తో ఉతికేశాడు ఓనర్ని.

భాస్కర్రావు మార్గదర్శి మీద విరుచుకుపడ్డాడు. "అంత ఒంటి మీద తెలివిలేకుండా పేకాడుతూ ఎందుకు తగలడ్డావు?" అని తిట్టాడు.

మార్గదర్శి వెంటనే హార్మణీ పెట్టె చేతులు పట్టుకుని "అయాం వెరీసారీ! వెరీ వెరీ సారీరా" అన్నాడు.

పేలవంగా నవ్వాడు హార్మణీ. "పరవాలేదులే! ఇందులో నీ తప్పే ఏముంది. అసలేమిటో నా జాతకమే అంత" అన్నాడు ఏ భావం లేకుండా.

నిలువునా కరిగిపోయాడు మార్గదర్శి. మొత్తానికి క్యారేజ్ తీసుకుని అన్యమనస్కంగానే అందరూ ఇళ్ళకు చేరారు.



## 6

ఇంటికెళ్ళిన మధుసూదనరావు మావగారికి ఆనందరావు గురించి చెప్పాడు. తిలక్‌గారి సంతోషానికి అవధుల్లేవు.

"మధూ! నువ్వెళ్లి రావడం ఎంత మంచిదయిందో చూశావా! ఎవరికీ చెప్పలేదుగానీ నా మనసు మనసులో లేదు ఇన్నాళ్ళనుండి. ఇపుడు నా మనసుకి తృప్తిగా వుంది" అన్నారు తిలక్.

అక్కణ్నించి లేచి స్వర్ణలత దగ్గరికి వెళ్ళి ఆనందరావుని వర్ణించి చెప్పాడు. "ఎంత సరదాగా ఉన్నాడో చెప్పలేను స్వర్ణలతా! నువ్వు అదృష్టవంతురాలివి" అన్నాడు మధుసూదనరావు.

స్వర్ణలత మనసు పులకించిపోయింది. బుగ్గలు ఎర్రబడిపోయాయి. అక్కణ్నించి పారిపోయింది 'పెళ్లిరోజు ఎప్పుడో' అనుకుంటూ.

ఆరోజు ఆనందరావుని పెళ్లికొడుకుని చేశారు. ముఖంలో కళా కాంతీలేవు. ఏ కారణం వల్లనైనా పెళ్లి ఆగిపోతే బావుండుననుకుంటున్నాడు.

కానీ అలా జరగలేదు. అనుకున్న ప్రకారం, అనుకున్న టైముకి పెళ్లికి తరలి వెళ్ళక తప్పలేదు. కుర్రవాళ్ళంతా బస్సు దద్దరిల్లిపోయేలా అల్లరి చేస్తున్నారు. పెద్దవాళ్లు సరదాగా వీళ్ళ అల్లరి చూస్తూ కూర్చున్నారు. బస్సు అమలాపురం చేరింది.

స్వర్ణలత వైపు వాళ్లు పెళ్లివారికి ఎదురొచ్చి తీసుకెళ్లి విడిదిలో ఉంచారు.

ఆనందరావును చూసొచ్చిన స్వర్ణలత స్నేహితురాళ్లు, హేమ, తిలక్‌గారు, రుక్మిణమ్మ అందరూ వరసగా వచ్చి "స్వర్ణా! ఎంత అదృష్టవంతురాలివే నువ్వు" అంటూ అభినందించారు.

స్వర్ణ సంతోషం పట్టలేకపోతోంది. ఎంత దాచుకున్నా దాగని చిరునవ్వు, మాటిమాటికి ఎర్రబడుతున్న బుగ్గలు,

బరువుగా వాలిపోతున్న కళ్లు ఆ అమ్మాయి పరవశత్వాన్ని అందరికీ తెలియజేస్తున్నాయి.

'ఒక్కసారి వెళ్లి చూస్తే బావుండు. ఎలా వున్నారో? ఏం చేస్తున్నారో! తనూ నన్నిలాగే తల్చుకుంటూవుంటారా? ఉన్నపాటున వెళ్ళి ఆయన ఎదుట నిలబడితే చూసీచూడగానే తను పెళ్లికూతుర్నని గుర్తుపట్టేయగలరా? ఏమంటారో' అనుకుంటూ కాబోయే భర్తనే తల్చుకుంటూ మేడ మీది తన గది లోంచి దూరంగా కనబడుతున్న విడిది వైపు చూస్తూ వుండిపోయింది స్వర్ణలత.

ఆరాత్రి భోజనాలకి వచ్చినపుడు పరంధామయ్య, మాణిక్యాంబ కోడల్ని చూశారు. అన్నపూర్ణ, కామేశ్వరి ప్రేమగా పలకరించి హాస్యాలు పట్టించారు.

తెల్లవారుజామునే పెళ్లి. స్వర్ణలతకి నిద్రపట్టటంలేదు. తను చదివిన నవలల్లోని హీరోయిన్లే గుర్తొస్తున్నారు. మెడలోని లాకెట్ గొలుసును సవరించుకుంటూ 'మరికొన్ని గంటల్లో నా మెడలోకి మంగళసూత్రాలు వచ్చేస్తాయి. నల్లపూసలు, మట్టెలూ వస్తాయి. అపుడు నేను స్వర్ణలతను కాదు. స్వర్ణలతా ఆనందరావు నయిపోతాను' అనుకుంది కళ్ళవెంట ఆనందబాష్పాలు రాలుతుండగా. 'అబ్బ! ఇంకా ఎంతసేపు! త్వరగా గడియారం తిరిగిపోతే బావుండు' అనుకుంటూ నిద్రరాక పక్కమీద అటూ ఇటూ పొర్లసాగింది.

విడిదిలో అందరూ ఎవరి గోలలో వాళ్లున్నారు. పెద్దవాళ్లంతా నిద్రపడ్డారు. గాయత్రి, సుశీల, అన్నపూర్ణ ఈడు వాళ్ళంతా రేపు ఏం చీరలు కట్టుకోవాలో, ఏం నగలు పెట్టుకోవాలో గుసగుసలాడుకుంటున్నారు.

మరోమూల భాస్కర్రావు స్నేహబృందం మహా హడావుడిగా వున్నారు.

ఈ సందడికి దూరంగా ఓ వారగా ఏకాంతంగా కూర్చుని వున్నాడు ఆనందరావు. అతని మనసంతా శూన్యంగా వుంది. ఏ ఆలోచనా రావడం లేదు. స్తంభానికి ఆనుకుని దిగులుగా ఆకాశంలోకి చూస్తూ కూర్చున్నాడు. అలా కూర్చునే ఎపుడు నిద్రపోయాడో... దద్దరిల్లిపోతూ మోగిన మేళాల చప్పుడుకి ఉలిక్కిపడి లేచాడు.

అంతలోనే అన్నపూర్ణ, కామేశ్వరి పరుగున వచ్చేశారు. 'లె లే!' అంటూ హడావుడి పెట్టేశారు. మరో అరగంట తర్వాత పెళ్లికొడుకు ఊరేగింపు పెళ్లి మంటపం వైపు బయల్దేరింది.

స్వర్ణలతని అలంకరించి గదిలో కూర్చోబెట్టారు. మేళాలు వినగానే పెళ్ళికొడుకు వచ్చేస్తున్నాడంటూ అంతా పరిగెత్తారు. స్వర్ణలతకి మనసు నిలువలేదు. పరుగున పిట్టగోడ దగ్గరికి వెళ్లింది.

కారు నెమ్మదిగా వస్తోంది. టాపు ఉండడం వల్ల ఏదీ కనిపించడం లేదు. గేటుదగ్గర ఆగింది కారు. తలుపు తెరిచారెవరో. ముందు కామేశ్వరి దిగింది. తర్వాత పెళ్లికొడుకు ఆనందరావు దిగాడు.

అబ్బ! ఎంత ఠీవిగా, ఎంత అందంగా వున్నారు! చూసేవాళ్ళందరూ పైకి సంతోషపడినట్లు కనిపించినా లోలోపల తన అదృష్టానికి ఏడుస్తూ వుంటారు. గేటు దగ్గర ఆగిపోయారేం! ఒక చెయ్యి తోటి పెళ్ళికొడుకు కాబోలు పట్టుకున్నాడు. మరో చేతిలో తాంబూలం

వుంది. జుట్టు మాటిమాటికీ నుదుటి మీద పడుతోంది. రెండు చేతులూ ఖాళీగా లేవు పాపం. తల ఎగరేసి జుట్టు సర్దుకోవాల్సి వస్తోంది పాపం. వెంటనే పరిగెత్తుకు వెళ్ళి ఆ క్రాపు సరి చెయ్యాలని పిస్తోంది. ఎందుకో మరి విసుగ్గా, చిరాగ్గా వుంది మొహం. ఉట్టి పుణ్యానికి ఎంత సేపు నిలబెట్టారో ఆ గేటుదగ్గర! అందుకేనేమో ఆ విసుగు. అసలీ అక్కకి బుద్ధిలేదు. అన్నీ సిద్ధంగా వుంచుకోకూడదూ! ఏవిటో



హడావుడి పడుతుంది. ఏదీ సరిగా చెయ్యడు. అదిగో వచ్చింది మహాతల్లి. అమ్మ, ఇంకెవరెవరో కల్సి అతనికి ఎఱ్ఱ నీళ్లు దిష్టితీశారు. ఎవరో పెద్ద ముత్తయిదువ చెంబుతో నీళ్ళు తీసుకుని కాళ్లు కడుగుతోంది. అతను కుడిచేత్తో పాంటు సుతారంగా పైకి పట్టుకున్నాడు. అందరితో బాటు అతనూ లోపలికి వెళ్ళిపోయాడు.—పందిరి అడ్డం వచ్చేసింది. ఉసూరు మనిపించింది స్వర్ణలతకి. నిరాశగా వెనక్కి తిరిగొచ్చి తన గదిలో కూర్చుంది.

స్వర్ణలత స్నేహితులు కిల కిల నవ్వుతూ వచ్చేసి "స్వర్ణా! మీ శ్రీవారు ముభావంగా, మూతిబిగించుకుని కూర్చున్నారు. పలకరించినా నవ్వడం లేదు. మరీ చిరునవ్వయినా ఎరగని వాడిలా వున్నాడే..." అని దీర్ఘాలు తీశారు.

ఒళ్ళు మండిపోయింది స్వర్ణలతకి. అవునుమరి. ఇంతోటి సుందరాంగులు బయల్దేరారని ఇకిలిస్తూ మీతో మాట్లాడతారు రమ్మని' అనుకుంది కోపంగా.

మరి కాసేపుగడిచింది. స్వర్ణని గౌరీ పూజకి కూర్చోబెట్టారు. ఆనందరావుని పీటలమీద కూర్చోబెట్టారు. యాంత్రికంగా ఎవరేది చెబితే అది చేస్తున్నాడు ఆనందరావు. అతని వెనక అన్నపూర్ణ, కామేశ్వరి నిలబడి వున్నారు. మాటిమాటికీ తమ్ముడి చెవిలో ఏదో చెప్తూనేవుంది కామేశ్వరి. క్షణానికోసారి "ఏమిటి మరిది మహాశయా! ఎవరిమీద ఆ చిరాకు? పాత 'అర్థాంగి'లో నాగేశ్వరరావులా వున్నావు" అంటూ ఏడిపిస్తోంది అన్నపూర్ణ.

ఇదంతా పరమ చిరాకుగా వుంది ఆనందరావుకి. ఉన్నపాటునలేచి ఆ పురోహితుడిని ఒక్క తన్ను తన్ని ఎక్కడికైనా వెళ్లి ఒంటరిగా కూర్చోవాలని పిస్తోంది.

స్వర్ణలతని పీటలమీదికి తీసుకువచ్చారు. ఎఱ్ఱటి బనారస్ చీర, అదే రంగు జాకెట్టు, ఒంటినిండా నగలు, పూల జడ... జగన్మోహినిలా వుంది.



కన్యాదానం అయింది. జీలకర్ర బెల్లం పెట్టడం అయింది.

ఆనందరావు స్పర్శ తగిలినపుడల్లా స్వర్ణలతకు కరెంట్ షాక్‌లా వుంది. ఆనందరావుకి మాత్రం పురోహితుడి చెయ్యి తగిలితే ఎలా వుందో ఆ అమ్మాయి చెయ్యి తాకినా అలాగేవుంది.

తెర తీశారు. ఇద్దరినీ పక్క పక్కన కూర్చోబెట్టి మంగళసూత్రాలకు పూజ చేయించారు. ఎంతో భక్తితో చేసింది స్వర్ణలత. మొక్కుబడిగా నాలుగు అక్షింతలు విసిరేశాడు ఆనందరావు.

ఆనందరావుని లేచి నిలబడమన్నాడు పురోహితుడు. మంగళసూత్రం చేతికి అందించాడు. అప్పటిదాకా యాంత్రికంగా అన్నీ చేసుకుపోతున్న ఆనందరావు వులిక్కిపడ్డాడు. చేతులు వణికాయి. స్థాణువులా నిలబడిపోయాడు.

పక్కనే వున్న సూర్యం మండపం మీదికి వచ్చి ఉత్తరీయం ఫొటోలో పడకుండా సవరించే నెపంమీద వంగి బావమరిది చెవిలో—

"ఆనంద్...ఏమిటిరా ఇది! కానియ్. సూత్రం కట్టు" అన్నాడు మెల్లిగా. మరోసారి ఉలికిపడ్డాడు ఆనందరావు. ఒక్క క్షణం పెళ్ళికూతురి తలవంక చూశాడు. వెంటనే వంగి మూడుముళ్లు వేసేశాడు. అక్షింతలు జల్లుగా కురిశాయి.

దీర్ఘంగా నిట్టూర్చాడు ఆనందరావు. తేలిగ్గా వూపిరి పీల్చుకుంది స్వర్ణలత.

తలంబ్రాలు ముగిశాయి. చదివింపులు అయిపోయాయి. దంపతులిద్దర్నీ హోమం చేయించడానికి లోపలికి తీసుకెళ్లారు.

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. అందరూ కాఫీ ఫలహారాల హడావుడిలో వున్నారు. వీళ్ళిద్దర్నీ కూర్చోబెట్టి ఆ పురోహితుడు కూడా కాఫీ తాగడానికెళ్లాడు.

మెల్లిగా తల తిప్పి భర్తను చూసింది స్వర్ణలత. కొంచెం ముందుకి వంగి నుదురు చేత్తో రాసుకుంటున్నాడు.

"అలావున్నారేం? తలనొప్పిగావుందా? కాఫీ తెప్పించనా?" అంది స్వర్ణలత అతన్నే చూస్తూ.

చివాల్న తలతిప్పి మొదటిసారి స్వర్ణలతను చూశాడు ఆనందరావు. తన చూపులు అతని చూపులతో కలవగానే కళ్లు వాల్చుకుంది స్వర్ణలత. పరీక్షగా చూశాడు. ఎందుకో బాధనిపించిందతనికి.

అతని దగ్గర్నించి ఏ సమాధానమూ రాకపోయేసరికి మళ్ళీ తలెత్తి చూసింది స్వర్ణలత.

"అలా వున్నారేం? ఒంట్లో బాలేదా మీకు? ఏదైనా టాబ్లెట్ వేసుకుంటారా?" అనడిగింది ప్రేమ ఉట్టిపడేలా.

"అబ్బే ఏంలేదు. నేను బానేవున్నాను" అన్నాడు ఆనందరావు తడబడుతూ. నవ్వుకుంది స్వర్ణలత.

మిగతా కార్యక్రమాలు కూడా పూర్తయ్యాయి. ఆ సాయంత్రం గ్రాండుగా పాట కచేరీ ఏర్పాటు చేశారు. రాత్రి అప్పగింతలు చేసేశారు.

మరునాడు శోభనం అయ్యాక దంపతుల్ని తీసుకురమ్మని చెప్పి పెళ్లివారు వెళ్లిపోయారు; పెళ్లికొడుకుతో కామేశ్వరి, అన్నపూర్ణ వుండిపోయారు. పెళ్లివారితో వెళ్లిన సూర్యం, భాస్కర్రావు అక్కడ ఏర్పాట్లు చూసి రాత్రికి వచ్చి మళ్ళీ తెల్లారాక వీళ్ళను తీసుకు వెళ్లారు. ఆ తర్వాత అక్కడ గృహప్రవేశం, సత్యనారాయణ వ్రతం అవన్నీ జరుగుతాయి.

తెల్లవారుఝామున పెళ్లివారిని పంపి

ఎక్కడివాళ్ళక్కడ బద్ధకంగా పడుకున్నారు. సాయంత్రం చీకటి పడ్డాక ఆడపిల్లలందరూ కల్సి గదిని చక్కగా అలంకరించారు.

తలంటు పోసుకున్న జుట్టు చిక్కు-తీసి జడవేసి మల్లెపూలమాలలు చుట్టింది కామేశ్వరి. తోడికోడలికి బొట్టు పెట్టి తెల్లటి బిన్నీ సిల్కుచీర అందించింది అన్నపూర్ణ.

ఈలోపల భాస్కర్రావు, సూర్యం తిరిగి వచ్చారు. భోజనాలు అయ్యాక స్వర్ణలతను అన్నపూర్ణ, హేమలత, కామేశ్వరి ముఖం కందిపోయేలా హాస్యంచేసి మెల్లగా తీసికెళ్ళి గది బయట వదిలేసి నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

తడబడే అడుగులతో మెల్లగా గదిలోకి వెళ్ళింది స్వర్ణలత. దూరంగా కిటికీ దగ్గర నిలబడి బైటికి చూస్తున్నాడు ఆనందరావు. స్వర్ణలత తలుపు గడియ వేసిన శబ్దానికి వెనక్కి తిరిగి చూశాడు.

అతని దగ్గరగా వచ్చి వంగి దణ్ణం పెట్టబోయింది స్వర్ణలత. గబగబా వెనక్కి అడుగేసి "ఆగండి స్వర్ణలతా! మీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు గంభీరంగా.

తలెత్తి చూసి నవ్వింది. "అలాగే మాట్లాడండి. కానీ ముందు..." అంటూ మళ్ళీ వంగబోయింది.

"ప్లీజ్! నాకు మీరు దణ్ణం పెట్టద్దు. నేనే మీకు దణ్ణం పెట్టాలి. కాస్త నా మాట వినండి" అన్నాడు చేతులుజోడించి.

అయోమయంగా చూసింది స్వర్ణలత. "చెప్పండి" అంది.

"అలా కూర్చోండి" అంటూ మంచం చూపించాడు.

ఆశ్చర్యంగా చూస్తూనే కూర్చుంది. తను ఎదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

"స్వర్ణలతా! మీకెలా చెప్పాలో అర్థం కావడం లేదు! మీకు చాలా అన్యాయం చేశాను" అన్నాడు.

నిలువు గుడ్లతో అతన్నే చూస్తూ కూర్చుంది స్వర్ణలత. 'ఏమిటిది అచ్చం నవలల్లో లాగే జరుగుతోంది' అనుకుంది భయంగా.

ఒక్కక్షణం తలవంచుకుని కూర్చుని—

"స్వర్ణలతా! నన్ను మీరు క్షమించాలి. నాకు ఈ పెళ్ళి ఇష్టంలేదు" అన్నాడు మెల్లిగా.

కళ్ళు మసకలు కమ్మాయి స్వర్ణకి. భూమి అంతా గిర్రున తిరిగిపోతున్నట్లుంది. కళ్ళు నీళ్ళు తిరిగాయి. తమాయించుకుని—

"ఏమిటి మీరనేది?" అంది విసురుగా.

"అవును స్వర్ణలతా! నాకీపెళ్ళి ఏమాత్రం ఇష్టంలేదు. మా వాళ్ళ బలవంతం మీద విధిలేక ఈ పెళ్ళికి ఒప్పుకున్నాను"

ఒంటికి కారం రాసుకున్నట్లయింది స్వర్ణలతకి. చివాల్న లేచి నిలబడి

"ఏమిటి! ఈ పెళ్ళి మీకిష్టంలేదా? మీ వాళ్ళు కాళ్ళూ చేతులూ కట్టి పెళ్ళి చేయడానికి మీరేమైనా పసిపాపాయా? ఇష్టం లేకుండా పెళ్ళి చేసుకునే ఖర్మేమొచ్చింది. స్పష్టంగా చెప్పి మానెయ్యొచ్చుగా" అంది విసురుగా.

దీర్ఘంగా నిట్టూర్చాడు ఆనందరావు. "మానేద్దామనే ఎంతో ప్రయత్నించాను స్వర్ణలతగారూ! నా శాయశక్తులా ప్రయత్నించాను. మావాళ్ళు నా నోరు మూయించి బలవంతాన పెళ్ళికిఒప్పించారు అప్పటికీ ఇష్టంలేక పెళ్ళి చూపులకిరాలేదు.

మీ నాన్నగారి పేర ఆకాశరామన్న ఉత్తరాలు కూడా రాశాను. కానీ విధి వైపరీత్యం. ఎంత ప్రయత్నించినా ఫలితం లేకపోయింది"

"విధి వైపరీత్యంకాదు. మీ తెలివితక్కువతనం. మీ వాళ్ళ కుసంస్కారం, ఇంత డొంకతిరుగుడు వ్యవహారం ఎందుకు? ఆకాశరామన్న ఉత్తరాలు రాసే బదులు, నేరుగా మీరే నాకీ పెళ్లి ఇష్టం లేదని తెలియజెయ్యవచ్చుగా"

"ధైర్యం చాలలేదు" అన్నాడు అస్పష్టంగా.

"బావుంది...చాలా అందంగావుంది. అపుడు వుండాల్సిన ధైర్యం స్థానంలో పిరికితనం ఆవహించింది. ఆ ధైర్యం అంతా ఈరోజు బైటపడింది. అంతేనా?" అంది ఉక్రోషంగా.

సూటిగా స్వర్ణలతని చూశాడు ఆనందరావు 'ఈ అమ్మాయి మంచిధైర్యస్తురాలు' అనుకున్నాడు.

"చూడండి స్వర్ణలతగారూ! మీరు ఎన్ని అన్నా, ఎంత నిందించినా నేనేమీ అనుకోను. మీ ఇష్టం వచ్చినట్లు నన్ను నిందించండి. మీ కసి తీరేదాకా తిట్టండి" అన్నాడు తలవంచుకుని.

తలెత్తిచూసింది స్వర్ణలత. ఎదురుగా ఉన్న అతని అందమయిన రూపం ఆమెలోని కాఠిన్యాన్ని కొంత వరకు కరిగించింది.

"చూడండీ! అసలీ పెళ్లి మీకెందుకు ఇష్టం లేదు?" అనడిగింది మృదువుగా.

అప్పటిదాకా స్వర్ణలత కాఠిన్యాన్ని చూసిన ఆనందరావుకి ఆమె మృదువుగా మాట్లాడ్డంతో కొండంత ధైర్యం వచ్చింది.

"చెప్తాను స్వర్ణగారూ! మీకు చెప్పకుండా దాచగలనా? నేను మరో అమ్మాయిని మనస్ఫూర్తిగా, గాఢంగా ప్రేమించాను. ఆవిడకు తప్ప మరొకరికి నా మనసులో స్థానంలేదు" అన్నాడు.

కుప్పకూలిపోయింది స్వర్ణలత. అయిపోయింది. తన బతుకు నాశనం అయిపోయింది. ఎన్నో కలలుగన్న తియ్యటి జీవితం తగలబడిపోయింది. పెళ్లి చేసుకుని ఆ యువకుడికి భార్యగా, అతని జీవితానికి ఒక అర్థంగా మారిపోవాలనుకున్న తన భర్త మనసులో తనకే మాత్రం స్థానంలేదన్న సంగతి స్పష్టంగా తెలిసిపోయింది. నాకు మరింత కట్నం డబ్బులు కావాలంటే నాన్నగారినడిగి తెచ్చిచ్చేది. నీకు డిగ్రీలేదంటే ఎలాగో కష్టపడి చదివి డిగ్రీ తెచ్చుకునేది. కానీ ఇవేవీ కావు. నా మనసులో నీకెంత మాత్రం స్థానంలేదని కుండబద్దలుకొట్టి చెప్పేస్తున్నాడు. ఏం చెయ్యడం?

కోపం, దుఃఖం, నిరాశ స్వర్ణను పిచ్చిదాన్ని చేసేశాయి. "మరి అంతగా ప్రేమించినవారు, అంతగా ఆరాధించినవారు ఆవిడనే పెళ్లి చేసుకోలేకపోయారా? నా బతుకు నట్టేట్లో ముంచడం ఎందుకు?" అంది దుఃఖం బలవంతాన దిగమింగుకుంటూ.

దీర్ఘంగా నిట్టూర్చాడు ఆనందరావు. "అది నా దురదృష్టం స్వర్ణలతా! అటు ప్రేమించిన అమ్మాయికీ సంతోషం కలిగించలేకపోతున్నాను. ఇటు పెళ్లి చేసుకున్న మిమ్మల్నీ బాధపెడుతున్నాను. కొందరి జీవితాలంతే! అలా నిరాశగా మొదలయి, నిరాశగా సాగి, నిరాశతోనే అంతం అయిపోతాయి."

తలెత్తి అతనివంక చూసింది. ఈ సంఘటన ఏ సీరియల్ నవల్లోనో అయితే ఇక్కడ సశేషం అని ఆపేస్తే

్రంచలేని ఉత్కంఠతో వచ్చే పత్రిక కోసం ఎదురుచూసేది. అప్పటికీ ఆగలేక పోతే 'మీ కొత్త సీరియల్ ఎంతో బావుంది. అందులో హీరో పాత్ర అద్భుతం, ఎంతో ఉదాత్తంగా ఉంది. రాసిన రచయిత్రికి, తను అభినందనలు. ప్రచురిస్తున్న మీకు శత కోటివందనాలు. ఎపుడు మళ్ళీ పత్రిక వస్తుందా అని ఎదురుచూస్తున్నాను' అని రాసి వుండేది.

కానీ ఇపుడీ హీరో స్వభావం ఉదాత్తంగా అనిపించడం లేదు. చాచిలెంప కాయ కొట్టాలనిపిస్తోంది. పీక పిసికెయ్యా లనిపిస్తోంది. అందుకే—

"సర్లెండి. ఇంతకీ ఆ సుందరీమణితో మీ పెళ్ళెందుకవలేదు?" అంది వ్యంగ్యంగా.

"ఏం చెప్పమంటారు స్వర్ణలతా! ఆ అమ్మాయి క్రిస్టియన్. నేను హిందువుని. మా పెళ్లి పెద్దల ఆమోదం పొందలేక పోయింది. అందుకే దూరమయిపోయాం" అన్నాడు దీనంగా.

"పెద్దవాళ్లు ఒప్పుకోకపోతే ఏం? ఎదిరించి పెళ్లి చేసుకోవచ్చుగా. ఇపుడిలా ఇద్దరినీ ఏడిపించుకు తినటం సంతోషంగా వుందా? అసలు స్వతంత్రభావాలు లేని వాళ్ళు, పెద్దవాళ్ళ మాటకు గంగిరెద్దుల్లా తలలూపేవాళ్లు ఇలాంటి ప్రేమ వ్యవహారాల్లో దిగడానికి అనర్హులు" అంది నిష్కర్షగా.

"మీరు చెప్పింది నిజమే స్వర్ణలత గారూ! నేను స్వతంత్రంలేనివాణ్ని. అందుకే ఇలాంటి ప్రేమలకీ, ధోమలకీ దూరంగా వుండేవాణ్ణి. కానీ, పాపం తనే మనస్ఫూర్తిగా నన్ను ప్రేమించి, తనే నన్ను పెళ్లి చేసుకోమని ఎంతగానో బతిమాలుకుంది. అలాంటపుడు నేనెలా కాదనగలను చెప్పండి? అందుకే మా వాళ్ళెవరికీ ఇష్టంలేకపోయినా నామనసులో ఆ అమ్మాయికి చోటిచ్చాను" అన్నాడు ఆనందరావు పరవశంగా.

స్వర్ణలతకి అతన్ని చూస్తుంటే భరించ లేనంత అసహ్యం కలిగింది.

"ఉద్ధరించారు. చెప్పకుందుకు సిగ్గ యినా లేదు మీకు. ఆవిడకేమో మనసులో చోటు ఇచ్చి పెళ్లి చేసుకోకుండా అన్యాయంచేశారు. నన్ను పెళ్లాడి మీ మనసులో చోటివ్వలేక ఏడిపిస్తున్నారు.మీ లాంటి వారొక్కరున్నాచాలు ఆడపిల్లలకి మగజాతి మీద అసహ్యం పుట్టడానికి"

"అవును. మీ ఆడజాతి మహామంచిది కదూ! మగవాళ్లకి వెర్రెక్కించి ఏడిపిం చడంలో మీకు మీరే సాటి"

"నేనా! నేనేం చేశాను?"

"మీరంటే మీరుకాదు. నా ప్రేయసి. ఏ పాపం తెలీని నన్ను వెర్రివాణ్ని చేసి తను హాయిగా వుంది"

ఒక్కక్షణం పరీక్షగా అతనివంక చూసింది. 'భగ్నప్రేమికుడు, ప్రేమోప హతుడు. మెల్లిగా అతని మనసు మార్చి తనవైపు తిప్పుకోవాలి!' అనుకుంటూ దగ్గిరగా వెళ్లింది.

"చూడండి! అసలేం జరిగింది? ఆవిడ, మీరు అంత ప్రేమించుకుంటే ఎందుకు పెళ్ళిచేసుకోలేదు? మీ మనసులో నాకు స్థానం లేకపోవచ్చు. కానీ ఒక స్నేహితురాలిగా భావించి మీ మనసులోని మాట చెప్పవచ్చుగా!" అంది మృదువుగా, అనునయంగా.

ఆ ఆదరానికి కరిగిపోయాడు ఆనంద రావు— "ఏం చెప్పను స్వర్ణలతగారూ! నా మనసంతటా ఆమె ఆక్రమించుకుంది. తనని మర్చిపోదామని, తాళి గట్టిన మీకు దగ్గరవ్వాలని ఎంతగా మనసుకి నచ్చ

జెప్పకుంటున్నా నాతరం కావడం లేదు. మిమ్మల్ని తాకితే ఆవిడకు అన్యాయం జరుగుతుందేమోనని బాధగా వుంది" అన్నాడు.

మనసంతా ఈర్ష్యతో నిండిపోయింది స్వర్ణలతకి. 'ఎవరు, ఎవరా రాక్షసి? ఇంత మంచి భర్తను తనకు కాకుండా చేస్తున్న ఆ పిశాచి ఎవరు?' అనుకుంది కసిగా.

"ఎవరావిడ? చాలా అందంగా వుంటుందా? నాకన్నా బావుంటుందా?" అంది దీనంగా.

తలెత్తి సూటిగా స్వర్ణ వంక చూశాడు. సజీవశిల్పంలా నిలబడివుంది. బంగారు బొమ్మలా వుంది. 'సోనీలాగే స్వర్ణకూడా చాలా మంచిది' అనుకున్నాడు మొదటి సారి. చిన్నగా నవ్వాడు.

"స్వర్ణా! నేను ఆవిణ్ని చూడలేదు. ఇక తన అందం గురించి నాకేం తెలుసు?" అన్నాడు అమాయకంగా.

ఉలిక్కిపడింది స్వర్ణలత. "ఏమిటీ? ఏమన్నారు? మీరావిణ్ని చూడలేదా?" అంది అమితాశ్చర్యంగా.

"లేదు స్వర్ణలతగారూ! చూస్తే నాకీ బాధ ఎందుకు చెప్పండి. ఎంత కష్టమైనా తనని నా స్వంతం చేసుకోనూ!?" అన్నాడు పేలవంగా నవ్వుతూ.

నోట మాట రానట్టు నిలబడింది స్వర్ణ లత. తనకి ఈ పెళ్లి నిశ్చయమయిం తర్వాత తనకి తెలిసిన ఓ అమ్మాయి "స్వర్ణా! నీ కాబోయే భర్తకి కాస్త పిచ్చి అని విన్నాను" అంది. అప్పట్లో అది తేలిగ్గా కొట్టిపారేసింది గానీ ఇపుడు ఇతన్ని చూస్తుంటే ఏదో అనుమానంగానే వుంది. అయినా తప్పుతుందా! తాళి కట్టించుకున్న తర్వాత పిచ్చి అయినా తప్పదు, వెర్రి అయినా తప్పదు అను కుని దీర్ఘంగా నిట్టూర్చింది.

"చూడండి! నాకేమీ అంతు బట్టడం లేదు. కాస్త వివరంగా చెప్పండి. అసలు మీ ప్రేయసి ఎవరు?" అంది స్వర్ణలత.

'పాపం పిచ్చిపిల్ల' అనుకుని తనకి వచ్చిన ఉత్తరం సంగతి, ఆ తర్వాత తనా అమ్మాయికోసం వెతికి వేసారి పోయిన సంగతీ చెప్పాడు.

ఏదో అనుమానం వచ్చింది స్వర్ణలతకి గుండె దడదడా కొట్టుకుంటోంది. ఒళ్లంతా చెమటలు పట్టేశాయి. "మీ దగ్గ రుందా ఉత్తరం? నేను చూడచ్చా?" అంది అతి కష్టం మీద మనసు అదుపులో పెట్టు కుని.

"ఉంది స్వర్ణా! నా దగ్గరే వుంది. ఇపుడేకాదు. ఎప్పుడూ నాదగ్గరేవుంటుంది ఆ ఉత్తరం. కానీ మీరు నన్ను క్షమించాలి. నేను ఆ ఉత్తరాన్ని మీకు చూపించలేను. పర్సనల్... పూర్తిగా పర్సనల్" అన్నాడు పరవశంగా, మోహమాటంగా.

చిన్నగా నవ్వింది స్వర్ణలత. "పోనీ ఏం రాసిందో కొంచెం చెప్పకూడదూ!" అంది బతిమాలుతూ.

మోహమాటంగా చూసి "సరే ఉండండి" అంటూ అతనికి కంఠస్థంగా వచ్చేసిన ఆ ఉత్తరంలోని మొదటి పేరా అప్పజెప్పేశాడు.

"ఇపుడు చెప్పండి స్వర్ణలతగారూ! తను నా కోసం అంత తపించిపోతుంటే నేను సుఖంగా ఉండగలనా? తన ప్రేమను కాదనగలనా? తను నా ఎదుట లేక పోవచ్చు. కానీ నా మనసులో స్థిరంగా నిలిచిపోయింది. అటువంటమ్మాయిని మర్చి పొమ్మని అందరూ సలహాలు చెప్పారు నాకు. మీరు చెప్పండి స్వర్ణలతగారూ!

నా సోనీని నేను మర్చిపోగలనా? నేను మోసగాడిననీ, మనసులేని వాడిననీ, మగజాతి అంతా ఇంతేననీ నిందించారు మీరు. కేవలం సోనీ అన్న పేరుతప్ప వేరే ఏ వివరమూ తెలీని నేను నా సోనీ కోసం ఎక్కడ వెతకను? ఎలా వెతకను? నాకు తన మీద ఎంత కోపంగా ఉందో తెలుసా? నా కంట పడాలేగాని చెంపలు వాయించేస్తాను. స్వర్ణగారూ! అసలు నా సోనీ ఎప్పటికైనా నాకు కనిపిస్తుందా?" అన్నాడు ఆనందరావు.

అతనివంక కన్నార్పకుండా చూస్తున్న స్వర్ణ పగలబడి నవ్వి మళ్ళీ విరగబడి నవ్వింది. కళ్ళనీళ్ళు తిరిగేదాకా నవ్వింది.

"ఎందుకలా నవ్వుతారు?" అన్నాడు కంగారుగా.

"అబ్బ ఇంక నవ్వలేను బాబూ!" అంటూ మళ్ళీ నవ్వింది.

"మిమ్మల్నెవరూ నవ్వమని బతిమాల్లేదుగా! ఎందుకంత నవ్వు" అన్నాడు చిరాకుగా ఆనందరావు.

"నవ్వక ఏంచెయ్యమంటారు చెప్పండి? మీ అంత తెలివి తక్కువ మనిషిని నేనింతవరకూ చూడలేదు. ఎవరో వూసుబోక పిచ్చిది ఉత్తరం రాసింది. మీరా ఉత్తరం పట్టుకుని కలల్లో తేలిపోతూ గాలిమేడలు కడుతున్నారు. బావుంది. చాలా బావుంది" అంది నవ్వుతూ.

"స్వర్ణగారూ! మీకు నా సోనీ పిచ్చిదిగా కనిపించిందా? తన ప్రేమ మీకంత ఎగతాళిగా ఉందా?" అన్నాడు విసురుగా.

"కాకపోతే ఏమిటండీ! ముక్కూ మొహం తెలియని ఒక మగవాడికి అంత ధైర్యంగా ఉత్తరం రాయగలిగిన మనిషికి నీతీ జాతీ ఉన్నాయంటారా?" అంది స్వర్ణ.

మండిపడ్డాడు ఆనందరావు. "ఏం? రాస్తే ఏం? మగవాళ్ళు అమ్మాయికి ప్రేమలేఖలు రాయడంలేదూ? అమ్మాయి అబ్బాయికి రాస్తే తప్పా? అందులో తనేం అసభ్యంగా రాయలేదే? పవిత్రంగా పెళ్ళి చేసుకుందాం అని రాసింది. అంత మాత్రాన ఆవిడ నీతి తప్పిందని ఎందుకనుకోవాలి?"

మరింత నవ్వింది స్వర్ణ. "చాల్లే! ఊరుకోండి. మీరుట్టి వెర్రివారిలాగా ఉన్నారే! అసలు పెళ్ళికి ముందే అన్నీ వూహించుకున్న ఆ అమ్మాయికి ఎన్ని చెడు స్నేహాలున్నాయో! ఇలా ఎంతమందికి పెళ్ళిళ్ల చేసుకోమని ఉత్తరాలు రాసిందో ఆ మహాతల్లి!" అంది ఈసడింపుగా.

"స్వర్ణా!" అని గర్జించాడు ఆనందరావు. "మీరు హద్దులుమీరి మాట్లాడుతున్నారు. ఎంత తేలికగా అంచనా వేశారు ఆ అమాయకురాలిని! మీరు మగవారై ఉంటే ఆ ప్రేమలోని తియ్యదనం ఏమిటో తెలిసేది. ఆ అమాయకురాలి అర్థింపు తెలిసివచ్చేది. ఆ ప్రేమ ఎంత గొప్పదో, ఎంత పవిత్రమైనదో తెలుసుకోగలిగేవారు. కానీ మీరు స్త్రీ. సాటి స్త్రీ విషయంలో మీకు ఈర్ష్య తప్ప వేరే దేనికీ తావుండదు. మీరేదో సంస్కారవంతులని అనుకున్నాను. కానీ మీరూ సగటు ఆడపిల్లగానే ఆలోచిస్తున్నారు. అయినా మీరు నా భార్య గనక నా సోనీని అంతంత మాటలన్నా గాని మిమ్మల్ని క్షమించేస్తున్నాను" అంటూ విసురుగా వెళ్ళి కిటికీ దగ్గర నిలబడ్డాడు ఆనందరావు.

రెండు క్షణాల తర్వాత తలుపు తెరిచిన శబ్దం అయితే తలతిప్పి చూశాడు.

అప్పటికే స్వర్ణ బయటకి వెళ్ళిపోయింది.

గదిలోంచి బైటికి వచ్చిన స్వర్ణలత తిన్నగా తండ్రి గదిలోకి వెళ్ళింది. తిలక్ గారు ఏదో లెక్కలు వేసుకుంటున్నారు.

"నాన్నగారూ !"

తలఎత్తి చూశారు. ఎదురుగా స్వర్ణలత. చివాల్న తల తిప్పి గడియారం వంక చూశారు. రాత్రిపదకొండున్నర దాటింది.

"చిన్నమ్మడూ! ఏమిటమ్మా ! ఏం కావాలి?" అన్నారు.

"మీ గీతామకరందం పుస్తకం కావాలి నాన్నగారూ" అంది.

నోటమాట రాలేదు తిలక్ గారికి. తండ్రి అనుమతికోసం చూడకుండా లోపలికి వెళ్ళి బల్లమీద ఉంచిన గీతామకరందం పుస్తకం తీసుకుని ఇవతలికి వచ్చేసింది. తిలక్ గారి



గుండె చెరువైపోయింది.

వయసులో ఉన్న పిల్ల, కొత్త పెళ్ళికూతురు... మొదటిరాత్రి గీతామకరందం కోసం వచ్చిందంటే ఏమిటి దాని అర్థం? 'తల్లీ చిన్నమ్మడూ! ఏమిటమ్మా! నీ కన్యాయం చేశానా తల్లీ!' అనుకుంటూ మంచంమీద కూలబడ్డారు.

తండ్రి గదిలోంచి వచ్చిన స్వర్ణలత తన గదిలోకి వచ్చి తలుపు మూసుకుంది. గీతామకరందం ప్లాస్టిక్ అట్టకింద క్రిష్ణుడి అడుగున దాచిన గులాబీరంగు కాగితం జాగ్రత్తగా బయటకు తీసింది. మరోసారి చదువుకుంది. మరో తెల్ల కాగితం, పెన్ను తీసి చకచకా ఏదో రాసేసింది.

బయటికి వచ్చి ఆ పక్కనే పడుకున్న చుట్టాలబ్బాయి పదేళ్ళ కుర్రాడిని లేపింది. బద్ధకంగా లేచాడు వాడు– "ఏమిటక్కా" అంటూ.

"ఒరేయ్ బాబిగా! ఈ కాగితాలు తీసుకెళ్లి మేడమీద గదిలో బావగారున్నారు...ఆయనకి ఇచ్చిరా!" అని చెప్పింది.

నిద్రమత్తులోనే లేచి ఆ కాగితాలు పట్టుకుని మేడమీదికి వెళ్లి గదిముందు ఆగి "బావగారూ!"అంటూ ఆవలించాడు.

అన్యమనస్కంగా మంచం మీద వాలిపోయి ఉన్న ఆనందరావు లేచాడు. "ఏం బాబూ! ఏం కావాలి?'' అన్నాడు ఆదరంగా.

"మా అక్క ఈ ఉత్తరం ఇమ్మంది" అని ఉత్తరం ఇచ్చేసి తుర్రున కిందకి వెళ్లిపోయాడు.

ఉలిక్కిపడ్డాడు ఆనందరావు. 'స్వర్ణ ఏమీ అఘాయిత్యం చేయలేదు కదా!' అనుకుంటూ గదిలోకి వచ్చి లైటువేసి చేతిలోని కాగితాలు చూసుకుని అంతెత్తున ఎగిరిపడ్డాడు.

'ఈ గులాబి రంగు కాగితం...! ఈ దస్తూరి...! ఎవరిది? సోనీ! సోనీది. ఏ మాత్రంసందేహం లేదు' అనుకుని వణికే చేతులతో నిలువెల్లా పులకించిపోతూ ఆ ఉత్తరంలోకి దృష్టి పోనిచ్చాడు.

"...విధంగా మనం జీవితం ప్రారంభిద్దాం.మా అక్కయ్య పెళ్లిలో చూశాను. పెళ్లి రెండురోజులు, మూడు నిద్రలు. మరో వారం రోజులు అయ్యేసరికి బావగారి శెలవు అయిపోయింది. వెంట తీసుకు వెళ్ళడానికి ఆషాఢమాసం పనికిరాదు అన్నారు. ఆ తర్వాతి నెల శ్రావణమాసం. నోములు నోచాలి అన్నారు. వాళ్లిద్దరూ పెళ్ళయ్యాక రెండు మూడు నెలలు విడివిడిగానే ఉన్నారు. వాళ్ళని చూస్తే జాలివేసేది నాకు. మనం అలా చెయ్యొద్దు.

పెళ్లికాగానే జమ్మని ఎక్కడికైనా వెళ్లిపోదాం. నువ్వూ, నేనూ అంతే! మనిద్దరమే ఉండేచోటికి నన్ను తీసికెళ్ళు. ఏ మనిషీ, ఏ ఆచారం మనని దూరం చెయ్యలేనిచోటుకి తీసుకెళ్ళు. నేను ముందే చెప్పేస్తున్నాను. నేనే నోములు నోచను. ఏ పూజలూ చేయను. నా నోములపంటవి నువ్వు నా ఎదురుగా ఉంటే నాకింకా నోములెందుకు? నా ఆరాధ్యదైవానివి నువ్వు ఉండగా ఇంకోరికి ఎలా పూజలు చేస్తాను నేను? వచ్చేజన్మ కోసం అంటావా! నాకు తెలుసు మనది జన్మజన్మలబంధం. వెయ్యిజన్మల తరవాతైనా నేను నీదానిని, నువ్వు నావాడివి. కాదనగలవా నువ్వు?

ఈ శరీరం, ఈ మనసు, ఈ అందం, ఈ ఆలోచనలు అన్నీ నీకోసమే.నీవు లేని నేను జీవచ్ఛవాన్ని,దేవుడులేని ఆలయాన్ని దీపంలేని శూన్య గృహాన్ని, వాసనలేని పువ్వుని. ప్రియా! మరి నాకెపుడు నిండుతనాన్నిస్తావు? నన్నెపుడు నీదాన్ని చేసుకుంటావు? నా ప్రియతమా! నా ఆరాధ్యదైవమా! నీకోసం ఎదురుచూస్తుంటాను. స్వాతి వాన కోసం ముత్యపు చిప్పలా, చంద్రునికోసం కలువలా నీ కోసమే నేను వేచి ఉంటాను.

ప్రేమతో, ముద్దులతో
నీ జీవనసహచరి"

ఆ ఉత్తరం పదిసార్లు చదివాడు ఆనందరావు. ఆనాడు తనకి వచ్చిన ఉత్తరంలోని ఆఖరు పేజీ అది.

దాసితో జతచేసిన తెల్ల కాగితం విప్పాడు.

"శ్రీవారూ! ఓ చిలిపినవ్వుల శ్రీవారూ!

ఏమిటీ విచిత్రం! ఎంత తమాషా! ఇది నిజమేనా? నాకు కాస్త కలలుకనే పిచ్చిఎక్కువ. చదువుమీద శ్రద్ధతక్కువ. కలలు కనీకనీ విసుగొచ్చి నా కాబోయే భర్త కోసం ఆరోజు పిచ్చిపిచ్చిగా ఏదేదో రాసేశాను. చింపడానికి చేతులురాక ఏదో చేతికొచ్చిన అడ్రస్‌రాసి పోస్టులో పడేశాను. చివరి పేజీ మరీ పైత్యంగా వుందని దాన్ని తీసేసి మా అమ్మ కంటపడకుండా నాన్నగారి భగవద్గీత పుస్తకంలో దాచాను.

ఆనాడు ఉత్తరం పోస్ట్‌చేస్తూ నా ప్రేమ నిజమైనది అయితే ఇది నా భర్తకు చేరాలని మరీ మరీ కోరుకున్నాను. ఆ తర్వాత ఆ సంగతి నేను పూర్తిగా మర్చిపోయాను.

నేను ఇక్కడే వుండగా నా 'స్వామి' మనసులో నాకు అంత వున్నత స్థానాన్ని ఏర్పర్చిన ఆ ఉత్తరానికి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోను? మీ మనసు మార్చి మీ మెడలు వంచి నాకు భర్తని చేసిన నా అత్తింటి బంధువులకు నేనెలా కృతజ్ఞతలు చెప్పుకోను? ఆకాశరామన్న ఉత్తరాలు లెక్కచెయ్యకుండా నన్ను మీ చేతుల్లో పెట్టిన నాన్నగారికి నేనెలా కృతజ్ఞతలు చెప్పుకోను? అందుకు సహకరించిన మా బావగారికి నేనెలా కృతజ్ఞతలు చెప్పుకోను? అందరికీ మించి మీకు, మీకెలా ... తెలుపుకోను? నేనేం చెయ్యగలను- ఆనంద భాష్పాలతో చేతులు జోడించడం తప్ప. చెప్పండి ...! చెప్పరూ!?

-మీ

స్వర్ణ (సోనీ)"

ఉత్తరం చదివిన ఆనందరావు మరుక్షణం కిందపడి మూర్ఛపోయాడు.

* * *

స్వర్ణలత వెళ్ళిన కాసేపటికి తేరుకున్న తిలక్‌గారు బైటికి వచ్చి మధు గది ముందు ఆగి తలుపు తట్టారు. మధు కళ్ళు నులుముకుంటూ వచ్చి తలుపు తీసి ఎదురుగా మామగార్ని చూసి ఆశ్చర్యపడి-

"ఏమిటి మామగారూ!" అన్నాడు ఆదుర్దాగా.

"బాబూ...మధూ! స్వర్ణ గదిలోంచి వచ్చేసింది. భగవద్గీత అడిగి తీసుకుంది. నాకేదో భయంగా వుంది"

అయోమయంగా చూశాడు మధుసూదన్. ఓ రెండు నిమిషాలు ఆలోచించాడు.

"మామగారూ! మీరేం కంగారుపడకండి. ఆనందరావు చాలా బుద్ధిమంతుడు. ఈ రెండు రోజుల్నించీ చూస్తూనే వున్నాగా. అతని దారేవేరు. సంసార జీవితాన్ని ప్రారంభించేముందు భగవద్గీత చదువుదామనుకుని ఉంటాడు. అందుకే భార్యచేత తెప్పించుకుని ఉంటాడు" అన్నాడు తేలిగ్గా.

"కాదయ్యా! అమ్మాయి కిందనే ఉంది"

"మీకెందుకు. మీరు నిశ్చింతగా ఉండండి. నేను చూస్తానుగా. ఒక్క పావుగంటచూసి ఏమిటో కనుక్కుంటాను" అన్నాడు మధుసూదన్.

* * *

బాబిగాడికి ఉత్తరం ఇచ్చి వస్తూ స్వర్ణగది గుమ్మంలో వున్న గ్లాసు తన్నింది. ఆ శబ్దానికి పక్కగదిలో పడు

కునికున్న అన్నపూర్ణకి . మెలకువ వచ్చింది. లేచి మంచినీళ్లుతాగి మళ్ళీ పడు కుందాం అనుకుంటూ వుండగా పక్క గదిలోంచి మళ్ళీ అలికిడి అయింది.

'ఎవరా' అని తలుపు సందులోంచిచూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

'శోభనం పెళ్ళికూతురు స్వర్ణలత! అర్ధరాత్రి ఇక్కడ వంటరిగా ఏం చేస్తోంది?' అనుకుని మరోసారి పరీక్షగా చూసింది. జడలో మల్లెపూలు అలాగే వున్నాయి. కట్టుకున్న తెల్ల సిల్కుచీర అంతకుముందు కట్టుకున్నట్టే ఉంది. గదిలోకి వెళ్లేటపుడెలా వుందో ఇపుడూ అలాగే ఉంది. అన్నపూర్ణ మనసు ఏదో కీడు శంకించింది. వెంటనేవెళ్లి భర్తను లేపింది.

గత చాలా రోజులుగా రాత్రి నిద్ర లేని భాస్కర్రావు గాఢ నిద్రలో ఉన్నాడు.

"ఏమండీ...లేవండీ" అంటూ కుదిపి లేపింది.

"అబ్బ పడుకో పూర్ణా! అర్ధరాత్రి ఏమిటి భాగవతం?" అన్నాడు నిద్ర మత్తులో.

"అబ్బా...ముందు లేవండీ! కొంప మునిగింది" అంది అన్నపూర్ణ.

లేచి కూర్చున్నాడు భాస్కర్రావు ఆవులిస్తూ. "ఏమిటి ... ఏమైంది?" అన్నాడు ఆదుర్దాగా.

"ఏముంది? 'జీవితం'లో శోభన్‌బాబు లాగ మీ తమ్ముడూ తన పాత ప్రేమ కథ పెళ్ళానికి చెప్పినట్లున్నాడు" అంది.

భాస్కర్రావుకి కోపం ముంచుకొచ్చింది.

"ఛీ!ఫో! వెధవ సినిమా గోల. మళ్ళీ మొదలు పెట్టావా?" అన్నాడువిసుగ్గా.

"సినిమా కాదు. నా తలకాయ కాదు" అంటూ తను చూసింది వివరించింది. గతుక్కుమన్నాడు భాస్కర్రావు. ఒక్క క్షణం నిలువలేకపోయాడు. వెంటనే లేచి తలుపు తట్టి పక్క గదిలోని సూర్యాన్ని పిల్చాడు మెల్లిగా. లేచి బైటికి వచ్చిన సూర్యం-

"ఏమిట్రా! ఏమిటి? నువ్వేం చేసినా సరే నాకిపుడు పేకాడే ఓపిక లేదు. నిద్రరాకపోతే అన్నపూర్ణని లేపి సినిమా కథ చెప్పమను" అన్నాడు.

"జోకులు వెయ్యక చెప్పేది విను. కొంప మునిగింది. మన వెధవ మరో సమస్య సృష్టించాడు" అని అసలు సంగతి బైటపెట్టాడు భాస్కర్రావు.

సూర్యం నిద్రమత్తు, విసుగు దెబ్బకి ఎగిరిపోయాయి.

"ఆ అమ్మాయి ఇక్కడే వుందా?" అనడిగాడు.

అవునని తల వూపాడు భాస్కర్రావు.

"సరే! గుట్టు చప్పుడు కాకుండా పైకి వెళ్లి చూద్దాం పద. 'ఏం చేస్తున్నాడో!" అంటూ హాలువైపు దారితీసిన సూర్యాన్ని అనుసరించాడు భాస్కర్రావు.

హాల్లోకి అడుగుబెట్టబోతూ ఇద్దరూ సడన్‌గా ఆగిపోయారు. అప్పటికే మధు మెట్లు ఎక్కుతున్నాడు. హేమలత, తిలక్‌గారు మెట్ల దగ్గర తచ్చాడు తున్నారు. భాస్కర్రావు, సూర్యం ఒకరి మొహాలొకరు చూసుకుంటూ నిలబడ్డారు.

పైకి వెళ్లిన మధుసూదన్ ఒక్క నిమిషం సంశయించి లోపలికి తొంగి చూశాడు. మరుక్షణం లోపలికి పరిగెత్తాడు. అంతలోనే బైటికి వచ్చి "హేమా!

నా మెడికల్ కిట్ తీసుకురా, అర్జంట్" అని కేక పెట్టి మళ్లీ పరుగున లోపలికి వెళ్లిపోయాడు.

హేమ కంగారుగా వెనక్కి తిరిగింది.

తిలక్ గారు మెట్లెక్కసాగారు. భాస్కర్రావు, సూర్యం ఆదుర్దాగా పరిగెట్టినట్లు మెట్లెక్కేశారు.

ఇదంతా చూసిన అన్నపూర్ణ బేజారై పక్కగదిలోకి వెళ్లి కామేశ్వరిని లేపింది. ఇద్దరూ మేడ మీదికి వెళ్ళారు. అప్పటికే భాస్కర్రావు, సూర్యం, మధుసూదన్ కిందపడి వున్న ఆనందరావుని ఎత్తి మంచం మీద పడుకోబెడుతున్నారు. అందరి ముఖాల్లోను ఆదుర్దా...కంగారు.

కామేశ్వరి పరుగున వెళ్లి తమ్ముడి తల నిమురుతూ "ఆనందూ! ఏమైందిరా నీకు?" అంటూ కళ్ళ నీళ్లు పెట్టుకుంది.

"ఏమీ ఫర్వాలేదు. జస్ట్ ఏదో షాక్ తిన్నాడు. అంతే!" అంటూ ధైర్యం చెప్పాడు మధుసూదన్.

ఫాన్ ఫుల్ స్పీడులో పెట్టి, ముఖాన నీళ్లు జల్లి, స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపించాడు మధుసూదన్. అయిదు నిమిషాల్లోనే కదిలి కళ్లువిప్పాడు ఆనందరావు.

"హేమా! కొంచెం పాలు తీసుకురా" అన్నాడు మధుసూదన్. ఆ గదిలోనే బల్ల మీద వున్న ఫ్లాస్కులోని పాలు గ్లాసులో పోసి తెచ్చింది హేమలత.

కామేశ్వరి అందుకుని మెల్లిగా తమ్ముడి నోటికి అందించింది. మరో అయిదు నిమిషాల్లో పూర్తిగా తేరుకున్నాడు ఆనందరావు. కళ్లు విప్పి అందర్నీ ఆశ్చర్యంగా చూశాడు. తననే ఆత్రుతగా చూస్తున్నవాళ్ళని చూసి 'ఏమైంది?' అనడగబోయి చివాల్న లేచి కూర్చున్నాడు.

"నా ఉత్తరాలు...నా లెటర్స్" అన్నాడు.

చుట్టూ చూసి ఫాన్ గాలికి ఎగిరి మూలకుపోయిన కాగితాల్ని తెచ్చి ఆనందరావు చేతిలో పెట్టాడు మధుసూదన్.

"తమ్ముడూ..ఏమిటిరా ఇది. ఏమైంది నీకు?'' అన్నాడు సహనం కోల్పోయిన భాస్కర్రావు.

తలెత్తి అందర్నీ చూశాడు ఆనందరావు. అతని కళ్లు తడిగా వున్నాయి. "అన్నయ్యా" అన్నాడు.

"చెప్పరా తమ్ముడూ!" అంటూ పక్కన వచ్చి కూర్చున్నాడు భాస్కర్రావు.

"అన్నయ్యగారూ!" అన్నాడు

"ఆ ఇక్కడే వున్నాను. చెప్పు ఆనందరావ్" అన్నాడు మధుసూదన్ రెండో వైపు కూర్చుంటూ.

"మామయ్యా!" అన్నాడు ఆనందరావు.

"చెప్పరా ఆనందాయ్" తల నిమిరాడు సూర్యం.

"మావయ్యగారూ! అన్నాడు.

"ఏం బాబూ! ఏం కావాలి చెప్పు?" అన్నారు తిలక్ బాధగా.

అందరినీ మరోసారి చూశాడు. భాస్కర్రావు మీద చూపు నిలిపి

"అన్నయ్యా! నా భార్య భార్యకాదు ప్రేయసి" అన్నాడు గంభీరంగా. తెల్లబోయారందరూ.

"నీ భార్య భార్యకాదా! ప్రేయసా?" అన్నాడు మధుసూదన్ ఆశ్చర్యంగా.

"అవును. అంతే కాదు. నా ప్రేయసి ప్రేయసి కాదు. భార్య" అన్నాడు

సూటిగా మధుసూదన్‌వంక చూస్తూ.

ఇదంతా చూస్తున్న తిలక్‌గారికి దుఃఖం పొర్లుకువస్తోంది. 'నిజంగా ఇతనికి పిచ్చే. మోసం జరిగిపోయింది. నిజంగా పిచ్చి వాడే ఇతను' అనుకుంటూ తీక్షణంగా సూర్యం వంక చూశారు. ఆ చూపులు ముళ్ళలా గుచ్చుకున్నాయి సూర్యానికి.

వెంటనే "ఒరే ఆనందూ! ఏమిటిరా నీ వాగుడు. మాకు ఒక్కముక్క అర్థం కావడంలేదు" అన్నాడు విసుగ్గా.

"అదే మామయ్యా! సోనీ సోనీకాదు-స్వర్ణ. స్వర్ణ స్వర్ణ కాదు సోనీ"

ఇక భరించలేక తమ్ముడి చేతిలోని కాగితాల్ని బలవంతంగా లాక్కున్నాడు భాస్కర్రావు.

ఒక్క ఉదుటున మంచం మీంచి దూకి భాస్కర్రావు చేతిలోని గులాబి రంగు కాయితం లాగేసుకున్నాడు ఆనందరావు.

"అన్నయ్యా! సారీ, ఇది నాపర్సనల్ లెటర్. అది కావాలంటే చదువుకో" అంటూ బైటకు పరిగెత్తాడు. మళ్ళీ వెనక్కి వచ్చి-

"వదినగారూ! స్వర్ణ గది ఏది?" అనడిగాడు హేమలతని.

అయోమయంగా బైటికి వచ్చి అతనికి స్వర్ణలత గది చూపించి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయింది హేమలత.

అప్పటికి చేతిలోని ఉత్తరం ముగించి నోటమాట రానట్లు, నమ్మలేనట్లు నిలబడి పోయాడు భాస్కర్రావు. వెంటనే సూర్యం ఆ ఉత్తరాన్ని చదివాడు. అతని కళ్ళు చెమర్చాయి. 'ఎంత విచిత్రం' అనుకున్నాడు.

"ఏమిట్రా గొడవ. ఆ ఉత్తరమేమిటి? నాకేమీ అంతు బట్టడంలేదు" అన్నారు తిలక్.

"చెప్తాను వినండి" అంటూ అందర్నీ చుట్టూ కూర్చోబెట్టుకుని కథ మొదలు పెట్టాడు సూర్యం.

భాస్కర్రావు మౌనంగా కిటికీదగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు. అతని వెనకే వెళ్ళింది అన్నపూర్ణ.

"పూర్ణా! ఇది ఏ సినిమాలో ఏ సంఘటనలా వుందో చెప్పలేదేం?" అన్నాడు చిరునవ్వుతో.

"లేదండీ! ఇలాంటి సంఘటన ఏ సినిమాలోనూ లేదు. ఇక వీళ్ళ కథ సినిమాలా తియ్యాలి ఎవరైనా" అంది.

హేమలత చెప్పిన గదిముందు ఆగి టకటక తలుపు శబ్దం చేశాడు ఆనంద రావు. మంచం మీద కూర్చున్న స్వర్ణలత ఉలిక్కి పడిలేచి తలుపు దగ్గరికి వచ్చింది.

"సోనీ...స్వర్ణా!" అన్న పిలుపు విని పించి గుండె ఝల్లుమంది స్వర్ణలతకు.

చిలిపి ఆలోచన వచ్చి గోడపక్కగా నిలబడి కర్టెన్ చేత్తో పట్టుకుని చెయ్యి సాచి తలుపు గడియతీసి కర్టెన్ చాటుకి తప్పుకుంది.

శరవేగంతో గదిలోకి వచ్చాడు ఆనందరావు.

గది అంతా కలయ వెదికాడు. మంచం మీద కుప్పగా పడివున్నాయి విప్పిన పట్టుచీరలు. గదిలో ఓ మూల గుట్టగా పోసివున్న ప్రజంటేషన్లు, మరో మూల వాడిపోయిన నిన్నటి పూల దండలు, ఓపక్క పంచగా మిగిలిపోయిన శుభలేఖలు...నానా చెత్తా చెదారం నిండి వుంది గదంతా. స్వర్ణలత మాత్రంలేదు. చుట్టూ మరోసారి చూస్తూ "సోనీ" అని పిల్చాడు.

కర్టెన్ చాటున దాక్కుని వున్న స్వర్ణ

అతనికి కనిపించలేదు.

"స్వర్ణా! ఇంకా దాగుడుమూతలా" అన్నాడు ప్రేమగా- మరోసారి గది నాలుగు మూలలా దృష్టిసారించి.

కర్టెన్ కిందనుంచి పాదాలు కనిపించాయి. అతను తనవైపు చూడగానే కర్టెన్ వదిలేసింది స్వర్ణలత.

స్వర్ణలతను ఒక్కసారి కనులారా చూసుకున్నాడు. మరుక్షణం అతని కౌగిలిలో నలిగిపోయింది స్వర్ణలత. ఊపిరి తిప్పుకోనివ్వకుండా ముద్దుల వర్షం కురిపిస్తున్న అతని ఆవేశానికి తట్టుకోలేక ఉక్కిరి బిక్కిరి అయిపోయింది.

"మై లవ్, మై వైఫ్, నా సోనీ, నా స్వర్ణా, మై లైఫ్..." అంటూ ఆవేశంగా తనను పెనవేసుకుపోయిన భర్తను మురిపెంగా చూసుకుని నవ్వుకుంది స్వర్ణలత.

మెల్లిగా చెయ్యిజాపి అతని తల నిమిరింది. తలెత్తాడు ఆనందరావు. వెంటనే స్వర్ణని రెండు చేతులతోనూ పైకెత్తి-

"పద వెళ్లిపోదాం" అన్నాడు.

"ఎక్కడికి?" అంది అతని మెడ చుట్టూ చేతులువేసి.

"మనిద్దరంతప్ప ఎవ్వరూ లేని ఏకాంతానికి" అన్నాడు పరవశంగా.

"ఇప్పుడిక్కడ వుంది మనమిద్దరమేగా?" అంది చిలిపిగా నవ్వుతూ.

"అమ్మ దొంగా!" అంటూ మెల్లిగా కిందికి దింపాడు. ఆమె కళ్ళమీద పెదవులానించి-

"స్వర్ణా! నాకోసం కలలుకని అలసిపోయాయి కదూ ఈ కళ్లు? ఇక నువ్వు కన్న కలలన్నీ నిజంచేసి చూపిస్తాను స్వర్ణా! నువు కోరుకుంటున్న జీవితం నీకు అందేలా చేస్తాను" అన్నాడు.

"ఏంకాదు! మీ మాటల్లో నాకు నమ్మకం లేదు. అన్నీ అబద్ధాలు చెప్తారు మీరు"

ఆశ్చర్యంగా చూశాడు ఆనందరావు.

"నేనా? ఇపుడు నీకేం అబద్ధాలు చెప్పాను?"

"కాదామరి? సోనీ కనిపిస్తే చెంపలు వాయిస్తానూ అన్నారు. మరి ఇపుడేమో..." అంటూ ఆపేసింది స్వర్ణ- చిలిపిగానవ్వుతూ, సిగ్గుగా తలవంచుకుని.

స్వర్ణలత చెంపలు ఎర్రబడిపోయాయి అప్పటికే. వాటిని మరింత ఎర్రబడిపోయేలా ముద్దుపెట్టుకున్నాడు ఆనందరావు.

"స్వర్ణా! నీ ఉత్తరంలో మల్లెల పాన్పుమీద నన్ను వదిలేసి నిర్దాక్షిణ్యంగా సగంలో మాట మార్చేశావు. ఎన్ని రాత్రులు నిన్ను తల్చుకుని బాధపడ్డానో తెలుసా? ప్లీజ్! ఇపుడు పూర్తిగా చెప్పవూ..." అని బతిమాలాడు.

అతని గుండెల్లో తలదాచుకుని సిగ్గుపడింది స్వర్ణలత.

"ప్లీజ్! చెప్పవూ...?" అన్నాడు మరింత వేడుకోలుగా.

"ఎలా చెప్పను? మల్లెల మంచం లేదుగా?"

"మల్లెల మంచం వుంది స్వర్ణా! పైన గదిలో వుంది. ప్రస్తుతం దానిమీద మీ నాన్నగారు, మా అన్నయ్య, మామయ్య, మీ బావగారు కూర్చుని ఉన్నారు. అందుకే ఈ పట్టుచీరల మంచాన్ని మల్లెల మంచం అనుకుందాం..." అంటూ స్వర్ణలతని పొదివి పట్టుకుని మంచంవేపు నడిచాడు ఆనందరావు.

**'శుభం'**

# పాదయాత్ర

## చతుర కథలు

ఎప్పుడూ కార్లలో తిరగడం తప్ప కాలు కింద పెట్టి ఎరుగని మాజీ మంత్రి రాజుగారు హఠాత్తుగా పాదయాత్రకు నిర్ణయాన్ని తీసుకోవడం అందరినీ ఆశ్చర్యంలో ముంచింది.

"దేశంలో నానాటికీ అరాచకం పెరిగి పోతోంది. మనిషి కంటే ముందు ధరలే అంగారక గ్రహాన్ని చేరుకుంటున్నాయి. రాష్ట్రంలో ప్రభుత్వం వుండీ ప్రయోజనం లేదు. ప్రజలకు రక్షణ కరువయింది... కనుక ప్రజలను ఉత్తేజితుల్ని చేయడానికే నేనీ పాదయాత్రను తలపెట్టాను" అంటూ ఓ స్టేట్‌మెంట్ జారీ చేసారు రాజుగారు.

"రాజుగారు గాంధీగారి నిజమైన శిష్యులు. అందుకే ప్రజల కష్టాలను ప్రభుత్వపు దృష్టికి తెచ్చే నిమిత్తం ఈ అహింసా మార్గాన్ని ఎన్నుకున్నారు" అంటూ ప్రచారం చేసారు రాజుగారి మనుషులు.

రాజుగారు గుంటూరు నుండి ఏలూరు వరకు పాదయాత్ర చేయబోతున్నారని తెలియడంతో ప్రభుత్వం కంగారు పడింది. ఎలాగైనా దానిని ఆపాలన్న ఉద్దేశ్యంతో రాజుగారితో సంప్రదింపులు జరిపింది ప్రభుత్వం. తన నిర్ణయానికి తిరుగులేదన్నారు రాజుగారు. ప్రభుత్వం రంగప్రవేశం చేయడంతో మరింత ప్రాముఖ్యత పెరిగింది రాజుగారి ప్రతి పాదనకు. పత్రికలన్నీ పెద్దగా పబ్లిసిటీ ఇచ్చాయి.

అనుకున్న రోజున రాజుగారి పాదయాత్ర ప్రారంభమయింది. ఆయనతో పాటు ఓ వంద మంది రాజుగారి పక్షపు మనుషులు కూడా బయలుదేరారు. వారికి తోడు మరో నూరుమంది పోలీసులూ కదిలారు.

గుంపుకు ముందు ఓ డి.ఎస్.పీ, వెనుక మరో ఎ.ఎస్.పీ., మధ్యా,చుట్టూరా యూనిఫామ్స్‌లోనూ, మఫ్టీలోనూ వున్న పోలీసులూ మొత్తం వెరసి రెండువందల మంది పాదయాత్ర గుంపు తయారయింది. గుంటూరు నుండి ఏలూరు కాలినడకను వెళ్ళడమంటే మాటలుకాదు. పాదయాత్ర ఆరంభించిన రాజుగారినీ, బందోబస్తుకు పంపించిన ప్రభుత్వాన్నీ మనసులోనే బండబూతులు తిట్టుకుంటూ వుసూరు మంటూ అనుసరించారు వాళ్ళందరూ.

ఒక్కో ఊరే వెళుతూంటే రాజుగారికి బ్రహ్మరథం పడుతున్నారు ప్రజలు. "రాజుగారికీ జై...ప్రభుత్వం డౌన్ డౌన్... ధరలు తగ్గించాలి... ఇంటికోమనిషికైనా ఉద్యోగ మివ్వాలి..." అంటూ నినాదాలు మార్మోగుతున్నాయి.బొత్తిగా అలవాటు లేని నడక కష్టంగావున్నా పెదవులపైన చిరునవ్వు

మాత్రం చెదరకుండా ఉపన్యాసాలు ఇస్తున్నారు రాజుగారు దారిలోని ఊళ్ళల్లో.

అలా అనుకున్న దూరంలో సగం నడిచేసరికి రాజుగారి ఆరోగ్యం దెబ్బ తింటున్నట్లు వార్తలందడంతో శాసన సభలో దుమారంరేగింది. వ్యతిరేక పక్షాలన్నీ ప్రభుత్వాన్ని దుయ్యబట్టాయి రాజుగారి పాదయాత్రకు కారణం ప్రభుత్వమేనంటూ. చివరకు అన్ని పక్షాలూ



ఏకమై రాజుగారికో విజ్ఞప్తి చేశాయి- రాజుగారి పాదయాత్రవల్ల అటు ప్రజల లోనూ ఇటు ప్రభుత్వంలోనూ చైతన్యం కలిగించవనీ, రాజుగారిక పాదయాత్ర చాలించవలసిందనీను.

వారి విజ్ఞప్తిని మన్నించిన రాజుగారు అంతటితో తమ పాదయాత్ర ఆపి స్వగ్రామానికి బయలుదేరారు.

విజయవంతంగా పాదయాత్రచేసి వచ్చిన రాజుగారికి ఆ ఊరివాళ్ల బ్రహ్మ రథం పట్టారు. ఘనంగా సన్మానాలు చేశారు.

ఆ రాత్రి...

వాచిపోయిన కాళ్ళకు కర్పూరతైలం మర్దన చేయించుకుంటూన్న భర్తతో రాజు గారి భార్య "ఎలెక్షన్లు ఇంకా రెండు మూడేళ్లున్నాయికదా? ఇప్పుడే పాద యాత్ర చేసేస్తే అప్పటికి ప్రజలు మరిచి పోరూ? అనవసరమైన ఈ శ్రమ ఇంత హఠాత్తుగా ఎందుకు తీసుకున్నట్లో" అంది విసుగ్గా.

"పిచ్చిదానా! మొన్న కీళ్ల లాగు తుంటే డాక్టర్‌గారి దగ్గరకు వెళ్లానే. ఎప్పుడూ కార్లలో తిరుగుతూ వుండటం వల్ల, నడక బొత్తిగా లేకపోవడంవల్ల కాళ్ల

పట్టేసాయనీ, కొన్నాళ్ళపాటు రోజూ పది పదిహేను కిలోమీటర్ల దూరం నడిచే కీళ్ళనొప్పులు వాటంతటవే తగ్గిపోతాయనీ, మందులు వాడనవసరంలేదనీ సలహా ఇచ్చాడు డాక్టర్. అంత దూరం ఎలాగూ నడవక తప్పడంలేదుగదా అని దాన్ని ఈ విధంగా సద్వినియోగం చేసుకున్నానే" అన్నారు రాజుగారు చిద్విలాసంగా.

'హారా!' అంటూ ముక్కుమీద వేలు వేసుకోబోయి పొరపాటున కంట్లో పొడుచుకుని కెవ్వుమంది రాజుగారి భార్య.

— తిరుమలశ్రీ

# కవి కాలం

ఇల్లు మారాడు వెంకట్రావు. ఈ విషయంలో వెంకట్రావు ఓపికమంతుగనే చెప్పుకోవాలి. ఆ సమయానికి వాళ్ళావిడ పుట్టింట్లో వుంది. మూటలూ, ముల్లెలూ సర్దుకొని చివరికి చీపురుకట్టతోసహా ఏ వస్తువూ వదిలిపెట్టకుండా ఒక్కచేతి మీదుగా ఇల్లు మార్చడమంటే మాటలా!

'ఈ ఇల్లు చూడంగానే రమ దంగైపోతుంది' అనుకున్నాడు వాళ్ళావిడ నుద్దేశించి. గదులు విశాలంగా వున్నాయి. ఇంటి ముందు బాదంచెట్టు కింద సాయంత్రంపూట తనూ, శ్రీమతీ కుర్చీలు వేసుకుకూర్చొని కబుర్లు చెప్పుకోవచ్చును.

ఇల్లయితే మార్చాడు కానీ, మూటా ముల్లె విప్పుకోడానికి ఒళ్లొంగలేదతనికి. 'రమ వచ్చాక విప్పుకొంటుందిలే. అంతగా అయితే అప్పుడు సాయం చేయవచ్చును' అనుకొన్నాడు.

మర్నాడుదయాన్నే లేచిన వెంకట్రావు తన మంచంపక్కనుండి చీమలు బారుగా వెడుతూండడం చూశాడు. అవి ఎక్కణ్ణుంచి వస్తున్నాయబ్బా అని దృష్టి సారించాడు.

సామాను మూటల్లో ఒక దాన్లోంచి చీమలు వస్తూపోతూ వున్నాయి. లోపలికి వెడుతున్న చీమలు మామూలుగానే ఉన్నాయి. కాని బయటకి వస్తున్నవాటి మీసాలు తెల్లగా వున్నాయి. 'భలే! ఇవి ముసలి చీమలమల్లే వున్నాయే!' అనుకున్నాడు ఒకనిముషం. కానీ ఆ తెల్లటి పదార్థం పంచదార అని గ్రహించటానికి అట్టేసేపు పట్టలేదతనికి.

ఇష్టం లేకపోయినా ఓపిక చేసుకొని ఆ మూటవిప్పి పంచదారకు పట్టినచీమల్ని దులిపి, డబ్బామూత గట్టిగా పెట్టాడు. 'సాయంత్రం ఆఫీసునుండి వచ్చేటపుడు గమాక్సిన్ తేవాలి' అనుకున్నాడు.

సాయంత్రం ఇంటితాళం తెరచి లోపలికి అడుగు పెట్టిన వెంకట్రావుకి తాను గమాక్సిన్ తేలేదన్న విషయం గుర్తొచ్చింది. అతనికి విషయం అంత అకస్మాత్తుగా గుర్తుకు రావడానికి కారణం మరో బస్తా మూటలోంచి బయటకు వస్తున్న చీమలదండు.

బట్టలు మార్చుకొని చీమలు పట్టింది దేనికో తెలుసుకోవడానికి పదినిమిషాలు పట్టింది. ఇంతకీ చీమలు వాళ్లావిడ పెట్టిన ఊరగాయల్ని రుచి చూస్తున్నాయి. అప్పటికి బజారుకెళ్లే ఓపిక నశించింది వెంకట్రావుకి. అదీగాక ఎదురుగా చంటిగాని కోసం కొన్న ఆముదంసీసా కనిపించింది.

సీసాడు ఆముదాన్ని జాడీలచుట్టూ పట్టించి గోడవారగా పెట్టి అమ్మయ్య అని ఊపిరిపీల్చుకొన్నాడు. వాళ్లమ్మమ్మ ద్వారా సంక్రమించిన జ్ఞానం ఈ విధంగా

ఉపయోగపడింది.

రెండోరోజు పొద్దున్న దంతధావన కానిస్తున్న వెంకట్రావు మ్రాన్పడి పోయాడు మరొక పిపీలిక సైన్యాన్ని చూసి. 'ఇదెక్కడి గొడవరా బాబూ— ఈ పూటైనా గమాక్సిన్ తేవాలి' అనుకొన్నాడు.

ఇంతలో అతనికి మెరుపులా తన




మూటలు సర్దేటప్పుడు గమాక్సిన్ పొట్లం చూసినట్లుగా గుర్తొచ్చింది. 'అవును. నిజంగానే వుంది. కాకపోతే ఏ మూటలోనో చూసుకోవాలి.'

గోనెమూట విప్పేశాడు. ఒక్కొక్క డబ్బాతీసి బయట పెడుతున్నాడు. లోపలిగా అట్టపెట్టె కనిపిస్తోంది. అందులోంచే పుట్టలుపుట్టలుగా చీమలు. 'ఏంటబ్బాఅది?' చీమలు తనను కుట్టకుండా చివర్లో పదిలంగా పట్టుకుని పెట్టెనుపైకి తీసాడు. దానిపై రాసిన అక్షరాలు చదువుతూండగానే అతని చేతులు పట్టుతప్పి ఆ అట్టపెట్టె కిందపడిపోయింది.

"కలికాలం ప్రభూ!" స్వగతంలా అన్నాడు వెంకట్రావు ఎదురుగుండా వున్న భగవానుడి పటంతో.

"కలికాలం కాదురా భక్తా! ఇది కల్తీకాలం" అన్నట్లుగా చిరునవ్వు నవ్వుతున్నాడు గోడకు వేళ్లాడుతున్న ఫర్టిలైజరు కంపెనీ క్రిష్ణపరమాత్మ.

ఇంతకీ ఆ అట్టపెట్టెమీద ఇంగ్లీషులో 'గమాక్సిన్' అని రాసుంది.

—వరిగొండ కాంతారావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 004.

